# తొలిపలుకు

సంస్కృత రూపక రచయితలలో నగ్రగణ్యులగు కాళిదాసాదులకును మార్గదర్శకుఁడగు భాసమహాకవి పేరువినని వారుండరు. ఈ వసంతసేన భాసమహాకవికన్న కూతురు. ఈమెను రాజకవి, కవిరాజునగు శూద్రకుఁడు తెచ్చి పెంచి సర్వశోభలు నెలార్చి సర్వ సంపదలలో మహారాజ్ఞిగా నొనర్చినాఁడు. ఈమె సర్వసద్గుణ సంపత్తిచే నలరారు సార్థవాహ బ్రాహ్మణయువకుఁడు దరిద్ర చారుదత్తుని వరించినది. కష్టములకు గురియయ్యును నాతనిని విడనాడక సర్వవిధముల నాదర్శ యువతియైనది. ఇదియే మృచ్ఛకటికము.

అతిరమణీయమును నతిసుకుమారమునగు మృచ్ఛకటికమునే యాధారముగాఁ గొని యీ నవలారచన చేసితిని. కథాక్రమ మందెట్టి మార్పును చేయలేదు. యథోచితముగా నవలకనుగుణముగా నలఁతియలఁతి మార్పులు

మాత్రమే చేయఁబడినవి. చిత్రచిత్రములగు సన్నివేశములతోఁ గూడిన యీ కథను విద్యార్థులకుఁ బరిచయము చేసినచో వారలకు భాసనాటకులందు గౌరవముగలుగు ననియే నా భావన. అది జరిగిననాఁడు నా పడినపరిశ్రమ ఫలించిన దగును.

ఆంజనేయశాస్త్రి.



# అలంకారన్యాసము

## ౧

సాయంకాలమయ్యెను. అస్తమించుచున్న సూర్యుని కెంపువెల్గులు అవంతీనగరమునఁదీర్చిన రాజవీథులందుఁ గాశ్మీరజలముతోఁ గలయంపి జల్లినట్లు వింతసోయగములఁ జిమ్ముచుండెను. ఆసమయమున వసంతసేన కతిపయపరివారముతోఁ గూడి మార్గమున నేఁగుచుండెను. దూరమునుండి యిద్దరుముగ్గురు పురుషులామెనుఁ జూచి వెంబడింపసాగిరి. అందొకఁడు శకారుఁడు. రెండవవాఁడు విటుఁడు. మూఁడవవాఁడు చేటుఁడు. ఈశకారుఁడు అవంతీనగరమునకు రాజైన పాలకుని యుంపుడుగత్తెకుఁ దమ్ముఁడు. పాలకుఁడు వీనిని నగరరక్షకుల కధికృతునిఁ గావించెను. అసలేరాజశ్యాలుఁడు. అందులోనధికారముకూడ.

శకారుఁడు వసంతసేన నెన్నాళ్ళనుండియో కామించెను. ఆమె నెట్లైనను లోఁగొనవలయునని పొంచియుండెను. అతని కదను దొరకలేదు. నేడతఁడు విటచేటులతోఁ గలిసి సాయంవాహ్యాళి నేఁగుచుండగా వసంతసేన వానికన్నులకుఁ గాన్పించెను. రాజమార్గము నిర్జనమైయుండెను. పోవుచున్న వసంతసేనకు వెనుకనుండి తన్నెవరో వెంటాడుచున్న ట్లను

మానము గలిగెను. ఆమె వెనుదిరిగి చూచెను - విటశకారులు. వసంతసేన తొందరపడెను. ఆమె తనపరివారమునుండి దూరమై వడివడి నేగసాగెను. వెనుకనుండి "వసంతసేనా! నిలునిలుము! వేటకానినిఁ జూచిన లేడివలె బెదరుచూపులఁ జిమ్ముచుఁ బాఱిపోయెదవేల? నృత్యప్రయోగదక్షములగు నీపాదములు రాజవీధియందుఁ బరుగెత్తుటకు సమర్థములుగావు." విటుఁ డీవాక్యము లనుటనుఁజూచి శకారుండు "వసంతసేనా! వసంతసేనా! నిలునిలుము. పరుగెత్తకుము. నాపైనను గ్రహింపుము. నిన్ను నేనుచంపనులే. పండునిప్పులలోఁబడిన మాంసపుముక్కవలె నాగుండె కామాగ్నియందు వేగుచున్నది" నెను. వసంతసేన వారిట్లుమాట్లాడుట విని మిక్కిలిభయము చెందెను. క్రమముగాఁ గనుచీఁకటి గూడ వ్యాపించుచుండెను. ఈదుర్మార్గులు దౌర్జన్యమునకుఁగూడ దిగవచ్చును. ఆమె వడివడిగా నేగసాగెను. మఱలవిటుఁడు "వసంతసేనా! ఉండుముండుము. గాలికి లేతయరఁటి చెట్టువలెఁ గంపించుచు నేలపరుగెత్తెదవు? నీవుపోయినత్రోవ యెల్లపడుచున్న యీయొడ్డుగలువలనుఁబట్టి నిన్ను గుర్తింపఁగలము." మఱలశకారుఁడు "వసంతసేనా! ఉండుముండుము. భయపడి యెక్కడకుఁ బారిపోయెదవు? రావణునిచేతులోఁబడ్డ కుంతివలె నీవు నన్నుఁ దప్పించుకొననేరవు."

మరల విటుఁడు :— "వసంతసేనా! గరుత్మంతునకు వెఱచిన పన్నగివలె నేలవడిగాఁ బరుగెత్తెదవు? పట్టుకొన దలఁచిన గాలినైననుఁ బట్టగలను. నిన్ను మేము పట్టుకొనుటకు రాలేమ. అంతభయమేల? నిలు నిలుము". మఱల శకారుఁడు

"వసంతసేనా! వసంతసేనా! రామునకు వెఱచి పాఱెడు ద్రౌపదివలె గలగలలాడుచుఁ బరుగెత్తెదవేల? విశ్వావసువు చెల్లెలు సుభద్రను హనుమంతుఁడువలె నిన్ను హరింపఁగలను." వసంతసేన యట్లే యేఁగుచుండెను. విటశకారు లామెను సమీపించుచుండిరి. క్రమ క్రమముగాఁ జీఁకటి వ్యాపించుచుండెను. బారెడు దూరమున మనుష్యుఁడు గన్పించుటలేదు. విటశకారులు చేరువ కరుదెంచిరి. వసంతసేన "పల్లవికా! పల్లవికా! పరభృతికా! పరభృతికా"యని పరివారమును బిలచెను. పరివార మిదివఱకే తప్పిపోయిరి. వసంతసేన కంఠస్వరమును విని శకారుఁడు మనుష్యులెవరో వచ్చుచుండిరని భయమందెను. విటుఁడు "ఓరీ మూర్ఖుఁడా! ఆమె పరిజనమున న్వేషించుచున్నది.

శకారుఁడు:... వారు పురుషులా? స్త్రీలా?

విటుఁడు:... స్త్రీలే.

శకా:— స్త్రీలైనచో వందమందినైననుఁ జంపగలను. నేనుశూరుఁడును.

వసంతసేన పరివారమును మఱల బిలచెను. ఆమెకు మిక్కిలి భయము వేసెను. పరిజనమందరు నెవరిత్రోవన వారేగిరి. ఆమెతన్నుఁ దానే రక్షించుకొనవలెను.

శకా:— వసంతసేనా! పల్లవికనుఁ బిలువుము. పరభృతికనుఁ బిలువుము. వసంతమాసము నంతయుఁ బిలువుము. నేను వెంటాడుచుండ భీమసేనుఁడు, పరశురాముఁడు, అర్జునుఁడు, రావణుఁడు, ఎవఁడైన నిన్ను రక్షింపఁగలఁడా? ఇదిగో! దుశ్శాసనునివలెఁ గొప్పు పట్టి యీడ్చెదను. ఇదిగో చూడు!

చూడు ! అందమైన నీతల నీక త్తితో ( ద్రెంపము దువా ?
ఎందుకు బరువెత్తెదవు ? చావు సమీపించిన నెవడు
బ్రతుకఁగలఁడు ?

వసంతసేన:— అయ్యా ! నేనబలనుఁగదా ?

విటుఁడు:— అందువలనే జీవించితిని.

శకారుఁడు:— అందుకనే చంపలేదు.

అతని యనునయముగూడ నామెకు భయము గలిగించెను. వాఁడు వట్టిక్రూరపశువు. ఏమి చేసినను జేయఁగలఁడు. వీనినుండి తప్పించుకొను నుపాయమెద్ది ? ఆమె యాలోచించి యిట్లనెను. "ఓయీ! మీకు నగలు కావలయునా!" ఆమాటలు విని విటుఁడు "వసంతసేనా ! ఉద్యానలతనుండి పువ్వుల రాల్తుమా? నీయలంకారములేల? మాకుఁ గావలసినది వేరు.

వసంతసేన:— అది యేమి?

శకా:— ఇదిగో! నేను పరపురుషమనుష్యుఁడను. వాసుదేవుఁడను. నన్నుఁ గామించుము.

వసంతసేన కామాటలు విని మిక్కిలి కోపము గలిగెను. ఆమె శకారుని మిక్కిలి తిరస్కరించి మాట్లాడెను. విటుఁ డామెనుఁ బ్రసన్ననుఁ జేయఁదలఁచి యిట్లనెను. "వసంతసేనా! వేశ్య కులమునకు విరుద్ధముగాఁ బల్కితివి. ఇదిగో! చూడు. నీవు మార్గమునందుఁ బుట్టిన లతవంటి దానవు. శరీరమును ధనమున కమ్ముకొనునీకుఁ బ్రియుఁడని యప్రియుఁడని భేదమేమి? అదియుఁగాక బ్రాహ్మణుఁడు స్నానమాడు నూతిలో నధమకులుఁడును స్నానమాడుట లేదా? నెమిలి యెక్కిన లతనుఁ గాకి యెక్కుటలేదా?

(బ్రాహ్మణ క్షత్రి) వైశ్యు లెక్కిన నావ నితరు లెక్కుట లేదా? అట్లే వేశ్యవగుటచేత నీవు సర్వజనులను భేదము లేక సేవింపఁదగును.

వసం:— ఓయీ! అనురాగమునకు గుణము కారణముగాని ధనము గాదు. ఆమాటలు వినుట తోడనే శకారున కొడలు మండుకొనిపోయెను. ఈగర్భదాసి వేశ్య చారుదత్తునిఁగూర్చి యీమాట లనుచున్నది. "బావా! బావా! ఈగర్భదాసి కామదేవా యతనోద్యానమున నాట్యముచేసిన నాటనుండి యాదరిద్రచారుదత్తునియం దనురక్తయై నన్నుఁ గామించుట లేదు. ఇదిగో! వానియిల్లు ఈయెడమ ప్రక్కన నున్నది. ఈముండ మనచేతులనుండి జారిపోవచ్చును. జాగ్రత్తసుమా!" చారుదత్తుని పేరు వినుటతోడనే విటున కీమాటలు సంతోషకారణ మయ్యెను. "రత్నం రత్నేన సంగచ్ఛతే" వసంతసేన ఆర్యచారుదత్తునిఁ గామించుట మిక్కిలి యుక్తముగా నున్నది. ఆయనయిల్లు ప్రక్కనే యున్నదా? ఈ మూర్ఖుఁ డేది కూడదో యదియే చెప్పును. వీనితో నేల? వసంతసేన నచ్చటికే పోని మ్మనుకొని యిట్లనెను "ఏమిటి? ఆవర్తకునియిల్లు ఎడమప్రక్కన నున్నదా?

శకా:— అవును. ఆదరిద్రుని గృహ మెడమవైపుననే యున్నది. వసంతసేన కీమాటలు చెవులలో నమృతము చిందిన ట్లయ్యెను. ఎడమప్రక్క నాతనియిల్లా? నిజమే కావచ్చును. ఈదుర్మార్గుఁ డపరాధియైనను నుపకారమే యొనరించెను. ఈవిధముగాఁ బ్రియసంగమము గలుగఁ గలదు." అని యనుకొని యాయంధకారమునందుఁ బ్రక్కప్రక్కల

కొ త్రిగిలుచు గనుమఱఁగెను. అంధకారము కన్నుకన్ను పొడుచుకొనినను గానవచ్చుట లేదు. కళ్లు తెఱచుకొన్నను మూసికొనినట్లే యున్నది. చీకటి తీఁగెలుసాగి శరీరము నల్లుకొనుచున్నదా? ఆకసము గాటుక కురియుచున్నదా? అట్టి చీకటిలో శకారుఁడు వసంతసేనకై వెదకుచుండెను. వసంతసేన కనుమఱఁగినను నామె యందెల రవళి వినవచ్చుచునే యుండెను. శకారుఁ డీరవళినిఁ బట్టి యామెనుఁ బట్టుకొనవచ్చును. విటున కది యిష్టము లేదు.

విటుః— "వసంతసేనా ! మబ్బు కడుపు లోనికిఁ బోయిన మెఱపుతీగ వలె యంధకారములోఁ గలిసిపోతివి. ఇదిగో ! నీకొప్పులోని పూలవాసనలు, నీ నూపుర ధ్వనులు నీ వెటు పోయినదియు మాకుఁ జెప్పుచున్నవి లే" యని యతఁ డామెను హెచ్చరించెను. వసంతసేన యామాటలనుఁ గైకొని మాల్యములను నూపురములనుఁ దొలఁగించి చారుదత్తుని గృహమువైపున కేఁగెను.

౨

"లోకమున సర్వజనులకు దారిద్ర్యముకంటె దుఃఖకరమగునది మఱియొకటి లేదు. దారిద్ర్యమెక్కడగలదో యక్కడ సర్వాపదలువచ్చి కూర్చుండును. ఎంత ప్రాణమిత్రుఁడైనను దరిద్రుఁ డనినంత దగ్గరకుఁ జేరఁడు. దరిద్రుఁడై ధనవంతుడైనచోఁ జీకటినుండి వెలుగు చూచిన వానివలె నది సుఖకారణము గావచ్చును. మఱి భాగ్యవంతుఁడై దరిద్రుఁడగు

వాఁడు బ్రతికియుఁ జచ్చినవాఁడే. దారిద్ర్యముకంటె మరణమే మేలు. మరణబాధ యొకక్షణమే. దారిద్ర్యము బ్రతికియున్నంత వఱకు బాధించును. ఇఁక బంధువుల మాట చెప్ప నక్కఱ లేదు. భార్యయే యనుకొమ్ము. కలనాఁడే గౌరవించును. దరిద్రుఁడైన తర్వాత లోకములో నుండుటకంటె నడవికేఁగుట మేలు. దరిద్రున కెల్లప్పుడును దుఃఖమే. ఈ దుఃఖము మొదలంటఁ దగులనైనఁ బెట్టదు". ఇట్లు విచారించుచు నాటి సాయంకాలమున చారుదత్తుఁడు తన యింటి ముంగిలి యందలి వేదికపై సర్వకాలమిత్ర మగు మైత్రేయుని రాకకై నిరీక్షించుచు కూర్చుండెను. చారుదత్తుఁడు బ్రాహ్మణయువకుఁడు. అతని పూర్వులు సార్థవాహవృత్తిచే కోట్లు గడించిరి. చారుదత్తుని యెముక లేని చేతి కవి యాఁగలేదు. పూర్వ మతని ముంగిలి యందు గృహదేవతల కిడ్డ బలి హంసలు, సారసములు, ఆప్యాయముగాఁ దినెడివి. ఇప్పు డాబలి ప్రదేశములందు గడ్డి పెరిగినది. ఇప్పు డాబలినిఁ గీటములు మాత్రమే ముట్టుచున్నవి. కాని యిది యేదియు చారుదత్తునకుఁ జింతాకారణము గా లేదు. అతఁడు దరిద్రుఁ డగుటచే యాచకులు మదముడిగిన యేనుఁగునుఁ దుమ్మెదల వలె వదలి వేసిరి. ఇది యొక్కటి మాత్ర మతని మనస్సును దహించు చుండెను. ధనముల కేమి ? భాగ్యక్రమమున ధనములు వచ్చును పోవును. ఆ సమయమున మైత్రేయుఁ డరుదెంచెను. అతఁడు జీర్ణవృద్ధుఁడను మాలాకారుని యొద్దనుండి జాజిపూల పరిమళ మద్దిన యుత్తరీయమును చారుదత్తునికై కొనివచ్చు చుండెను. ఈ మైత్రేయుఁ డొక్కఁడు లేమియం దైనను చారుదత్తుని

విడువని మిత్రుఁడు. చారుదత్తుఁ డీతనిని "సార్వకాలికమిత్రమా" యని సంబోధించును. కలనాళ్ళ నితఁడు చారుదత్తుని యింట గమ్మని వాసనలు గ్రక్కు మోదకములనుఁ దినుచు చుట్టుఁ ననేక విధములైన వ్యంజనము లమర్చిన గిన్నెలయందు వ్రేలు ముంచుకొని రుచి చూచుచు నగర చత్వరమందుఁ బంకుకొనిన వృషభమువలె నెమరువేసికొనుచుఁ గాలము గడిపెడివాఁడు. అట్టివాఁ డిప్పు డక్కడక్కడ దినుచు సాయంకాల మగుసరికి పెంపుడు పావురము గూటినిఁ జేరినట్లు చారుదత్తుని యింటికి వచ్చుచుండెను.

మైత్రేయుఁడు చింతాక్రాంతుఁడై కూర్చున్న చారు దత్తుని సమీపించి కుశల ప్రశ్న పూర్వకముగాఁ జూర్ణవృద్ధుఁ డిచ్చిన ప్రావారకమును సమర్పించెను. చారుదత్తుఁడు ప్రావారకమునుఁ గప్పుకొని విదూషకునిఁ జత్వరమందు మాతృకలకు బలికార్యము నిర్వర్తింపు మని కోరెను. విదూషకుఁడు నేను వెళ్ల ననెను.

చారు:— మైత్రేయా! అట్లనెద వేమి?

విదూ:— ఈ దేవతలఁ బూజించి యేమిలాభము? ఎంత పూజించినను వీరికి నీయందు దయ లేదు.

చారు:— అట్లుగాదు. ఇది గృహస్థులకు నిత్యవిధి. తపస్సుచేత, మనస్సుచేత, వాక్కుచేత, బలికర్మములచేత, బూజితులై దేవతలు పారలౌకిక సుఖముల నొసంగుదురు. కావున మాతృదేవతలకు బలినిఁ గొనిపొమ్ము.

విదూ:— ఓయీ! నేను వెళ్లను. ఇంకెవ్వరైననుఁ బంపుము. అద్దములోఁ బడ్డ నీడ ఎడమ కుడి, కుడి యెడమ

యయినట్లు నాతో గుణించినది సర్వము విపరీతముగానే పరిణమించుచున్నది. అదిగాక యీప్రదోష సమయమందు రాజమార్గమున వేశ్యలు, విటులు, చేటులు, రాజభటులు, తిరుగుచుందురు. కప్పకొఱకు వేచియున్న పాముబారి నెలుక పడ్డట్లు వారి కెదురుపడి నేను బ్రతుకగలనా? నీకేమి నీవిక్కడ కూర్చుందువు.

చారు:— మైత్రేయా నిన్ననవలసిన దేమున్నది? ఇది యంతయు దారిద్ర్య మాహాత్మ్యము. బంధువులైనను దరిద్రుని మాట వినరు. ప్రియస్నేహితులు గూడ వానియందు వైముఖ్యము వహింతురు. సర్వాపదలును వాని నెత్తిమీదకే వచ్చును. ప్రజలు వాని శీలమునందుఁగూడ దోష మారోపింతురు. ఇతరులు చేసిన పాపములుగూడ వానికే యంటగట్టుదురు. వానితో నొకఁడు స్నేహము సేయఁడు. ఆదరముగా మాట్లాడఁడు. పూర్వులు పంచ మహాపాతకము లనే చెప్పిరి. ఈ దారిద్ర్యమే నాకు మిక్కిలి స్నేహపాత్రముగా గోచరించుచున్నది. నన్నందరు వదలిరిగాని యిది మాత్రము వదలుటలేదు. పాపము నేను చనిపోయినచో నిది యెచ్చటకుఁ బోవును.

విదూ:— ఓయీ! సరే వెళ్ళెదను. నాకీరదనికనుఁగూడఁ దోడుపంపుము. చారుదత్తుఁడు మైత్రేయునకు రదనికనుఁ దోడుపంపెను. రదనిక దీపమునుఁ జేతఁగొని విదూషకు నను గమించెను. విదూషకుఁడు వీథిద్వారమునుఁ దెఱవగనే యచట నిలచియున్న వసంతసేన చీరచెఱఁగు విసరి దీపము నార్పి వారికిఁ గానరాకుండ లోని కేఁగెను. విదూషకుఁడు

గాలికి దీప మారిపోయినదని యెంచి రదనికచేతిలోని దీపము దీసికొని యామెను బయటకుఁ బంపి తాను దీపమును వెలిగించుకొని వచ్చుటకై లోని కేగెను.

బయట శకారుఁడువసంతసేనకై యన్వేషించు చుండెను. చీఁకటియం దతఁడుతిరిగితిరిగి విటునిఁ బట్టుకొని బావా! బావా! వసంతసేననుఁ బట్టుకొంటి ననెను.

విటు:— ఓరీ! మూర్ఖుఁడా! నేనురా !

శకారుఁడు విటుని వదలి మఱల వసంతసేనకై వెదకసాగెను. ఈసారి యతనికిఁ జేటుఁడు చిక్కెను.

శకా:—బావా! బావా! పట్టుకొన్నాను. పట్టుకొన్నాను.

చేటు:— అయ్యో! నేను చేటుఁడను.

శకా:— ఛీ! ఛీ! ఇక్కడ బావ. ఇక్కడ చేటుఁడు. మీరిద్దరు కదలకుండ నుండుడని మఱల వెదుకసాగెను. ఈమాఱతనికి రదనిక చిక్కెను.

శకా:— బావా! బావా! ఇదిగో యిప్పుడు దొరికినది వసంతసేన. ఈచీఁకటిలో బారిపోవుచున్న దీనిని మాల్య గంధము చేత గుర్తుపట్టితిని. చాణక్యుని చేతిలో ద్రౌపది జుట్టు చిక్కినట్లు దీనిజుట్టు నాచేతిలో చిక్కినది.

అని రదనికను జుట్టుపట్టుకొని లాగసాగెను. రదనిక భయపడి కేకలు పెట్టెను.

విటు:— ఓరీ! మూర్ఖుఁడా! ఇది వసంతసేన కంఠము గాదురా.

శకా:— బావా! బావా! మీఁగడ మీఁది యాసచేత పిల్లి స్వరమును మార్చినట్లే వసంత సేను పట్టుకొంటి నని కంఠము మర్చినది. అంతట విదూషకుఁడు దీపమును వెలిగిం

చుకొని లోపలినుండి వీథిలోనికి వచ్చి రదనికను బిలచెను. శకారుఁడు వాని కేక విని మనుష్యులు వచ్చుచున్నారని భయపడెను. విదూషకుఁడు వారినిఁ గాంచి "ఆర్య చారుదత్తుఁడు దరిద్రుఁడైనంత మాత్రమునఁ బరపురుషు లింటిలోఁ బ్రవేశించుచున్నారు. ఇది యుక్తముగా దని" వారి నదలించెను.

రదనిక:— మైత్రేయా! నాపరిభవమును చూడుము.

విదూ:— నీకా? మాకా? ५९।४

రద:— నావరిభవము మీది గాదా?

విదూ:— ఏమి నిన్నివరైన బలాత్కరించిరా?

రద:— అవును.

విదూ:— నిజముగా?

రద:— నిజముగా.

మైత్రేయునికి నిజముగాఁ గోపము వచ్చెను. అతఁడు చేతిలోని దండకాష్ఠము నెత్తి "ఎవఁడురా? స్వగృహము నందు కుక్క యయినను బరాక్రమము చూపును. మరి నేను బ్రాహ్మణుఁడను. ఇదిగో! నాయదృష్టమువలె వంకరగా నున్న యీ కొంకికఱ్ఱతో నీతల పగులఁగొట్టెద"ననెను.

విటు:— మహాబ్రాహ్మణ! క్షమించుము. క్షమించుము.

మై:—(విటునిఁ జూచి) వీఁడు కాదపరాధి. వీఁడై యుండును. (అని శకారుని జూచి) "ఓరీ! రాజశ్యాలకుఁడా! సంస్థానకుఁడా! దుర్జనుఁడా! దుర్మనుష్యుఁడా! యిదినీకుఁదగదు. చారుదత్తుఁడు దరిద్రుఁడైననేమి? అతని గుణములచే నీ

యుజ్జయినీపట్టణ మలంకృత మైనది. అట్టివాని గృహములోఁ బ్రవేశించి వాని పరిజనము నిట్లవమానించితివనెను.

విటుడు:— "బాబూ! క్షమించుము. క్షమించుము. ఇం కొక రనుకొని యీవిధముగాఁజేసితిమి. మి మ్మవమానింప వలయును ననిగాదు. మే మొక వేశ్యను వెదకుచు వచ్చితిమి. ఆమె చీఁకటిలోఁ దప్పించుకొని పోయినది. ఈమెనుఁ జూచి యామె యనుకొంటిమి. క్షమించు" మని చేతిలోని కత్తి వదలి మైత్రేయుని పాదములపైఁ బడెను. మైత్రేయుఁ డంతటఁ బ్రసన్నుఁడై విటుని లేవదీసి యనునయించెను. విటుఁ డీవృత్తాంతము చారుదత్తునకుఁ జెప్పవల దని బ్రతిమాలుకొనెను. శకారున కిదిచూచి యొడలు మండుకొని పోయెను. అతఁడు విటునిఁ జూచి "నీ వీదుష్టవటుని పాదములపై నేల పడితివి?" అనిప్రశ్నించెను.

విటు:— నేను భయపడితిని.

శకా:— ఎవరివలన నీకుభయము?

విటు:—ఆచారుదత్తుని గుణమువలన.

శకా:— తినుటకుఁ దిండిలేని యాచారుదత్తుని కున్న గుణము లేమిటివి?

విటు:— ఓయీ! అట్లనరాదు. గ్రీష్మకాలమునఁ దృషితుల దాహశాంతి యొనర్చి చెఱువెండిపోయినట్లు మాయట్టి వారిపై దయచేత నాతఁడెండిపోయెను. ఆతని ధన మెవ్వారికిని నవమాన కారణము గాలేదు.

శకా:— ఎవరయ్యా వాఁడు? వాఁడేమైన రావణునకు రాధయందు గలిగిన యింద్రదత్తుఁడా? లేక రామునకుఁ

గుంటికిఁ బుట్టిన యశ్వత్థామయా ? లేక ధర్మరాజు కొడుకు జటాయువా ? ఎవఁ డాముండకొడుకు ? అంత గొప్పగాఁ జెప్పెదవు ?

విటు:- మూర్ఖుడా ! అతఁ డార్య చారుదత్తుఁడురా ! అతఁడు దీనజన కల్పవృక్షము. సజ్జనుల కాశ్రయము. పండితుల కాదర్శము. చరిత్రమునకు గీటురాయి. వేయేల ? యతఁడు పురుషగుణములకు నిధి. నిజముగా బ్రతుకుచున్నవాఁడతఁ డొకఁడే. మనము వట్టి యూపిరి మాత్రము పీల్చుచున్నాము. పోవుదము పద.

శకా:- వసంతసేననుఁ బట్టుకొనకుండగనే ?

విటు: ఓయీ ? నీవిది వినలేదా ? ఆలానమున నేనుఁగును, పగ్గముల గుఱ్ఱమును గ్రహింపవచ్చును. స్త్రీని హృదయమునఁ గాని గ్రహింపరాదు. అది లేనప్పు డేల ? పోవుదము పద.

శకా:- నీవు వెళ్లినచో వెళ్లుము. నేను మాత్రము రాను.

విటు:- "నేను వెళ్ళుచుంటి"నని యచటనుండి వెళ్లెను. శకారుఁ డంతట మైత్రేయునిఁ గాంచి కోపముతో నిట్లనెను. "ఓరీ" కూలబడుము. కూలఁబడుము.

మై:- మే మిదివఱకే కూలబడితిమిలే.

శకా:- ఎవరిచేత ?

మై:- దైవముచేత.

శ:- అయితే నిలుచుండుము. నిలుచుండుము.

మై:- నిలుచుండెదములే.

శ:- ఎప్పుడు?

మై:- దైవ మనుకూలమైనప్పుడు.

శ:- ఒరేయి! యేడుపు మేడుపుము.

మై:- ఏడ్చుచునే యుంటిమి లే.

శ:- ఎందుకు?

మై:- నీబోటివారలచేత నవమానింపఁబడినందులకు.

శ:- అరే! నవ్వు. నవ్వు.

మై:- నవ్వెదము లే.

శ:- ఎప్పుడు?

మై:- మఱల చారుదత్తునికి భాగ్యముపట్టినప్పుడు.

శ:- ఒరే దుష్టబ్రహ్మచారీ! నే నంటినని యాచారు దత్తునితో నిట్లు చెప్పుము. "వసంతసేన యనుభోగముపిల్ల కామదేవాయత నోద్యానమున నాట్యముచేసిన నాటనుండి నీయం దనురక్తయై యున్నది. ఇప్పుడు నేను బలాత్కారముగా వెంటాడుచుండ నీయింటిలోఁ బ్రవేశించినది. నీవు స్వయముగా దానిని నాచేతులలోఁ బెట్టితివా సరే! లేదా నీకును నాకును మరణాంతమగు విరోధము పుట్టగలదు." ఇట్లని చారుదత్తునితోఁ జెప్పుము. జాగ్రత్తగాఁ జెప్పుము. నేను నీమేడమీఁద నెక్కి నీవు చెప్పెదవో లేదో వినుచునే యుందును. నేను చెప్పిన మాటలన్నియుఁ జెప్పకపోతివా! వెలగకాయవలెఁ దలుపుసందునఁ బెట్టి నొక్కినట్లు నీతలపందును పచ్చడి చేసెదను." అని శకారుఁడు మైత్రేయుని భయపెట్టి చేటునితోఁగూడఁ గలసి వెడలిపోయెను. మైత్రేయుఁడంత రదనికతోఁ జారుదత్తునితో నామెకు జరిగిన పరిభవ

మును నివేదించ వలదని యామెను వెంట నిడుకొని మాతృ దేవతలకు బలినిడుటకై చత్వరమున కేగెను.

# 3

వసంతసేన యట్లు రదనికామైత్రేయుల కనుమఱఁగి లోనఁ బ్రవేశించెను. లోపల నంతయుఁ జీకటి. ఆమె మెల్లగా నాచీఁకటిలోనే ముందునకుఁబోయెను. అచట చారుదత్తుఁడు గూర్చుండియుండెను. అతని సమీపముననే యైన దారేండ్ల బాలుఁ డొకఁ డారుబయట మంచముపైఁ బండుకొనియుండెను. కొంచెము చిఱుచలి వేయుచుండెను. వసంతసేన చారుదత్తుని జూచి యచటనే లజ్జితయై నిలచిపోయెను. చారుదత్తుఁ డామె నాచీఁకటియందు వసంతసేన యని గుర్తింపలేక పోయెను. అతఁ డామెను రదనిక యనుకొని "రదనికా! పిల్లవాఁడు బయట చల్లగాలికై పండుకొన్నాఁడు, కొంచెము చలి వేయుచున్నది. ఈ యుత్తరీయము వేసికిఁ గప్పి లోనికిఁ దీసికొనిపోయి పరుండఁ బెట్టు"మని పైయుత్తరీయమును జాజిపూల వాసనలు చిమ్మునట్లు వసంతసేన పైకి విసరెను. వసంతసేన చారుదత్తుఁడు తన్ను పరిజన మనుకొన్నాఁడని యెంచెను. ఆమె యతని వాక్యములకు మారుపలుకక యా యుత్తరీయమును సస్పృహముగాఁ గప్పుకొనెను. "ఔరా! ఈయుత్తరీయము జాజిపూల వాసన వేయుచున్నది. ఈతఁడు యౌవనము నందింకను నుదాసీనుఁడు గాలేదు." చారుదత్తుడు మఱల "రదనికా! రోహసేనుని లోనికిఁ గొనిపొమ్మ"ని పల్కెను. వసంతసేన మాఱు

మాటాడలేదు. చారుదత్తుఁ డామె మాటువలనమికి నాశ్చర్య పడుచు "రదనికా! నీకే చెప్పునది. జవాబుకూడలేదేమి?" యని కోపముతోఁ బల్కెను. సరిగా నామాటలప్పుడే లోనికి వచ్చిన మైత్రేయుని చెవులఁ బడెను. అతఁడు "ఓయీ! రదనిక యింకను వెనుకనే యున్నది. ఇదిగోఁ యెవరిని గోపపడెదవు?"

చా:- రదనిక అక్కడ నున్నదా? మఱి యీమె యెవరు? నేను పొరపాటున రదనికయనుకొని నాయుత్తరయము నీమెపై విసరితిని. దానిచే నీమె దూషిత మైనది.

వసంతసేన యీమాటలకు దూషితను గాదు భూషితనే యయితినను కొనెను.

మై:- ఓయీ! యీమె వసంతసేన. నీ వంత విచార పడ నక్కఱ లేదు. కామదేవాయత నోద్యానమున నాట్యము చేసిన నాటనుండి యీమె నీయెడ ననురక్త యైనది.

చా:- ఏమిటి? ఈమె వసంతసేనా? అవును. ఈమె యందు నాకు వలపు గలదు. అయిన నేమిలాభము; అప్ర యోజకుని కోపమువలె నావలపు శరీరమందే నశించవలయు" ననుకొనెను.

మై:- ఓయీ! రాజశ్యాలకుఁడు నీ కీ రీతిగాఁ జెప్పు మనెను. "వసంతసేన యను బోగముపిల్ల కామదేవాయతనో ద్యానమున నాట్యము చేసిననాఁట నుండియు నీయం దను రక్తయై యున్నది. ఇప్పుడు నేను బలాత్కారముగా వెంటాడు చుండ నీయింటిలోఁ బ్రవేశించినది. నీవు స్వయముగా దానిని నాచేతులలోఁ బెట్టితివా సరే. లేదా నీకును నాకునుమరణాంత మగు విరోధము పుట్టగలదు." అని.

చా:- వాఁడు వట్టిపశువు. వానితో నేమి ! యని వసంతసేననుఁ జూచి "వసంతసేనా తెలియక పరిజనయని భ్రమపడితిని. క్షమింపుము." అని యామె ననునయించెను. వసంతసేన తానింటఁ దెలియరాక ప్రవేశించిన యపరాధమునకు క్షమించవలయునని చారుదత్తుని వేడికొనెను. వసంతసేన యిట్లు చారుదత్తునితోడి సమాగమమునకు సంతసించెను. తా నక్కడ కనుకొనకుండగ వచ్చెను. ఇప్పుడీరాత్రి యిక్కడ నిలఁచుట యంత యుచితము గాదు. మఱి చారుదత్తునితోడ నెట్లో సంబంధము పెంచుకొనవలయును. అని కొంత తడ వాలోచించి యిట్లు చెప్పెను "ఆర్యా! నాయందు మీకు దయ యున్నచో నీయలంకారములను మీవద్ద నుంచుఁడు. ఈదుర్మార్గు లీయలంకారములకై నన్ననుసరింతురు."

చా:- ఇంతవిలువగల వస్తువులను దాఁచుటకు నాయిల్లు తగదు.

వసం:- ఇల్లెట్లున్న నేమి ? యజమాని నమ్మకము గాని యింటి నమ్మకముగాదు.

చా:- అయినచో మైత్రేయున కిమ్ము.

వసంతసేన యలంకారములను మైత్రేయున కిచ్చెను. మైత్రేయుఁడు పుచ్చుకొని నీకు శుభమగుగాక యని వసంతసేనను దీవించెను.

చా:- ఓరీ ! మూర్ఖుఁడా ! ఇది న్యాసము రా ?

మై:- అయితే దొంగలెత్తుకొని పోనిమ్ము.

చా:- అచిరకాలములోనే వసంతసేన తిరిగి తీసికొని పోగలదు.

వసం : ఆర్యా నేనింటికిఁ బోయివత్తును. ఈ మైత్రేయునిఁ దోడుపంపుఁడు.

చారుదత్తుఁడు మైత్రేయుని నామెవెంటఁ బొమ్మని చెప్పెను.

మై:- ఈమె కలహంసవలె నడచుచుండ రాజహంసవలె వెనుక నీవు పోయినచో ముచ్చటగా నుండును. నేను బ్రాహ్మణుఁడను. చత్వరమునం దిడ్డ బలినిఁ గుక్కలు నమిలి వ్రాఁగినట్లు త్రోవలోఁ గనిపించిన జనులందరు నన్ను తినివేయుదురు.

చా:- సరే! అయినచో నేనే పోయెదను. వర్ధమానునితో దీపము వెలిగింపు మని చెప్పుము,

మైత్రేయుఁడు చారుదత్తునితో ఓయీ! మనము దీపములు వెలుగు టెట్లు? నిర్ధన కాముకులయందు గణికలవలె మనదీపము లన్నియు స్నేహరహితములైనవి.

చా:- సరే! కానిమ్ము: రాజమార్గ ప్రదీప మగు చంద్రుఁడే యుదయించుచున్నాఁడు. అప్పుడే చంద్రుఁడుదయించెను. తెల్లని యతని కిరణములు బురదలో పాలు పోసినట్లు చీకటిలోఁ బడుచుండెను, ఆపడ్డ కిరణములు రాజమార్గములందు ప్రవాహములు గట్టెను. చారుదత్తుఁడు చంద్రుని వంకఁ జూచెను. ఆ చంద్రుఁడు సరిగా వసంతసేన కపోలముల వలె నుండెను. చారుదత్తుఁడు వసంతసేన వెంట నడచెను.



# సంవాహకుఁడు

## ౧

"అరే! పట్టుకొనండి! పట్టుకొనండి! పదిదీనారములు బాకీపడి పరుగెత్తుచున్నాఁడు. ఒరే! సంవాహకుఁడా? ఆగుమాగుము. పాతాళమునకుఁ బోయినను నిన్ను వదలిపెట్టునది లేదు. నిన్ను సాక్షాత్తు రుద్రుఁడు వచ్చినను సరే వదలిపెట్టునది లేదు." ఒక పురుషుఁడు ముందు పరువెత్తుచుండెను. దూరమునుండి యీ మాటలు వినిపించుచుండెను. వాని వాలకమును బట్టి యతఁడేదియో పరాభవము పొందినవానివలెఁ గన్పించుచుండెను. అతఁడు చాలదూరము పరువెత్తెను గావలయును. మిక్కిలి యలసియుండెను. అతనిగమనము మందగించెను. ఈసారి మాటలు కొంచెము దగ్గఱనుండి వినిపించుచుండెను. "ఓరీ! నాకన్నులు గప్పిపోవుటకు మాధురుఁడను సుమా! నీవింద్రునిదగ్గరనున్నప్పటికి వదలిపెట్టునది లేదు. మర్యాదగాఁ జెప్పుచున్నాను. ఆగుమాగుము" అని. పురుషుఁడాగెను. అతఁడు పరుగెత్త లేకపోయెను. వెనుకనుండి వారు సమీపించుచుండిరి. అతనికంటికెదురుగా నొక పాడువడ్డ దేవాలయము గన్పించెను. ఈ దేవాలయమున దాఁగుకొనినచో బాగుండును. మామూలుగా నడచిపోయెదనేని కాలిగుర్తులు నేను గుడిలోనికిఁ బోయినట్లు చూపించఁగలవు. కాబట్టి వెనుకకు దిరిగి నడచి పోయెదను. అప్పుడు గుడిలోనుండి బయటకు వచ్చినట్లుండును. అది యుక్తి.

అప్పుడు నన్నుఁబట్టుకొనుట మాథురుఁడుగాదుగదా వాని యబ్బశక్యముగూడఁ గాదు. అని తలఁచి అతఁడు వెనుకకు నడచుచు గుడిలోనికిఁబోయెను. ఆగుడిలోపలనంతయుఁ జీఁకటి కోణముగానుండెను. ఆచట విగ్రహమనునదిలేదు. విగ్రహమున్నచో వెనుకదాఁగికొనవచ్చును. ఇప్పు డేమిచేయవలయును? క్షణమాలోచించి యతఁడు దానే విగ్రహమయ్యెను. వెనుకనుండి మాథురుఁడు సభికునితోఁగూడ నాగుడివద్దకు వచ్చెను.

సభి:— వీఁడిట్లుచేయునని యనుకొనలేదు. ఏదోలెక్క వ్రాయుచుండగాఁ గన్నులుగప్పి పారిపోయెను.

మా:— ఎక్కడకుఁ బోవునులే. బొందిలోనూపిరియుండగా వీనిని వదలిపెట్టునదిలేదు.

సభికుఁడు ముందుపోవువాఁడు కొంచెమనుమానము తగిలినట్లు నిలుచుండెను.

సభి:— ఇదిగో! యీయడుగులింతటితో నాగిపోయినవి. ఇక్కడినుండి గుడివఱకు నడుగులు వెనుకకుఁదిరిగి పడినవి. చూడు.

మాథురుఁడా యడుగులనుఁ బరీక్షించెను. ఒకవేళ గుడిలోనుండి యెవరైనను బయటకుఁ బోయియుండవచ్చును. అరె! అన్నట్టు ఇదిపాడువడిన గుడి. దీనిలోనుండి బయటకెవరు పోయెదరు? బయటకుఁబోవుటకు నిందులో దేవతయయినను లేదు. ఈదొంగముండకొడుకు వెనుకకుఁ దిరిగినడచుచు దీనిలోఁ కిఁ బోయియుండును. సభికమాథురులిద్దరును గుడిలోనికిఁ బోయిచూచిరి. లోనసంతయుఁ జీఁకటికోణము. అచట నెవరును

వారికిఁ గానరాలేదు. గర్భగుడిలో ప్రతిమయుండుస్థానమున నేదియో విగ్రహమువలెఁ గానవచ్చెను. సభికుఁడు గ్రహించెను. సభికుడు తాకిచూచి "అరే! ఇది కొయ్యవిగ్రహముగా!" మాధురుఁడు దానినిఁ బట్టుకొని యటునిటు బాగుగాఁ గదలించెను. "కాదు. కాదు. ఎటుత్రిప్పిన నటే కదలుచున్నది. ఇది రాతిబొమ్మైనను మన జూదమునకు సాక్షిగా నుండవచ్చునులే. దీని ముందు జూదమాడు కొందుము రమ్ము." సభికమాధులిరువురు పాచికలు, బల్ల విప్పి జూదమాడఁ దొడఁగిరి. పాచికలు గల గలలాడ మొదలుపెట్టెను. పాచికలుచేయు శబ్దములోని రుచిబాగా ననుభవజ్ఞులకేగాని యితరులకుఁ దెలియదు. ఒకసారి వాని శబ్దము వినఁబడినదా యింత కంటె బ్రహ్మానందమనునది వేరులేదు. పాచికలు గలగలలాడుట మానివేసి కోకిలకూతలు కూయసాగెను. రాజ్యముపోయిన రాజునకు ఢక్కా-శబ్దమువలె జూదములో నోడిపోయినవానికి పాచికలశబ్దము గుండెపీకును. పాచికలు క్రమముగాఁ బంచమ నాదమునుండి సంగీతమున కుపక్రమించెను. ఈసంగీతము ఆరాతిబొమ్మకుఁ బ్రాణముపోసెను. ఆరాతిబొమ్మ కళ్లువిప్పి చూచెను. సభికుఁడు మాధురుఁడును పందెముసలుపుచుండిరి. మఱల పాచికలు ఘల్లుమనెను.

సభి:— అరే! నాదే పందెము. పందెము నాదే.

మా:— కాదురా! నాదేపందెము—నాదేపందెము. రాతిబొమ్మ రాతిబొమ్మయగుట మానివేసెను. అది తటాలున వారిద్దరిమధ్యకువచ్చి "అరెరె! నీదికాదు నీదికాదు. నాదిరాపందెము." సభికుఁడు వానినిఁ బట్టుకొనెను. మాధురుఁడు వాని

చేయిపట్టుకొనిలాగుచు బయటకుఁగొనివచ్చి "ఒరే! దొంగ ముండాకొడుక! చిక్కక యెక్కడకుఁబోయెదవురా? ఆపదిదీనారములు తెమ్ము" అని దండింపసాగెను.

సం:— బాబూ! బాబూ! ఇచ్చెదను.

మా:— ఇప్పుడిమ్ము.

సం:— ఇత్తును.

మా:— అరే! ఇప్పుడేయిమ్మురా!

సం:— "నాతలకాయ తిరుగుచున్నది. ఒళ్లు తెలియుట లేదు." అని మూర్ఛితుఁడైనట్లు గిరగిరతిరిగి నేలపైఁబడిపోయెను. మాధురుడు "ఓరీ! నీదొంగవేషములు నావద్దనా? నీవెచ్చట నుంటివో తెలియునా? ఒళ్లు తెలియుటలేదంటివిగా? ఎట్లు తెలియును! రెండుతన్నినఁగాని తెలియదు." అని మాధురుఁడు సభికుఁడు వానినిఁ జక్కగా మర్దింపసాగిరి. వారిద్దరి దెబ్బలకుఁ దాళలేక సంవాహకునకుఁ గొంచెము తెలివివచ్చెను.

మా:— ఏమిరా! తెలిసినదా? నీవిప్పుడెక్కడనుంటివో? జూదగాండ్ర మధ్యనుంటివి.

సం:— జూదగాండ్రమధ్యనున్నానా? అవును. జూదగాండ్రకిచ్చినమాటయిచ్చి తిరిగిపోకూడదు. నేనిప్పుడు పదిదీనారము లెక్కడనుండి తెచ్చెదను.

మా:— అరే! ఎవరినైనను పూట పెట్టుము.

సంవాహకుఁడు క్షణమాలోచించెను. అతఁడు ద్యూతకరుని సమీపించి "ఓయీ నీకు సగమిచ్చెదను. సగము వదలిపెట్టుము" యనెను. ద్యూతకరుఁ డఙ్గీకరించెను. సంవాహకుఁడు సభికుని సమీపించి "ఓయీ! సగమునకుఁ బూటయిచ్చెదను.

తక్కిన సగమును నీవు వదలిపెట్టు” మని యడిగెను. సభికుఁ డట్లే కానిమ్మనెను. మాథురుఁడు వదలిపెట్టితిననెను. సంవాహకుఁడు ద్యూతకరునితో “సగము నీవుకూడ వదలిపెట్టితివిగదా?” ద్యూతకరుఁడు వదలిపెట్టితిననెను. సంవాహకుఁడు “మీరిద్దరు చెరిసగము వదలిపెట్టితిరికదా: నేనిప్పుడు పోవుచున్నా”ననెను.

మా :– అరే ! ఎక్కడకుఁబోయెదవురా ? ఆపది దీనారములనిచ్చి మరిపొమ్ము. సంవాహకుఁడు తన పాచిక పారు లేదని గ్రహించెను. సరే కానిమ్ము మఱియొక యుపాయము చూచెదనని యాతఁడిట్లనెను.

సం :–సగమునకు నేను పూట యిచ్చితిని. సగము వదలిపెట్టిరి. నన్నిప్పుడే యిమ్మనినచో నే నెక్కడనుండి తెచ్చి యీయగలను ? తరువాత యిచ్చెదను. నన్నువదలిపెట్టుఁడు. మాథురుఁడు వానిని పట్టుకొని ‘‘ఓరీ! నన్ను మోసముసేయుట యంత తేలికయనుకొంటివా ? నేను మాథురుఁడనుసుమా ! ఆపది సువర్ణములను తెమ్ము” అనెను.

సం :– ఎక్కడనుండి తెచ్చియిత్తును ?

మా :– అరే ! దొంగముండకొడుక. నీ తండ్రినమ్మి యిమ్మురా !

సం :– నాకు తండ్రి యెక్కడనున్నాఁడు ?

మా :– తండ్రిలేనిచోఁ దల్లినమ్మితీర్చుము.

సం:– నాకుఁదల్లిమాత్రమెక్కడనున్నది ?

మా :– ఒరే నిన్నే తెగనమ్మితీర్చు. వదలిపెట్టునది మాత్రము లేదు.

సం :- అయిచో రక్షించితివి. నన్ను రాజమార్గము నకుఁ గొనిపొమ్ము.

మా :- నడువుము.

మాధుర ద్యూతకరులచ్చటనుండి సంవాహకుని రాజ మార్గమునకుఁ గొనివచ్చిరి. అచట నెవరును సంవాహకుని పది దీనారములకుఁ గొనువారు లేకపోయిరి. సంవాహకుఁడు "అయ్యా! మీయిండ్లలో నూడిగము చేసెదను పది దీనా రములకు నన్నుఁ గొనుఁ" డని కేకలువెట్టెను. ఒకరిద్దరు చెవి యొగ్గినట్లు గనిపించిరిగాని దగ్గరకువచ్చిన వారెవ్వరును లేరు. సంవాహకునకుఁ బ్రాణము విసిగిపోయెను. అతఁడు తన్నమ్ము కొను దశకు దిగినను గొనువారు లేకపోయిరి. వలనాళ్ళలో చారుదత్తుడు తన్ను పోషించెను. చారుదత్తునిస్థితి బాగుగా నున్నచోఁ దనకీ యిక్కట్టు రాకపోయియుండును. ఇప్పుడీ సభికునినుండి తప్పించుకొనుమార్గమేది ?

సభి:- అరే! యిమ్మురా!

సం:- ఎచటనుండి తెచ్చెదను? మాధురుఁడు వానిని ధనమిమ్మని లాగఁజొచ్చెను. సంవాహకుఁడు "అయ్యా! రక్షిం పుఁడు! రక్షింపుఁడ"ని కేకలువైచెను. ఆ కేకలు దూరము నుండి వచ్చుచున్న దర్దురకునకువినిపించెను.

దర్దురకుఁడు తానుగూడ సర్వస్వమును జూదమునందుఁ బోఁగొట్టుకొనినవాఁడే. అతనికిప్పుడు తినుటకుఁదిండియుఁ గట్ట బట్టయు లేవు. అతఁడు రాజమార్గమునఁబడి నేఁడెచ్చటికో బోవుచుండెను. రాజమార్గమున జూదకులు తిరుగుచుందురు. అతఁడాయూరిలోని జూదరులనందఱ నెఱిఁగినవాఁడే. ఎవఁడైన

గంటఁబడవచ్చును. వానినుండి తప్పించుకొనుట యెట్లు? అంతలో సభికద్యూతకరులతనికి సమీపమునఁగానవచ్చిరి. అచ్చటనుండి తొలగిపోవుదమన్నచోఁ బ్రక్కసందైనను లేదు. ఇప్పు డేదిగతి? ఉత్తరీయమును ముసుగైనఁ బెట్టుకొనవలయును. దర్దురకుఁడుపైనున్న యుత్తరీయమును విప్పెను. దానియందు వేయిచినుఁగులుండెను. దానిఁగప్పుగొనుటయెట్లు? దానిని మడతగానేయుంచిన కొంతయుగౌరవముగానైనను నుండును. దర్దురకుఁడు ముందునకుఁజూచెను. మాధురుఁడు సంవాహకునిఁబట్టి లాగుచుండెను.

మా:— లేమ్ము. లేమ్ము.

సం:— ఎచటనుండి తేగలను? దర్దురకుఁ డదిచూచెను. అతఁడక్కడ చేరిన జనమువలన సంగతికనుఁగొనెను. పాపమీ సంవాహకునకింతకుపూర్వ మిట్టిగతిపట్టలేదు. దర్దురకునకుఁ దానున్న స్థితిలో సంవాహకునిఁ జూచి జాలివుట్టెను. "సరే, కానిమ్ము మాధురుని సమాధానపరచుటకు ప్రయత్నింతు" నని ముందునకువచ్చి మాధురునకు వినయముగానమస్కరించెను. మాధురుఁడు దర్దురకునకు ప్రతినమస్కారముసేసెను.

ద:— ఏమిటిది?

మా:— వీఁడు పదిదీనారములు బాకీపడెను.

ద:— ఓస్ ఇంతియేగదా? అదియెంతభాగ్యము? పదిదీనారములు గంజినీళ్లుచేయుచున్నవీరోజులలో.

మాధురుఁడు దర్దురకునిబాగుగా నెఱుఁగును. వీనిబ్రతుకునకుఁదోడు పదిదీనారములు వీనికి గంజినీళ్లటే? మాధురుఁడు దర్దురకుని దంతలోని యుత్తరీయమునులాగి దానినివిప్పి

యచ్చటనున్న పదిమందికిఁజూపించుచు "అయ్యా! చూడుడు! ఈకుచేలువకు పదిదీనారములుగంజినీళ్ల టఁ?"

దర్దు :— ఒరే మూర్ఖుఁడా! నీకు పది సువర్ణములిత్తు నని నేను పూటవడెదను. డబ్బుగలవాఁడు జేబులో పెట్టుకొని తిరుగునా? పది సువర్ణములకొఱకు మనుష్యునిఁ జంపుచుం టిని.

మా :— బాబూ! నీకుఁ బది సువర్ణములు గంజినీళ్ళు. మాకదే మహాభాగ్యము

ద :— సరే! అట్లైనచో నేనొకమార్గము చెప్పెదను వినుము. వీని కింకొక పది సువర్ణములిచ్చి వానితో మఱల జూదమాడుము.

మా :— ఆడినచో!

ద :— వాఁడు గెలిచినచో నీబాకీ తీర్చును.

మా :— గెలువకపోయినచో?

ద :— అప్పుడీయఁడు.

మా :— నీతో వాదమేల? ఇట్లు చెప్పెడివాఁడవు నీవేయిమ్మురా! ధూర్తుఁడా! నే నెవరనుకొంటివి? నా పేరు మాధురుఁడు. నన్నే టోపీ వేయుచున్నాఁడు వీఁడు. నే నెవరికి జడియువాఁడను గాను. అరే! పోరా. నీసంగతి యందఱకుఁ దెలిసినదే.

ద :— నీసంగతి నీయబ్బసంగతి యందఱకుఁ దెలిసినదే. నీ వెక్కడనుండియైా నను దిగివచ్చితివా?

మా :— ఒరే లంజెకొడుకా! జూదము నీవిట్లేయాడి తివా!

ద :— అరే! పోరా, నీకోమాకేల? అరే సంవాహకా! తేరా! పది సువర్ణములు తెమ్ము.

సం :— ఇచ్చెదను, ఇప్పుడే యిచ్చెదను.

మాథురుఁడు సంవాహకుని లాగఁజొచ్చెను.

ద:— అరే! నేను లేనప్పుడు వానినేమి చేసితివో చేసితివి. నాముందు వాని యొడలిమీఁదఁ జేయివేసితివా! జాగ్రత.

మాథురునకీ మాటలువిని యొడలు మండుకొనిపోయెను. తా నుజ్జయినీపట్టణమునకంతయు ప్రధానసభికుఁడు. ఈ దర్దురకుఁడు? వీఁడొకపురుషు. వీఁడెంత? వీనిబ్రతుకెంత? వీఁడేమి చేయునో చూడవలయును. మాథురుఁడు సంవాహకునిఁ జేతితోఁ బట్టుకొని లాగి ముక్కుపై నొక గ్రుద్దు గ్రుద్దెను. ఆదెబ్బకు సంవాహకుడు ముక్కుబ్రద్దలై రక్తము కారుచుండ గిరగిర తిరిగి భూమిపైఁ బడిపోయెను. దర్దురకుఁడు వారిమధ్యకువచ్చి మాథురునిఁ ద్రోసెను. మాథురుఁడు దర్దురకునిఁ గొట్టెను. దర్దురకుఁడు మాథురునిఁ గొట్టెను.

మా :— ఒరే! ఒరే దొంగముండకొడుక! దీనికిఁ బ్రతిఫలమునుఁ బొందెదవురా!

ద :— అరే! నేను త్రోవవెంటఁ బోవుచుండగాఁ గొట్టితివి. రేపు రాజసభలోఁ గొట్టెదవుగాని, అప్పుడు చూచెదవు.

మా:— ఇప్పుడేచూచెదను.

దర్దు:— ఎట్లుచూచెదవు?

మా:— ఇట్లుచూచెదను.

అని కండ్లనువిప్పి యభినయించిచూపించెను. దర్దురకుఁడు వెంటనే గుప్పెడుమన్నుదీసికొని వానికండ్లలోఁగొట్టి

సంవాహకునిఁ బారిపొమ్మని సంజ్ఞగావించెను. మాథురుఁడు కండ్లుమూతవడి నేలపైఁబడిపోయెను. ఆయదనుగనిపెట్టి సంవాహకుఁడు పారిపోయెను. దర్దురకుఁడు మాథురునితో విరోధముగల్గినందులకు మిక్కిలివిచారించెను. మాథురుఁడులేచినఁ దన్నుఁ బ్రతుకనీయఁడు. మాథురుఁడు ప్రధానసభికుఁడగుటవలన వానికాయూరిలో మిక్కిలిబలమున్నది. కావున దానచట క్షణముండరాదు. మఱితానిప్పుడెచటకేగవలయును? అతని స్నేహితుఁడగు శర్విలకుఁడతనితో నార్యకునియుదంతముచెప్పెను. ఆ యార్యకుఁడు తనకిప్పుడాశ్రయమీయఁగలఁడు. దర్దురకుఁడు మాథురుఁడు పడియుండగనే యచటనుండి మెల్లగా దాఁటిపోయెను.

౨

ఆనాటియుదయమున వసంతసేన ప్రొద్దెక్కి మేల్కాంచెను. లేఁచినదిలేచినట్లామె యింటిముంగిలికివచ్చి కూర్చుండెను. ఆమె మొగమించుక వాడియుండెను. కన్నుల యందరుణిమ యామెకురాత్రిసరిగా నిద్రపట్టనట్లుచెప్పుచుండెను. ఆమె స్నానముచేయలేదు. దుస్తులుమార్చుకొనలేదు. ఆమెయుళ్లో యొకగడియకాలము శూన్యములోనికిఁజూచుచుఁగూర్చుండెను. ఆమె యేదియో యాలోచించుచుండెను. ఇంతలో చేటి యొకతె వచ్చెను. ఆమెపేరు మదనిక. మదనిక రెండుమూడు

పార్లు వసంతసేననుఁ బిలచెను. వసంతసేన పలుకలేదు. చేటి మఱలఁబిలచెను.

వసం:— మదనికా! తరువాత నేమిజరిగినది.

చే:— నేనిపుడేమిచెప్పితిని, తరువాతకు?

వసం:— నేనిప్పుడేమంటిని?

చే:— "తరువాత, తరువాత," నంటివి. నీ వే ది యో యాలోచించుచున్నట్లున్నావు. రాత్రి సరిగా నిద్రపట్టినట్లు లేదు. స్నానముచేసి దేవపూజ నిర్వర్తింపుమని యమ్మ నీతో జెప్పుమన్నది.

వసం:— మదనికా! అమ్మతోఁజెప్పుము. నేనిప్పుడుస్నానముసేయను. కాబట్టి యాబ్రాహ్మణునే పూజచేయుమనుము.

సరియేయని మదనిక యావాక్యముల మఱియొకచేటిచేలోనికిఁ గబురంపెను. ఆమె వసంతసేన యుత్కంఠితురాలైనదని గ్రహించెను. మదనిక వసంతసేనకు మిక్కిలి కూర్చుచేటి. వసంతసేన యామెకెట్టిరహస్యములైననుఁజెప్పును. ఆమె వద్ద మదనికకున్న చనవు కడమచేటులకెవరికిని లేదు. ఈచనవు పురస్కరించుకొని మదనికయడిగెను.

మ :— వసంతసేనా ! స్నేహముచేత నడుగుచుంటిని. ఏమిది నీవిట్లుంటివేల ?

వ :— నే నెట్లుంటిని ?

మ :— రోజుకన్న వేరుగా నుంటివి. హృదయములో నెవరినో తలఁచు చున్నట్లుంటివి.

వ :— బాగుగా నూహించితివి.

ఈమాటలన్నప్పుడు వసంతసేన చెక్కిళ్లు లజ్జచే నెఱ్ఱ బడెను. "పరహృదయము నెఱుఁగుటలో నీవు చాల నిపుణు రాలవు."

మ :— బాగున్నది. ఆవ్యక్తియెవరు ? రాజా ? రాజ వల్లభుఁడా ? ఎవరిని సేవింపనెంచితివి ?

వ :— మదనికా ! నేను రాజులను సేవింప నెంచలేదు.

అయితే పండితుఁడైన బ్రాహ్మణుని నెవరినైన కామిం చితివా ?

వ :— బ్రాహ్మణులు నాకు పూజనీయులుగదా !

మ :— కోటికి పడగయెత్తిన వైశ్యయువకు నెవనినైనఁ గామించితివా ?

వ :— ప్రేమించిన ప్రణయజనమునువదలి దేశాంతరము నకేగి వైశ్యుడు మిక్కిలి వియోగదుఃఖమునుఁ గలిగించును.

మ :— రాజుగాడు, రాజవల్లభుఁడుగాడు, బ్రాహ్మ ణుఁడుగాడు, వైశ్యుఁడుగాడు, మఱియెవనినిఁగామించితివి ?

వః— మదనికా! నీవునాతో కామదేవాయతనోద్యాన మునకువచ్చితివిగదా?

మః— వచ్చితిని.

వః— మఱి తెలియునిదానినలె నడిగెదవేల?

మః— ఆ ! తెలిసినది. ఆతనినేగదా నీవు నిన్నసాయం తనమున శరణము పొందినది.

వః— అతనిపేరేమి ?

మః— అతఁడు శ్రేష్ఠిచత్వరమున నివసించుచున్నాఁడు.

వః— ఛీఛీ ! నే నతని పేరడిగితిని.

మ:— అతని పేరండరెఱిఁగినదే. చారుదత్తుఁడు.

వ:— మదనికా ! నీవు బాగుగా నెఱిఁగితివి.

మ:— అదిసరేగాని యతఁడు మిక్కిలి దరిద్రుడనివింటిని.

వ:— అందుకనియే యతనినిఁ గామించితిని. దరిద్రునిఁ జెంది వేశ్యలోకమున నిందపాలుగాదు.

మ:— పూలు రాలిపోయిన తియ్యమామిడి చెట్టును మధుకరములు సేవించునా ?

వ:— అందుకనే వానిని మధుకరములనుచున్నారు.

మ:— వసంతసేనా! అతనిని నీవుకోరినచో నతనియింటికే యేలపోరాదు.

వ:— అంతవెంటనే పోరాదు. వెళ్లితిననుకొమ్ము. అతఁడు దరిద్రుఁడుగదా! నేను వేశ్యనని దర్శనమైననీయఁడు.

మ:— ఓహో! అందులకా నీవలంకారముల నతనివద్ద న్యాసముంచినది.?

ఇంతలో దటాలున సంవాహకుఁడు లోనికిఁ బరువెత్తి కొనివచ్చెను. రాజమార్గమునఁ బరువెత్తిపోవుచున్న సంవాహకుఁడు వసంతసేన యింటితలుపులు తెఱచియుండుటఁజూచి లోపలఁబ్రవేశించెను. అతఁడు భయముచే వణకిపోవుచుండెను. ఇంటిముంగిలియందుఁగూర్చున్న వసంతసేన వాని కన్నులఁ బడెను. సంవాహకుఁడు వెంటనే యామె పాదములపైఁబడి తనకు శరణమిమ్మనిప్రార్థించెను. వసంతసేన వానికి భయము లేదనిచెప్పి వీథితలుపులు మూయించెను. ఆమె సంవాహకు నను నయించి "ఓయీ! ఏల నంతభయపడెదవు?

సం:- నేనొకనికి బాకీయుంటిని. వారు నన్ను తఱుముకొనివచ్చుచున్నారు.

వ:- మదనికా! ఇప్పుడు తలుపులు తెరువుము.

మదనిక తలుపులు తెఱచుటకుఁబోయెను. వీధిలో మాధురుఁడును ద్యూతకరుఁడును గోలగానరచుచుండిరి.

మా:- ఓరీ ఎక్కడకుఁ బోయెదవు? అందుకనే నీముక్కుపగులఁగొట్టితిని. ఆనెత్తురు నీజాడ చెప్పుచునేయున్నది. నీవుచచ్చినను నిన్నువదలునదిలేదు.

ద్యూ:- ఇదిగో! ఈనెత్తురు చుక్కలింతవఱకేపడినవి. ఇదివసంతసేనయిల్లు. అతఁడీయింటిలో దూరియుండవచ్చును.

మా:- అయితే పదిసువర్ణములు గంగలోఁగలిసినట్లే.

ద్యూ:- రాజసభకుఁబోయి నివేదింతము.

మా:- వీఁడిక్కడనుండి మనముపోయినచోఁ బారిపోగలఁడు. ఇక్కడనే కనిపెట్టుకొనియుందము.

మాధుర ద్యూతకరులిద్దరును సంవాహకునకై వసంతసేన వాకిటఁగాచుకొని యుండిరి. మదనిక వీరినిరువురనుఁజూచెను. ఆమెలోనికేఁగి వసంతసేనతో నావృత్తాంతమును నివేదించెను. ఆమాటలు సంవాహకుఁడువిని, "ఇదిగో! ఈసభికద్యూతకరులకుఁ బదిసువర్ణములు బాకీయుంటిని. వారు నన్ను తఱుముకొనివచ్చిరి. నేను నీశరణముఁజొచ్చితి" ననియెను. వసంతసేన వానిస్థితికి మిక్కలిజాలిపడి తనముంజేతినున్న సువర్ణకంకణ మూడఁదీసి మదనిక కిచ్చి "మదనికా! ఈకంకణమును సంవాహకుఁడేయిచ్చినాఁడని చెప్పి వారికిమ్ము" ననిపంపెను. మదనిక కంకణమునుఁగొనిపోయి మాధురునకొసంగెను. సభిక

ద్యూతకరులకు సొమ్మిబ్బడిగా ముట్టెను. వారచటనుండి సంతసించుచుఁ బోయిరి. పోవునపుడు మఱలమఱల వెనుదిరిగి వసంతసేనయింటివైపు నమస్కారములు గావించుచుఁ బోయిరి. వసంతసేన సంవాహకుని నతనివృత్తాంతముఁ జెప్పుమని యడిగెను.

సంవాహకుడు తనకథ చెప్పసాగెను. "అసలు మాది పాటలీపుత్రము. నేనొకసంసారిబిడ్డను. సంవాహన కళను జక్కగానభ్యసించితిని. నేను దీనినొక విద్యగానభ్యసించితిని. ఇప్పుడిది నాకుజీవనాధారమైనది. నాచిన్నతనమున మాయింటికిఁ జాలమంది యభ్యాగతులు వచ్చుచుఁబోవుచుండెడివారు. వారితూర్పుదేశమునసౌభాగ్యములను గథలుగఁజెప్పెడువారు. ఆకథలువిని నాకీదేశములు చూడవలయునని కోరికపుట్టెను. నేను మాతల్లిదండ్రులకుఁ జెప్పకుండఁ జేతికిఁజిక్కినధనమును గైకొని యొకరాత్రివేళ లేచి బయలుదేరితిని. త్రోవలో ననేకకష్టములుపడి యెట్లో యీయుజ్జయినీనగరమును జేరుకొంటిని. ఉజ్జయినినిజూచినతరువాత త్రోవలో నాపడ్డకష్టములన్నియు మఱచిపోతిని. ఆసంతసమున నేనీయూరిలో విచ్చలవిడిఁదిరిగితిని. చేతిలోనున్న నాల్గుడబ్బులు నాలుగు నాళ్లలోఖర్చయినవి. నేను వేరుపాయములేక చిన్ననాటనుబుసుపోకకై నేర్చిన విద్యను బయటకుఁదీసితిని. శ్రేష్ఠిచత్వరమున నొకమహానుభావుఁడుండెను. నేను చాలకాలమాయనను శుశ్రూషించితిని. ఆయనచాలమంచివాఁడు. తియ్యగా మాట్లాడును. ఆయనచేతి కేమికయున్నట్లు నాకెప్పుడు దెలియలేదు. ఆయనయీవి యట్టిది. తానిచ్చితినని యించుకైనను

గొప్ప చెప్పికొనఁడు. ఎవరైన నపకారమొనరించినను నది యతనికిజ్ఞాపకమైననుండదు. ఆయనను జూచినఁజాలు కడుపు నిండును. ఆయన నిలువెల్ల తియ్యనివాఁడు. యాచకులా యనను చెఱుకుగడనువలెఁ దినివేసిరి. పిప్పియైనను మిగల్చలేదు.

వః— అవును. అట్టివానికి సంపదలెట్లునిలుచును? సద్గుణములకు సంపదలకుఁ జాలదూరము. త్రాగరాని చెఱువులలో నీరమెక్కువగానుండును.

మః— ఓయీ! అతని పేరేమి?

సంః— మీకాయన పేరే తెలియదా? ఆయన శ్రేష్ఠి చత్వరములో నివసించునంటినిగదా! ఆయనపేరు చారుదత్తుఁడు.

ఆమాటలు వినుటతోడనే వసంతసేన కుర్చీపైనుండి లేచెను. "మదనికా! యీయన నాసనముపై కూర్చుండఁజేయుము. వీవనతోడ వీచుము. పరిశ్రమపొందినట్లున్నార" నిమిక్కిలి మర్యాదచేసెను. సంవాహకున కీమర్యాద చూచి యచ్చెరువయ్యెను. ఆర్యచారుదత్తుని పేరుచ్చరించుటచేతనే తన కింత యాదరముగలిగినది. ఆహా! ఏమి చారుదత్తుఁడు! లోకములో నిజముగాజీవించుచున్న దతఁడొక్కఁడే. తక్కిన వారంద రూపిరిమాత్రము పీల్చుచున్నారు. సంవాహకుఁడు కరచాలనముచేయుచు వినయముగా నామర్యాదను దిరస్కరించెను. "అమ్మా! నీవేకూర్చుండుము. నేను సేవకుఁడను. నాకిట్లుగూర్చుండుట యేమర్యాద." సంవాహకుఁడు మరలఁ దనకథనుఁ జెప్పఁదొడఁగెను. "ఆర్యచారుదత్తుని విభవమం

తయు నిట్లుపోయినది. తరువాత జూదమాడి జీవించుట మొదలుపెట్టితిని. నేటికదృష్టము తప్పివచ్చినది. ఈసభికద్యూతకరులకు బదినువర్ణములు బాకీపడితిని. వారిద్దరు నన్నుఁదరుముకొనివచ్చిరి. నీదయవలన గండముతప్పినది. నాకీలోకమునందు విరక్తిపుట్టినది. నేను బౌద్ధభిక్షువుఁ గావలయునని చాలదినములనుండి యనుకొనుచుంటిని. దానికీ సభిక ద్యూతకరులిద్దరు చేసినయవమానము తోడైనది. ఈ జూదమాడుట వలన నేనెవ్వరినిఁజూచినను సిగ్గుఁపడవలసి వచ్చుచున్నది. ఇఁక శ్రమణకుఁడనై తలయెత్తుకొని స్వేచ్ఛగాఁదిరిగెదను. సంవాహకుడను ద్యూతకరుఁడు శ్రమణకుఁడయ్యెనని గుర్తుంచుకొనుము. నాకుచేతనైనచో బ్రతికియుండినకాలములో నెప్పుడైనను నీఋణమునుఁ దీర్చుకొనుటకు యత్నింతును.

వ:— ఓయీ! ఏలనంతసాహసము? నేను నీకప్పు పెట్టలేదు, మఱిలఁదీర్చుటకు.

సం:— అమ్మా! నేను నిశ్చయ మొనరించితిని. నానిశ్చయమునకడ్డుతగలకుము. నీవుచేసిన యుపకారము మఱువలేను. నన్నుమాత్రము జ్ఞాపకముంచుకొనుము. పోయివత్తును.

సంవాహకుఁడచటనుండి వీధిలోని కేఁగెను.

## 3

సంవాహకుఁడు బాటకు సమీపమునసున్న బౌద్ధవిహారమునకేఁగి యచ్చట దీక్షగైకొనెను. పూర్వము వానియూ

కృతికిని యిప్పటి వాని యాకృతికిని సంబంధ మేమియు లేదు. ఇప్పుడతనినిఁ జూచినవారు వీఁడు పూర్వము సంవాహకుఁడని యైనను గుర్తింపలేరు. అతనితలయంతయు ముండనముగావింపఁ బడెను. ఒక కావిగోచి, ఒకకఱ్ఱ, చేతిలో నొకచిప్ప, పైన నొక కావిపంచె, యాతని వేషము. ఈవేషముతో సంవాహకుఁడు వీథివెంట బయలుదేరెను. దూరమున నేవియో కేకలు గోలగా వినిపించు చుండెను. అతని కాళ్ళక్రింద భూమి యదరి పోవుచుండెను. వెనుకనుండి యేదియో పరువెత్తుకొని వచ్చుచుండెను. క్రమముగా నాగోల యాతని సమీపమునకు వచ్చెను. ఒక మదించిన యేనుఁగు తొండము విసరికొనుచు రాజమార్గమువెంట బరువెత్తికొనుచు వచ్చుచుండెను. రాజమార్గమందున్న జనులందరు పటాపంచలై పారిపోవుచుండిరి. ఆయేనుఁగు త్రోవలో నడ్డమైన దానినెల్ల తుత్తురుముగాఁ జేయుచు, ఘీంకరించుచు, పాదములతోఁ జమురుకొనుచు, రాజమార్గమున సన్నద్ధమైన మృత్యువుపోలె చనుదెంచుచుండెను. సంవాహకుఁడు దానినిఁజూచెను. తప్పుకొని పారిపోవలయునని యూహ యతనికిఁ గలుగలేదు. దూరమునుండి జనులు "అయ్యో! అయ్యో! పరివ్రాజకుఁడు చనిపోవుచున్నాడు, చనిపోవుచున్నాఁడు. వసంతసేన యేనుఁగు ఖుంటమోడకము వానిని బట్టుకొన్నద"ని కేకలు వేయసాగిరి. ఖుంటమోడకము సంవాహకుని తొండముతోఁబట్టి దంతములమధ్య నిఱికించుకొని ఘీంకరింప సాగెను. సంవాహకుని చేతిలోని దండ కుండికలు దూరమునందుఁ బడినవి. అతనికి నేనుఁగుచేఁ బట్టుకొనఁబడితినను జ్ఞానముగూడ నున్నట్లులేదు. ఖుంటమోడకము వానినట్లే

దంతములమధ్య నిఱికించుకొని కాళ్ళసంకెలలు గలగలలాడ ఘీంకరించుచు రాజమార్గమున పరుగెత్తసాగెను. జనులు "అయ్యో! పరివ్రాజకుఁడు చచ్చెను. చచ్చె"నని కేకలు వేయ సాగిరి. ఇంతలో దూరమునుండి చేతిలో నేదియో లోహ దండమునుఁబట్టుకొని యొక పురుషుఁడు ఖుంటమోడకమున కెదురుగా పెద్ద వస్తాదువలె గోచరించుచుండెను. ఆతఁడేమియు జంకులేక ఖుంటమోడకమున కెదురుపోయి సింహమువలెఁ జెంగున దానిపైకురికి లోహదండముతో దాని కుంభస్థలమున మోదసాగెను. దానినిఁజూచి జనులందరు "కర్ణపూరకుఁడు, కర్ణపూరకుఁ"డని యుత్సాహముతోఁ జప్పట్లు గొట్టసాగిరి. కర్ణపూరకుని యినుపగద దెబ్బలు ఖుంటమోడకము కుంభ స్థలముపై పిడుగువలెఁ బడుచుండెను. ఆదెబ్బల కాయేనుఁగు నకు దిమ్మతిరిగెను. అది దంతముల మధ్యనున్న సంవాహ కుని దూరముగా గిరవాటువైచి వెనుదిరిగి పరువెత్తసాగెను. జనులందరు సంవాహకుఁడు చచ్చెనేమో చూచుటకు సమీప మునకేఁగిరి. అతఁడు కొనయూపిరితో నుండెను. కొందఱతనికి శైత్యోపచారములు గావించిరి. ఆతఁడు గొంచెము తేఱు కొనెను. సంవాహకునకిట్లు గండముతప్పెను.

కర్ణపూరకుఁడు పోవుచున్న ఖుంటమోడకమునుండి మఱల భూమికిలంఘించెను. అతఁడు దాని ముందునకుఁబోయి లోహదండముతో ముఖముపై మోదసాగెను. ఆదెబ్బలకు దానికి మదమంతయు నణఁగిపోయినది. ఆ యేనుఁగు కర్ణపూ రకునకు వశమై నిలఁచిపోయెను. కర్ణపూరకుని యీ వీరకార్య మునకు జనులందరు చప్పట్లు సఱచుచు శ్లాఘించుచుండిరి.

ఆ సమయమున చారుదత్తుఁడా త్రోవనేఁగుచు కర్ణపూరకుని యీ వీరకార్యమునుఁగాంచెను. చారుదత్తునకు కర్ణపూరకుని యందు మెప్పు పుట్టెను. చారుదత్తుఁడు చేతులుదడవికొనెను? ఒక్క యుంగరమైనను లేకపోయెను. అతఁడాకసమువంక జూచి నిట్టూర్చి పైనున్న సేలువతీసి కర్ణపూరకునిపై గిరవాటు వైచెను. కర్ణపూరకుఁడా యేనుఁగును నడిపించుకొనుచు వసంత సేన యింటివద్దకు వచ్చెను. అతఁడా యేనుఁగును సాలలోనికిఁ దీసికొనిపోయి జాగ్రత్తగాఁ గట్టివైచి వసంతసేనవద్దకు వచ్చెను. వసంతసేన వాని యుద్యోగమునుజూచి సంగతేమని ప్రశ్నించెను. కర్ణపూరకుఁడు తన వీరకృత్యమునంతయు వసంతసేనకు నివేదించెను. చారుదత్తుఁడిచ్చిన సేలువ కర్ణపూరకుఁడింకను ధరించియే యుండెను. వసంతసేనదానిని జూచెను. "కర్ణపూరకా! నీకీ సేలువయెక్కడిది?"

క:— ఎవరోనమ్మా యీదారిన. నేనుచేసిన వీరకార్యముఁజూచి చేతులు తడవుకొనుచు నాకసమువంకఁజూచి నిట్టూర్చి, యీ సేలువదీసి నాపైగిరవాటువైచిపోయినాఁడు

వ:— కర్ణపూరకా! ఆసేలువయే మైన జాజిపూలవాసన వేయుచున్నదా!

క:— నేనుచూడలేదమ్మా. ఏనుఁగుతోడపోరినప్పుడు దానిమదజలము శరీరమంతయు పడ్డది. ఆ వాసనలో నీవాసన తెలియుటలేదు.

వ:— ఆయనపేరేమియో యడిగితివా?

క:— ఇదిగో! యీసేలువచివఱ నేవో యక్షరముల వలెనున్నవి. ఇదిగో తీసికొని మీరేచూడండి.

వసంతసేన ప్రావారికముఁదీసికొని దానిపైనున్న యక్షరములనుఁజదివెను. ఆమె వెంటనే యాప్రావారమును విప్పి కప్పుకొనెను.

మదనిక:— కర్ణపూరకా! ఈసేలువా వసంతసేన కెంతో బాగున్నదిరా!

కర్ణ:— అవును. చాలబాగుగానున్నది.

వసం:— కర్ణపూరకా! ఇదిగో! ఈదండనుపుచ్చుకొమ్ము.

కర్ణపూరకుఁడా యాభరణముసందుకొని తలవంచి వసంతసేనకు నమస్కారముగావించెను. "అమ్మగారి కిప్పుడీ సేలువ మఱియుఁబాగుగనున్నది."

వ:— కర్ణపూరకా! ఈ సమయమునకు చారుదత్తు డెక్కడకు వచ్చియుండును;

క:— ఆయన యీత్రోవ వెంటనే బయలుదేరినాఁడు. నే నేనుఁగుతోఁగూడ గబగబముందువచ్చితిని.

వ:— సరే! ఇఁకనీవుపొమ్ము. మదనికా! మేడపైకెక్కి చారుదత్తునిచూతమురమ్ము.

మదనికావసంతసేనలు మేడమెట్లెక్కిరి.

# శర్విలకుఁడు

## ౧

నాఁటిసాయంత్రమున నగరమున సంగీతగోష్ఠిజరిగెను. రేభిలుఁడు వీణపై మిక్కిలిమధురముగాఁబాడెను. అసలు

వీణయున్నది సముద్రములోఁ బుట్టినిరత్నము. దానికి రేభిలునిపాట తోడు. అనటఁగూర్చున్నజనమంతయు నొక దివ్యానుభూతినిఁబొందిరి. కళలుకళలని కవితాశిల్పాదులనుగూడ నందురుగాని నిజముగా సంగీతమొక్కటేకళ. దివ్యమైన రసానుభూతియొక్క ప్రథమాభివ్యక్తి సంగీతమునందుఁగాక మఱియొకచోటనెందుఁగలదు? అందుకనియే యచ్ఛమైనసంగీతము జీవులఁబడిన సృష్టిలోనిప్రతిజంతువును హృదయమున పులకించును. ఇట్లు 'శిశుర్వేత్తి పశుర్వేత్తి' యైననే దానియందుఁగళాత్వముండును.

ఆనాటిసంగీతగోష్ఠి మిక్కిలిరక్తిగట్టెను. రేభిలునిపాట లలితమై మనోహరమై భావాన్వితమైయుండెను. అతఁడు పాడినంతసేపు గడుసుపోకడ లనేకమువోయెను. ఆస్వరసంక్రమమువిన్నవారికి మిక్కిలి యచ్చెరువుగలిగించెను. ఆయా మూర్ఛనల నుచ్చరించినవెంటనే తారస్వరమున నక్షరములఁబల్కుట, విరామస్థలములం దక్షరములు మృదువగుట, యొక్కొక్కయక్షరమును రాగపద్ధతిలోనికిమలచి మఱలమఱల ననుట, బహుమాత్రాకాలికమగు నుచ్చారణమును సంయమించుట, యీవిధమైన మధురప్రచారమెంతయో యతఁడుగావించెను.

గోష్ఠిపూర్తియగుసరికి రాత్రి చాలప్రొద్దుపోయెను. సభ్యులందరును తృప్తమనస్కులై యెవరిత్రోవవారేగిరి. చారుదత్తుఁడు మైత్రేయునితోఁగూడ గృహాభిముఖుఁడై రాజమార్గమునఁజనుచుండెను. అతనిమనస్సంతయు రేభిలునిసంగీతమునందేలయించిపోయెను. ఆహా! రేభిలుఁడెంతచక్కగాఁ

బాడెను. రేభిలునిసంగీతము వాయుమార్గమున తరంగములు తరంగములుగావచ్చి చారుదత్తుని చెవికింకనుఁ దాకుచున్నట్లే యుండెను. ఓహో! ఏమి రేభిలుఁడు! ఆపరిశుద్ధమగురాగ పద్ధతి, ఆకంఠములోనియొయ్యగు, ఆస్వరవైఖరి, ఆతాళసంచా రము, ఆగ్రామమూర్ఛనలఁబలికించుటలోనినేర్పు. ఈయ న్నింటియందును రేభిలుఁడు బ్రహ్మ.

మై:— ఓ యీ! ఎంతప్రొద్దుపోయినదో చూచితివా? నీపెళ్లినడకలతో మనమింకనింటికిఁబోయినట్లే.

చారుదత్తుఁడీలోకములో లేఁడు. అతని చెవులకు మైత్రే యునిమాటలుగావు వినిపించినవి. "ఆహా! ఏమిసంగీతమేమి సంగీతము!"

మై:— ఓయీ! నాకు లోకములో రెండింటినిఁజూచి నచోఁ జాలనవ్వువచ్చును. స్త్రీసంస్కృతము. పురుషుని సంగీ తము. స్త్రీ సంస్కృతము చదువుచు ముక్కుతోఁ జదివినంత సేపూ సూ సూ సూ అసిశబ్దము చేయుచు నేయుండును. పురు షుఁడు సంగీతముపాడినంతసేపు వాడిపోయినపూలదండవేసికొని వేదముచదువుచున్న ముసలిపురోహితునివలెఁ దలకాయ యూపుచు నేయుండును. ఈరెండింటినిఁజూచినచో నాకు పొట్ట చెక్కలగును.

చారు:— మైత్రేయా! రేభిలునిసంగీతము నిజముగా బాగులేదందువా? నీవు పైకతనిఁజూచితివి.గాని తెలుసుకొనుటకు గూర్చుండిపాడినచో నిజముగ స్త్రీయని యూహించుకొనియుం దువు. అదియేదియో మంజిడిరాగమట. అసలట్టిరాగమున్న దని చాలమంది పెద్దపెద్దగాయకులకే తెలియదు. అది చాల

చిన్న రాగమట. దానినతఁడెంత ప్రస్తరించిపాడినాడు! అతఁడు పాడినంతసేపును, వీణవాయించినంతసేపును ప్రాణములనట్లు పట్టుకొనిలాగివేసినట్లేయున్నది. అటువంటి సంగీతమును వినుట జన్మముయొక్క యదృష్టమే యనవచ్చును.

మై:— ఓయీ! అంగడిలోని రచ్చపట్టులలోఁ బండు కొని కుక్కలుగూడ సుఖముగానిద్రపోవుచున్నవి. ఎంతప్రొద్దు పోయినదో చూడు. ఈచంద్రుడుగూడ నెంతసేపు మనమేయేలిన బాగుండదని యంధకారమునకుఁగూడ నవకాశమిచ్చుచు నాకా శమను మేడమీఁదనుండి క్రిందికిదిగుచున్నాఁడు.

చారుదత్తుఁ డాకసమువంకఁ జూచెను. నాఁడు శుక్లపం చమి. చంద్రుఁడ స్తమించు చుండెను. అస్తమించుచున్న యా చంద్రుఁడు నీటిలోమునిఁగిన యడవియేనుఁగు వాఁడియైన విషా ణాగ్రమునుఁబైకెత్తినట్లు ప్రకాశించుచుండెను. పట్టణమంతయుఁ గ్రమముగాఁ జీఁకటివ్యాపించెను. అచ్చటచ్చటఁ దలవరుల హెచ్చరికలుదప్ప వేరుశబ్దమేదియు వినిపించుచుండుట లేదు. నిద్రాదేవి ఱెక్కలువిప్పుకొని పట్టణమంతయుఁ దన కౌగిలి లోనికిఁ దీసికొనినట్లు గోచరించుచుండెను. చారుదత్త మైత్రే యులు క్రమముగా నింటికిఁజనుదెంచిరి. వర్ధమానకుఁడు వాకిట చారుదత్తునిరాకకై ప్రతీక్షించుచుండెను. అతఁడు మైత్రేయుని మాటలువిని తలుపుదీసెను. చారుదత్త మైత్రేయులు లోనికి వచ్చిరి.

మై:— వర్ధమానకా! కాళ్లుగడుగవలెను; రదనికను పిలువుము.

చా:- వలదులే ! నిద్రపోవుచున్న వారిని లేపుట యెందులకు ?

వర్ధ:- మైత్రేయా ! నేను నీరుపోసెదను నీవు పాదములను గడుగుము.

మై:- ఓయీ ! చూచితివా; ఈ ముండకొడుకు నీళ్లు పోయును. అచ్ఛమైన బ్రాహ్మణుఁడను నేను నీకు గాళ్లు గడిగెదను !

చా:- మైత్రేయా ! నీవే నీళ్లు పోయుము. వర్ధమానకుఁడే కాళ్లుగడుగును.

వ:-అయితే నీళ్ళుపోయుపయ్యా !

మైత్రేయుఁడు నీళ్లుపోసెను. వర్ధమానకుఁడు చారుదత్తుని పాదములు గడిగెను.

చా:-మైత్రేయా ! నీవుగూడఁ గాళ్లుగడిగించుకొమ్ము.

మై:- నాకుఁగూడ నెందుకు ? నేలమీఁద దెబ్బలు తిన్న గాడిదవలెఁ బడుకొని దొర్లువానికి ?

వర్ధ:- ఆ ! అదియేమి ? నీవు బ్రాహ్మణుఁడవుగదా ?

వి:- ఔనురా ! పాములన్నిఁటిలో శిఖండివలె బ్రాహ్మణులందరిలో నేను.

వర్ధ:- అయినమాత్రమేమిలే ! కడిగించుకొమ్ము.

వర్ధమానకుఁడు మైత్రేయుని పాదములుగడిగెను. వసంతసేన న్యాసమునుఁ గాపాడుటకుఁబగలు వర్ధమానకుఁడు, రాత్రులందు మైత్రేయుఁడును చారుదత్తునిచే నియమింపఁబడిరి. వర్ధమానకుఁడా సువర్ణ భాండమును మైత్రేయున కిచ్చి "మైత్రేయా ! పగలునేను రాత్రులు నీవుగదా ! తీసికొమ్ము"ని

చెప్పియిచ్చి పోయినందుకొనెను. మైత్రేయుఁడా సువర్ణ భాండమునుఁ బుచ్చుకొని "యింకను నాప్రాణమున కిది మిగిలియే యున్నది. ఈ యుజ్జయినిలో దొంగయనువాఁడే కఱవైపోయెను. దీని మొగముమండ యీ సువర్ణభాండము ప్రతిదినము నాకన్నను హరించుచునే యున్నది. దీనిని హరించువాఁడొక్కఁడైన లేఁడు. దీనినిఁ దీసికొనిపోయి లోపల యింటిలోఁ బెట్టెదన"ని విసుగుకొనెను. చారుదత్తుఁడు వానిఁ జనునయించి "ఓయీ! మనవస్తువైనచో నింటిలోబెట్టుకొనవచ్చును. ఆమె కిచ్చునంతదనుక జాగ్రత్తగాఁ గాపాడుమ"ని వానిని సమాధానపఱచెను. చారుదత్తమైత్రేయు లిరువురునుఁ బ్రక్కలపైఁ బండుకొనిరి. క్రమముగా నిద్రాదేవి వారినావరించెను.

౭

రాత్రి సగముగడచెను. చీఁకటి కన్నుకన్ను పొడుచుకొనిననుఁ గానిపించుటలేదు. దాసికీఁదోడాకసము మబ్బుపట్టి చుక్కలవెలుఁగైనను లేకుండఁజేసెను పట్టణమంతయుఁ దమస్సులో మునిఁగియుండెను. శర్విలకుఁడాసమయమున రాజమార్గమువెంటఁ దలవరుల కనుమఱుంగుచు నడచుచుండెను. ఆతఁడెచటకుఁ బోవుచుండెను? గమ్యస్థానమేదియో యతని మనస్సునకే స్ఫురించినట్లు లేదు. ఇదిచేయుటయా? చేయకుండుటా? అతని మనస్సునందుఁ గలవరము రేగెను. పోయినంత

మూర మతఁడాలోచించుచునేయుండెను. తుదకొకటిమాత్ర మునిశ్చయము. అట్టినీచమున కొడిగట్టకతప్పదు. మదనిక యుంకుఁ దనప్రేమ యట్టిది. ఆమె చిఱునవ్వు వెన్నెల లేక యతని మనసులోని యంధకారముపోదు మఱివేఱొక యుపాయము లేదా? తనమిత్రుఁడు ఆర్యకుఁడున్నాఁడు. అతఁడు రాజగునట. అతఁడే రాజైనచోఁ దనకుఁగొదువలేదు. నాల్గు దినము లోపికపట్టకూడదా? ఏమో ఆసిద్ధుఁడట్లు చెప్పెను. అదినిజమగునో కాదో! కాకపోయినచో నిట్టియవకాశము లభించుననియేమి? భవిష్యత్తు మనదిగాదు. కాకపోవుటయేమి? ఆసిద్ధుఁడు చెప్పిన దింతవఱకేదియుఁ దప్పలేదు. ఆ చెప్పినదియైన నతఁడార్యకునకుఁ జెప్పలేదుగదా! రాజగు పాలకునకే చెప్పెను. ప్రభువున కింతయనిష్టమునుఁ జెప్పెనుగదా! ఎంతనిశ్చయము లేకున్నఁ జెప్పెను? కాబట్టి యదితప్పక జరిగియే తీరును. జరుగునని పాలకుఁడే యనుకొనుచున్నట్లు దండధారకుఁడగు చందనకుఁడు చెప్పెను. జరిగినను జరుగకున్నను నొకటి మాత్రము నిజము. పాలకుని రాజ్యపుగోడలు బీట్లువిచ్చినవి. ఆబీట్లు బాగుగాఁగనిపెట్టి యచ్చట కన్నము వేయవలయును. మఱియంతదనుక నూరకుండుటయా? ఇంతకష్టములో మదనిక చిఱునవ్వులేకున్న గార్యము గట్టెక్కననిపించదు. ఆమెను వసంతసేననుండి యెట్లైనను విడిపింపవలయును.

శర్విలకుఁడు దానాలోచననుండి పైకి తేలెను. అప్పటి కతఁడు శ్రేష్ఠిచత్వరమునందుండెను. అతనిముందు విశాలమైన యొక యావరణము గన్పించెను ఆ యావరణము మనుష్యుఁడు చేయియెత్తిన నందకుండనుండి లోనికిదూఁకుట కలవి

గాకుండెను. శర్విలకుఁ డావరణముచుట్టు దిరిగి చూచెను. దక్షిణ దిశయందుఁ గొన్ని చెట్లుగుంపుగా నుండెను. శర్విలకుఁ డచ్చట గోడను భేదించి లోనఁ బ్రవేశించెను. లోన నొక పెద్దయిల్లుగలదు. అదిచాలవిశాలమైనయిల్లు. చతుశ్శాలఁగావచ్చును. శర్విలకుఁడు దానుసరియైనయింటికే వచ్చెననుకొనెను. శర్విలకుఁడింటిచుట్టును దిరిగి పరీక్షించెను. అతనికను వైనప్రదేశ మొకటి గాన్పించెను. ఆప్రదేశమునగోడ యెండకెండి వానకుఁ దడసియున్న మంతయు రాలిపోయి చవుడుపట్టియుండెను. దానికిఁ దోడెలుకలు గూడఁద్రవ్వెను. శర్విలకుఁ డాప్రదేశమునుఁ జూచి మిక్కిలి సంతసించెను. దీని దుంపతెగ యీ దొంగతనమను నది యిదియొకవిద్య. తక్కిన విద్యలన్నింటిలో కంటె దీనిలో రాణించుట చెడ్డకష్టము. ఒక కన్నము వేయుటలో నెంత నేర్పుండవలయును ! అసలంతవరకెందుకు? ఎక్కడ కన్నము వేయవలయునో యా ప్రదేశమును నిర్ణయించుకొనుటలోనే యున్నది యున్న తెలివంతయు. అదియంతయు సవాలక్ష గ్రంథము. గోడయెక్కడ బాగుగాఁదడిసి శిథిలమైనదో, యెక్కడ తవ్వినఁ జప్పుడుగాదో, యెక్కడ కన్నము వేసిన శాస్త్రీయముగా నుండునో, ప్రయోజనము సిద్ధించునో యిది యంతయు దానికదియొక ప్రత్యేకవిద్య. ఈ ప్రదేశము సరిగా శాస్త్రముఁజెప్పిన లక్షణములతోఁ గూడియున్నది. ఇటువంటి చోటు దొరకినదనిన నీపనిసిద్ధించినట్లే. ఇది మొట్టమొదట సిద్ధి లక్షణము. శర్విలకుఁడు కన్నము వేయుటకుఁ బ్రారంభించెను. ఇప్పుడెట్టికన్నమును వేయవలయును ? దీని దుంపతెగ యీ కన్నము వేయుటలో నెన్ని భేదములు ? వీనిలో కనకశక్తి చెప్పిన

నాల్గుమార్గములు చాలబాగున్నవి. పండినయిటుకలను లాగి వేయవలయును. పచ్చివానిని వగులగొట్టవలయును. మట్టిముద్ద లైనచో నీటితోఁదడుపవలయును. కొయ్యలున్నచో కోయ వలెనట. ఈనాల్గుమార్గములలో నివిపండురాళ్లుగాఁబట్టి యూడ దీయవలయు నన్నమాట! సరే ఇప్పటికి మార్గము నిర్ణయించు కొనుటయయినది. మఱి యిప్పుడు కన్నముయొక్క స్వరూప మెటులుండవలయును? గోడకుఁ దగినట్లుండ వలయును. ఆయింటి దర్జాకుఁ దగినట్లుండవలయును. రేపుప్రొద్దున పొరు గుననున్న వారందరుచేరి నన్నునిందించుటతోపాటుమెచ్చుకోను కూడ మెచ్చుకొనవలయును. కాబట్టి తీరుబడిగా నాకుఁ దెలి సిన శిల్పచమత్కార మంతయుఁ జూపింతును. ఈ విషయ ములో నాచార్యుఁడేమిచెప్పెను! పద్మవ్యాకోశము, భాస్క రము, బాలచంద్రము, వాపి, విస్తీర్ణము, స్వస్తికము, పూర్ణ కుంభము"ని యేడువిధములుగా సంధిభేదము లున్నవని చెప్పెను. ఈయన్నిటిలోఁ బూర్ణకుంభము చాలకష్టమైనది ఈ యింటికిఁ దగినది పూర్ణకుంభమే.

శర్విలకుఁడు పూర్ణకుంభమునే నిశ్చయించెను. అతఁడు సన్నద్ధుఁడై మొదటగ చోరజాతికివేల్పయిన కార్తికేయునకు నమస్కరించెను. తరువాత శాస్త్రకారులగు కనకశక్తికి, దేవ వ్రతునకు, భాస్కరనందికి నమస్కరించెను. తరువాతఁ దన గురువైన యోగాచార్యునిఁదలఁచుకొనెను. యోగాచార్యు నకుఁదాను ప్రథమశిష్యుఁడు. ఈశిష్యుని శ్రద్ధామేధలకు యోగాచార్యుఁడు మిక్కిలిసంతసించి తనకు యోగరోచన యను నొకయోషధినిచ్చెను. ఇది శరీరమునఁబూసికొన్నచో

రక్షకులెవ్వరునుఁజూడరు. కత్తిదెబ్బతగిలినను బాధకలుగదు. శర్విలకుఁడాయోగవిధిని శరీరమునందుఁబూసికొనెను. అతఁడు గన్నమువేయుటకుఁ బ్రారంభించెను. రెండుమూడిటుకలులాగి యీవలఁబెట్టగనే యతనికి కొలదారముసంగతి గుఱుతునకు వచ్చెను. అతఁడు కొలదారమునుఁదెచ్చుట మఱచిపోయెను. ఇప్పుడేమిచేయవలయును? అతఁడాలోచించుచు శరీరమును దడవికొనెను. అతడడవికొనుటలో యజ్ఞోపవీతము చేతికిఁ దగిలెను. "ఆఁ!సరే! ఇదియొకటియున్నదిగదా! ఇదియే యిప్పుడు కొలదారము. దీనిదుంపతెగ (యీయజ్ఞోపవీత మున్నదే యిది బ్రాహ్మణజాతికొక గొప్పయాయుధము. నాబోటివారికి మఱిన్ని. ఇది యిటువంటిసమయమున నెన్నివిధ ములనైన నుపయోగించును. కన్నము కొలుచుకొనవచ్చును. మునుగులు మొదలైనవి లాగి యూడదీయవచ్చును. తలు పుల గడియలూడదీయవచ్చును. పొరపాటున తేలో, పామో, కఱచినచో గట్టిగాఁగట్టుకొనవచ్చును)"

శర్విలకుఁడు స్వప్రమాణముగఁ గొలిచి కన్నమును వేయుట మొదలుపెట్టెను. ఇంకనొకయిటుక నూడదీసినచో కన్నము శాస్త్రీయముగానుండును. లేకపోయిన నష్టములేదు. ఆ యిటుక నూడదీసిన శాస్త్రముకొఱకే యూడదీయవల యును. శర్విలకుఁడాయిటుకను లాగెను. ఆయిటుక తీయగనే దానితోపాటు బుద్బుని యొక్కతాచుపాము బయటకు వచ్చి యతనిచేతికిఁ గాటువేసెను. శర్విలకుఁడు జందెమును చేతికి గట్టిగాఁజుట్టి "దీనిదుంపతెగ నేననుకొన్నట్లే జరిగినది. జాగ్ర తగా నాలోచించి తీసికొనివచ్చితినిగాని, లేకపోయినచో నేమి

"కావలసెడిది?" యని బొడ్డునఁ గట్టిన గుళిక నొకదానిని దీసి చికిత్స యొనరించుకొనెను. అతఁడు కొలది క్షణములలో స్వస్థుఁడయ్యెను. ఇంక ప్రమాదము లేదు. తన శిల్పమెట్లున్నదో పరీక్షించుట కతఁడు కన్నమున కించుక తొలఁగి నిలచుండి చూచుచుండెను. కన్నములోనుండి బయటకు దీపపు వెలుఁగు సన్నగాఁ బడుచుండెను. ఆ సన్నని దీపచ్ఛాయ చుట్టును చీఁకటియావరించి యొరపిడిరాతిపైన గీసిన బంగారు గీతవలెఁ బ్రకాశించెను. శర్విలకుఁడు కన్నమునుఁ జక్కగాఁ బరీక్షించెను. అతనికిఁ జాలతృప్తి కలిగెను. ఇఁక నిప్పుడు లోపలఁ బ్రవేశింపవలయును. లోపల నెవరైనను మేల్కొని యుందురేమో? అతఁడొక పురుషాకృతిలో నున్న బొమ్మను గన్నములోనుండి లోనికిఁ జొనిపెను. ఆ బొమ్మ నటునిటు నాడించెను. ఎవ్వరు చూచినట్లు లేదు. అతఁడు మఱల కార్తికేయునకు నమస్కరించెను. మఱల శాస్త్రకారులను నమస్కరించెను. మఱలఁ దన గురుపరంపరఁ దలంచుకొనెను. తరువాత నతఁడు గన్నములోనుండి కాళ్లుముందుగ లోనఁ బ్రవేశించెను. లోన నిద్దరు పురుషులు శయనించియుండిరి. శర్విలకుఁడు గోడప్రక్కగా క్షణమూఁగి వారివంకఁ జూచుచు మెల్లగా ద్వారమువద్దకేగి గడియదొలఁగించెను. అతఁడా తలుపులవంకఁ జూచెను. తలుపులు మిక్కిలి పాతవి. తీసినచో చప్పుడగునేమో! కొంచెము తడుపవలయును. నీళ్లెక్కడదొరకును? అతఁడిటునటు కనుఁగొనెను. దగ్గఱలో నీళ్లున్నవి. అతఁడా నీటినిఁ దెచ్చి భూమిపైఁ బడకుండఁ దలుపుబందులను, పిడచలను తడిపి, వెనుకకుఁ జూచుచు మెల్లగాఁ దలుపులు దీసెను. సరే బాగుగానున్నది.

"ఇప్పుడింతవఱకంతయు సవ్యముగనే జరిగినది. ఇచటవీరు నిజముగా నిద్రపోవుచున్నారో? దొంగనిద్దురయో? పరీక్షింపవలయును." అతఁడు వారివద్దకుఁబోయి వెక్కిరించి, వికారములుచూపి, భయపెట్టి యనేకవిధములఁ బరీక్షించెను. అతనికేమియు ననుమానము గలుగలేదు. వారు నిజముగనే నిద్రపోవుచుండిరి. ఉచ్ఛ్వాసనిశ్వాసములు విశదములై సమాంతరములు గలిగియుండెను. అప్పలుగదలిన చాయలేమియు లేవు. శరీరమంతయు శైథిల్యమునొంది ప్రక్కలఁబాఁటి కాళ్లుచేతులు వ్రేలాడుచుండెను. శర్విలకునకు నిజముగావారు నిద్రించుచుండిరనియే నమ్మకముగలిగినది.

అయినను శాస్త్రముకొలఁది తుదిపరీక్ష గూడఁ జేసెను. దీపము దీసికొనివచ్చి కళ్ళకెదురుగాఁ బెట్టెను. సరియే శాస్త్రముగూడ నొప్పుకొన్నది. దొంగనిదుర బోవువాఁడు కళ్ళకెదురుగా దీపమునుఁబెట్టిన సహింపలేఁడు. శర్విలకుఁ డిపుడింట నాల్గుమూలలఁ జూచెను. ఒకప్రక్క మృదంగము, దర్దురము, పణవము. ఒకప్రక్క వీణ, పిల్లనగ్రోవులు. మఱియొకప్రక్క పుస్తకములు. శర్విలకున కివిచూచి నడుమువిఱిగిపోయెను. "ఏమి! ఇవి నాట్యాచార్యునియిల్లా? జోగి జోగి రాసికొనినచో బూడిదరాలినదట. నేనీ యింటినిఁజూచి భ్రమపడితిని. ఇంత యిల్లున్నది. వీఁడు నిజముగా దరిద్రుడేనా! లేక రాజభయము వలననో, దొంగభయమువల్లనో, భూమిలో నేమైన పాతియుండునా! సరే నేను శర్విలకుఁడ నాయెను. నాముండిటు వంటి దాపరికములు నిలువలేవు. శర్విలకుఁడా భూమినిఁ బరీక్షించి చూచెను. భూమిలో పాతున్నట్లు గనిపించలేదు. అయి

నను శాస్త్రముచెప్పినట్లతఁడు కొన్నివిత్తులనుఁదీసి యభిమంత్రించి నాల్గుదిక్కులజల్లెను. చల్లినగింజలు చల్లినట్లున్న వే గాని యేమాత్రమునుఁ జెరుగలేదు. పాపము! వీఁడు నిజముగానే దరిద్రుఁడు. సరే పోనిమ్ము ఏమిచేయుదును? చేసిన ప్రయత్నములన్నియు ఫలించునా? ఇంకొకచోఁటికిఁ బోయెదను. శర్విలకుఁడిట్లనుకొని యతఁడు పోవుటకు ద్వారము సమీపించెను. ఇంతలో నొక చమత్కారముజరిగెనుఁ. అతఁడట్లుజరుగునని యూహించి యుండలేదు. అట్లూహించుట సంభవమునుఁగాదు. దీనినిఁగురించి యతఁడు దరువాతచాల నవ్వుకొనెను. ఇట్టివాండ్రుగూడ లోకమున నుందురా? ఉందురనుటకు పాపము మైత్రేయుఁడే సాక్షి. అతఁడు ద్వారమును సమీపించగనే యంతవరకును గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్న మైత్రేయుఁడు హఠాత్తుగా "మిత్రుఁడా! మిత్రుఁడా! అదేదో కన్నమువలెనున్నది. వాఁడెవఁడో దొంగవచ్చినట్లున్నాడు. ఇదిగో బాబు! నీ సువర్ణభాండమును నీవు దీసికొమ్మ"ని పలవరింప సాగెను. ఈమాటలువిని శర్విలకుఁ బ్రాణము పైనబోయెను. వీఁడు మొదటనుండి నన్ను చూచుచునేయుండి నేనిప్పుడు వెళ్ళుచుండగా హేళనచేయుచున్నాఁడు? అయితే వీనినిఁ జంపివేసెదను. అతఁడు కొంచెము వెనుకకు తగ్గెను. "ఒకవేళ కలవరించుచున్నాఁడేమో". అతఁడు వెనుకకుదిరిగి మైత్రేయుని వంకఁజూచెను. మైత్రేయుఁడు చేతితో నేదియో మూటపట్టుకొనియుండెను. అతనికండ్లు గాఢముగా మూసియేయుండెను. శర్విలకుఁడు మఱికొంచెము దగ్గరకుఁబోయి పరీక్షించెను. చినిగిపోయిన యంగవస్త్రముతోఁ గట్టినమూట. ఆ యంగవస్త్రపు

సందులనుండి యేదియో మిలమిల మెఱయుచు గన్పించెను. శర్విలకుండా మాటను బుచ్చుకొనుటకుఁ జేయిచాచెను. ఇంతలో మైత్రేయునిఁ జూచి యతనికి మిక్కిలి జాలివొడమెను. పాపము! వీఁడును నావలెనే మిక్కిలి దారిద్ర్యములోనున్నాఁడు. వీని నేడిపించుట యంతమంచిదిగాదని యాతఁడనుకొనెను. ఇంతలో మైత్రేయుఁడు "ఓయీ! ఈ సువర్ణభాండమును బుచ్చుకొనుము. పుచ్చుకొనకపోతివా గోబ్రాహ్మణులమీఁద నొట్టు." ఆమాటలు శర్విలకుఁడు వినెను. "గోబ్రాహ్మణుల మీఁదనొట్టు మీరఁదగినదిగాదు. తప్పకుండ మన్నింపఁదగినది. సరే! తీసికొందును"ని యతఁడు నిశ్చయించెను. "కాని యింతలో వీఁడు గన్నులు తెఱవవచ్చుచు. దీపము వెలుఁగుచున్నది." శర్విలకుఁడు బొడ్డునుండి యొక బరిణతీసి తెఱచెను. అందుండి యాగ్నేయ కీటములేచి పల్లటీలు గొట్టుకొనుచు నచ్చటనుండి దీపమువద్దకుఁబోయి దీపముపైన రెండుమూఁడు చోట్ల మండలాకృతిగఁ దిరిగి యార్పివేసెను. ఇల్లంతయు నంధకారమయ్యెను. "ఈ యగ్నికీట మిల్లంతయుఁ జీకటిచేసినది. నేను బ్రాహ్మణకులమంతయుఁ జీకటిచేసితిని. నాతండ్రి చతుర్వేదవిదుఁడు. చేయిజాచి యెఱిఁగినవాఁడుగాఁడు. నేనాయన కడుపునఁబుట్టితిని. ఇదిగో! యీభోగముదియున్న దే మదనిక, దానికొఱకీ పాపపుపని జేయుచుంటిని." శర్విలకుఁడు మఱలవెనుకకుఁబోద మనుకొనెను. "అయిన నింతదూరము వచ్చి యీ యాలోచన యెందులకు? కానిమ్ము పాపమో పుణ్యమో? తీసికొందును" అతఁడు మైత్రేయునికై చేయి చాచెను. శర్విలకునిచేయి చల్లగానుండెను

మై:— ఓయీ! నీచేయి చల్లగానున్న దేమి?

శర్విలకుఁడు "నీటిలోముంచుటచేత చల్లగానున్నదికాఁబోలు" ననుకొని చేయిచంకలోనిడుకొని వెచ్చబెట్టెను. తరువాత సతఁడు మైత్రేయునినుండి సువర్ణభాండమును భద్రముగాఁగైకొనెను.

మై:— జాగ్రత్తగాఁ దీసికొంటివా?

శర్వి:— నీవుచెప్పుటయు నేను దీసికొనకుండుటయా? మిక్కిలి జాగ్రత్తగాఁ దీసికొంటిని.

మై:— ఇఁక నిప్పుడు వస్తువులన్నియు నమ్మికొనిన కోమటివానివలె నేను హాయిగా నిద్రింతును.

శర్వి:— హాయిగా నూరేళ్లు నిద్రపొమ్ము.

శర్విలకుఁ డచ్చటనుండి బయలుదేరెను. "అబ్బ! ఈ బోగముదానికొరకు బ్రాహ్మణకులము చీఁకటిలోఁబడినది. కులము ననుటయెందులకు? నేనేపడితిని. ఈదారిద్ర్యమునకంటెఁ జెడ్డవస్తువు లోకములో మఱియొకటి లేదు. పౌరుషముదీనివలనఁ జచ్చినంత మఱిదేనివలనను జావదు. ఈపాపపుఁబనిని నిందించుచునే చేయుచుంటిని." అతఁడు ద్వారమునుదాఁటి బయట వసారాలోనికివచ్చెను. ఎవరోమనుష్యులు నడచినసవ్వడి, ఎవరోఁడగ్గిరధ్వని. "వీరెవరైన రక్షకులుగారుగదా! మొద్దువలె నిలచుండును. అయినను నాకుఁగూడ రక్షకులవలనిభయమేమి? నేను పిల్లివలె నడువగలను. లేడివలెఁబరుగెత్తఁగలను. నీటిలోఁబడినవలె నీఁదగలను. డేగవలె దుముకిలింతును. కుక్కవలెఁ బసిగట్టుదును: పామువలెఁ బ్రాకుదును. మాయవలె వేషములు వేయుదును. సరస్వతివలె వివిధభాషలు మాట్లాడ

గలను." శర్విలకుఁడు వీథిద్వారము సమీపించుచుండెను. వీథిలోనికి తలుపులు తెఱచియుండెను. సరిగా నాసమయమున రదనిక వీథిలోనుండి లోనికివచ్చుచుండెను. అతనికామె ద్వారముకడఁగన్పించెను. రదనిక శర్విలకునిఁజూచెను. ఆమె "దొంగలు దొంగల"ని కేకలుపెట్టుచు ముందునకువచ్చుచుండెను. శర్విలకుఁడు గలవరపడెను. "ఈవ్యక్తియెవరు? చంపుదునా?" రదనికసమీపించెను. శర్విలకుఁడామెను తేరిచూచెను. "పాపమిది యెవరోయాడుది. దాసిగావచ్చును. ఇదినన్నేమిచేయును?"అతఁడొక్కయుదుటున నామెను దూసుకొని వీథిలోనికి దుమికెను.

# 3

రదదనిక మిక్కిలిభయపడిపోయెను. ఆమెయొడలు కొయ్యబాఱెను. బిగ్గరగాఁగేకలువేయుదమన్నను నామెనోటివెంట మాటపెగులలేదు. నాల్గునిముసములిట్లుగడచెను. రదనిక వీథిచావడిలోకేఁబోయి చూచెను. "వర్ధమానకుఁడిచటఁబండుకొనియుండవలయును. అతఁడేడీ?" ఆమె చతుశ్శాలలోనికివచ్చెను. ఆమెయెట్లువచ్చినదో యామెకే తెలియదు. అచటకు వచ్చునరికామె నోరామెకువశమయ్యెను. "మైత్రేయా! మైత్రేయా! లెమ్ము! లెమ్ము! మనయింటిలోఁ గన్నమువేసి దొంగ పాఱిపోవుచున్నాఁడు." రదనిక రెండుమూఁడుతడవలు బిగ్గరగాఁగేకలుపెట్టెను. ఆకేకలకు మైత్రేయుఁడదరిపడిలేచెను. అతనికి నిద్రాభంగముగలిగినందులకు మిక్కిలికోపమువచ్చెను.

"ఆఁ యేమిటే! దిక్కుమాలినముండ! ఏమనుచున్నావు? దొంగ వేసి కన్నము పైపాటిపోయినాడా?"

ర:— ఏమయ్యా నీకెప్పుడు పరిహాసమేనా? అదిగో కన్నము. కొంపమునిఁగినది. మైత్రేయుఁడు కన్నమువంక జూచెను. బాబో! పెద్దదర్వాజాయంతకన్నము. ఏమయ్యో! ఏమయ్యో! లేలే! మనయింటిలోఁగన్నము వేసి దొంగపాటి పోయినాఁడు." చారుదత్తునకింతవఱకును మెలకువ రాలేదు. అతనిమనస్సులో రేభిలునిసంగీతము అస్వరసంచారము గిరవాటులుగొట్టుచుండెను. మైత్రేయుడు చారుదత్తునియొడలూపఁజూచుచుఁ గుదుపుచుఁ జెవివద్దనోరుపెట్టి నాలుగైదుసార్లు బిగ్గరగా నఱచెను. చారుదత్తుఁడు లేచెను. అతఁడావులించి కళ్లునులుపుకొనుచు మైత్రేయునివంక ప్రశ్నాపూర్వకముగాఁజూచెను.

మై:— ఏమయ్యా! అట్లుచూచెదవు? దొంగవచ్చికన్నము వేసి పాటిపోయినాఁడు,

చా:— మైత్రేయా! నీకెప్పుడునుఁ బరిహాసమేనా?

మై:— పరిహాసముగాదయ్యా! ఇదిగో! నీవేచూడుము.

చా:— ఎక్కడ?

మై:— ఇదిగో! యిక్కడ.

చారుదత్తుఁడు కన్నమువంకఁజూచెను. కన్నము మిక్కిలి నిపుణముగాఁ ద్రవ్వఁబడియుండెను. కన్నము తలసన్నముగానుండి మధ్యభాగము విశాలముగానుండి నేర్పుగల కుమ్మరివాఁడుచేసినకుడంవలెనుండెను. అతఁడు దగ్గఱకేఁగి పరీక్షించెను. ఇట్లు గన్నముత్రవ్వుటలో నెంతనేర్పుండవలయును? వాఁడు గజదొంగకావచ్చును.

మై:- నాకుఁజూడఁగా నీకన్నము వేసినవాఁడు నువ యూరికిఁ గ్రొత్తవాఁడైనఁ గావలయును లేక నేర్చుకొనువాఁ డైనఁగావలయును. కాకపోయిన నీయుజ్జయినిలో మనసంగతి యెఱుఁగనివాఁడెవ్వఁడు ?

చా:- నిజముగావాఁడు క్రొత్తవాఁడే కావచ్చును. వానికి మనసంగతి తెలిసియుండదు. ఇంటినిఁజూచి యాసపడి నాఁడు. అతనికి మిగిలినది కన్నముత్రవ్విసకష్టమే. పాపమా నిర్భాగ్యుఁడింటికిఁబోయి స్నేహితులతో సేమని చెప్పును.

మై:- అదేమయ్యా ! అదేమి ! ఆదొంగముండ కొడు కునుగుఱించి యింతజాలిపడెదవు ? అబ్బో యింతయున్నది. ఇందులో రత్నభాండమో కనీసము సువర్ణభాండమో తీసుకొని పోవుదమనుకొన్నాఁడు.

మైత్రేయునికి సువర్ణభాండముసంగతి గురుతగిలెను. "అరే ! సువర్ణభాండమేమైయుండును ? ఆఁ ! చారుదత్తునకిచ్చి తినిగదా! మంచి తెలివిగలపనిఁజేసితిన"ని యనుకొని 'యోయీ! చారుదత్తా ! నీవెప్పుడును నన్ను మూర్ఖుఁడని తెలివితక్కువ వాఁడని యనుచుందువు. ఆసువర్ణభాండము నీకీయుంబట్టి సరి పోయినది. లేకపోయిన నీదొంగలంజకొడుకు తప్పకుండ నెత్తు కొనిపోయియుండును.'

చా:- ఓయీ ? వేళాకోళమా !

మై:- నేనెంత మూర్ఖుఁడనైనను, నెంత తెలివితక్కువ వాఁడనైనను వేళాకోళమునకు దేశకాలము లెఱుఁగని వాఁడ నుగాను.

చా:- నీవా సువర్ణభాండమును నాకెప్పుడిచ్చితివి ?

మై:- ఇదిగో నీచేయి చల్లగానున్న దేమని యడి గితినే అప్పుడు.

చా:- అదికూడనా? చారుదత్తున కట్టిదేమియు లేదు. అతఁడు క్షణమాలోచించెను. "ఈ మూర్ఖుఁడు చక్కగా దొంగ చేతికప్పగించినాఁడు. సరే! పాపము వానికఫలితమైన దక్కెను. పోనిమ్మనుకొని మైత్రేయా! నీకొక సంతోషవిషయమును జెప్పెద ననెను

మై:- ఏమిటి? పో లేదుగదా!

చా:- పోయినది.

మై:- మఱి యిక సంతోషవిషయమేమున్నది?

చా:- పాపము దొంగ కష్టమూరకపో లేదు.

మై:- ఓయీ! అది న్యాసమాయెను. మనసొమ్ము గాదుగదా.

ఆమాటలు చారుదత్తుని చెవినిబడుటతోడనే యతని శరీరము కొయ్యబారిపోయెను. మైత్రేయుఁడతని సమా శ్వసించి "ఓయీ! అది యెవరిదో సొమ్ము. మనదా పాడా? దానిని దొంగ లెత్తుకొనిపోఁగా పీడవదలిపోయిన దనుకొనక నీ వేడ్చెదవేమి? యనెను. చారుదత్తుఁడు మిక్కిలివిచారించెను. ఆ వస్తువు దొంగయెత్తుకొనిపోయెను. ఈమాటలెవరు నమ్మె దరు? చారుదత్తుఁడు నట్టి దరిద్రుఁడు. అని యూరిజనులెంగి నట్లు పన్నెదరని యందురు. భగవంతుఁడు పులిమీఁద పుట్ర యన్నట్లునాకిదియొకటి తెచ్చిపెట్టెను. నానడవడిలో సంతవఱకు మచ్చ లేదనుకొంటిని. నేటికదికూడ సిద్ధించెను.

మై:- ఎవఁడట్లనునది ? నీకెందుకు నీవూరకుండుము. నీపక్షమున నేను వాదింతును. ఎవరిచ్చిరి ? ఎవరు పుచ్చుకొనిరి ? ఎవరుసాక్ష్యము? ఇదంతయు సవాలక్షగ్రంథమున్నది. ఏమియు ననుటయంత తేలికయా ?

చా:- సరే ! మిక్కిలి బాగున్నది. నేనిప్పుడు దీనికోస మబద్ధముగూడ నాడుదునా? అంతకంటె ముష్టి యెత్తియైన నాబాకీ తీర్చెదను.

ఇంతలో రదనిక లోననుండి వచ్చెను. ఆమె మైత్రేయుని ధూతాంబ పిలుచుచున్నదని చెప్పెను.

ధూతాంబ చారుదత్తుని భార్య. ఆమె యభ్యంతరమున శయనించియుండెను. రదనిక యామెతో దొంగవచ్చి సువర్ణ భాండము నపహరించుకొనిపోయిన సంగతి చెప్పెను. ధూతాంబ యాసంగతి విని మిక్కిలి నిర్విణ్ణురాలయ్యెను. ఇప్పుడు దనభర్త యేమి చేయగలఁడు ? ఆ పోయిన సువర్ణభాండము మనదైన కాదాయెను. లోకులేమనుకొందురు : దారిద్ర్యమువలన చారు దత్తుఁడీపని చేసెననుకొందురు. ఈ దరిద్రుల యదృష్టము తామర పాకున నీటిబొట్టువంటిది. దీనితో భగవంతునకొక యాట. ఆయెత్తుకొనిపోయినవాఁడు తననగలైన నెత్తుకొని పోయినాడు గాదు. ధూతాంబకుఁ దన యాభరణముల సంగతి గుర్తుకు వచ్చెను. కలనాఁడామె యేడువారముల సొమ్ములు పెట్టుకొనెడిది. మఱియిప్పుడు ? ఇప్పుడేమున్నది. తనపుట్టినింటివారు పెట్టిన రత్నావళియొకటున్నది. అదియైనను పుట్టినింటివారు పెట్టినదిగాఁ బట్టి చారుదత్తుని శీలముదానినిముట్టుకొనీయలేదు. సరియే యిట్టిచారుదత్తుని శీలమిప్పుడు రత్నావళి కాపాడవలయును.

మైత్రేయుఁడు ధూతాంబవద్దకుఁబోయెను. ఆమె యతనినిఁజూచుటతోడనే నమస్కరించి కూర్చుండుమనెను. మైత్రేయుఁడామె నాశీర్వదించుచుఁ గూర్చుండెను.

ధూ:— అయ్యా! తూర్పునకుఁదిరిగి కూర్చుండుము.

మైత్రేయుఁడు తూర్పునకుఁ దిరిగికూర్చుండెను. ధూతాంబ మెడలోనిరత్నావళినిఁదీసి యిదిగో! దీనినిఁబుచ్చుకొమ్మనెను. మైత్రేయునకాశ్చర్యముగలిగెను. "ఇదియేమమ్మా? ఏమి యిది?"

ధూ:— నేను రత్నషష్ఠియుపవాసముంటిని. ఉపవాసాంతమున దానికుద్యాపనముచేయవలయును. కలిగినట్లుగా నొక బ్రాహ్మణునిఁబిలిచి రత్నపూజచేయవలయును. కాఁబట్టి యీరత్నావళినిఁబుచ్చుకొమ్ము.

మైత్రేయుఁడు తానుసద్బ్రాహ్మణుఁడైనందులకు మిక్కిలి సంతసించెను. అతఁడారత్నావళినిఁబుచ్చుకొని ధూతాంబను దీవించి యచటనుండి బయలుదేరుచు "చాలబాగున్నదమ్మా! నాకు చాలసంతోషముకలిగినది. నేనీమాట చారుదత్తునకుఁ గూడ చెప్పెద"నని బయలుదేరెను. ధూతాంబ "మైత్రేయా! నన్ను నవ్వులపాలుచేయకుమ"నెను. మైత్రేయుఁడు ధూతాంబ యుద్దేశ్యమునుగ్రహించెను. "ఆహా! యేమి యీమెయౌదార్యము! చారుదత్తునకుఁదగినభార్య." మైత్రేయుఁడు చారుదత్తునివద్దకువచ్చెను. అతఁడు రత్నావళినిఁదీసి చారుదత్తునకుఁ జూపెను.

చా:— మైత్రేయా! ఇదియేమి?

మై:— ఏమియులేదు. ఇది తగినభార్యనుఁ బెండ్లాడినందులకు ఫలము.

చారుదత్తుఁడు సంగతి గ్రహించెను. "ఈబ్రాహ్మణి నన్ను జాలితలంచినది. ఆహా! నిజముగా నిప్పుడు దరిద్రుఁడనైతిని. డబ్బులేనివాఁడు నిజముగా నాడుదానితోసమానుఁడు. ధనమున్నచో నాడు దేవపురుషుఁడు. అయినను నేనిట్లనుకొనుట యేమిటికి? నిజముగా నేను దరిద్రుఁడనుగాను. పాపము పేదదైనను నాసుఖదుఃఖములనుబంచుకొనెడి యిట్టిభార్యామిత్రులుండ నేను దరిద్రుఁడనెట్లు?" చారుదత్తుఁడట్లు యొకగడియకాల మాలోచించెను. అతనిమనస్సులో ననేకాలోచనలు వచ్చుచుఁ బోవుచుండెను. అందుఁగొన్ని యనుకూలమైనవి. కొన్ని ప్రతికూలమైనవి. ఏయొకటియు మనస్సునందు నిలువలేదు. అతఁడు కన్నులు విప్పి చూచుటకైనను తీరిక లేక లాకుచుండెను. చీకట్లుక్రమముగాఁ బశ్చిమదిశకొత్తిగెను. ఉదయ కాలశోభ లోకసమునఁ బలుచగా వ్యాపించి దిక్కులనుఁ బ్రకాశ మొనరించెను.

చారుదత్తుఁడు మైత్రేయునిఁజూచి "మైత్రేయా! తెల్లవారినది ఈవార్త యూరిలోప్రాకకమునుపే వసంతసేనయింటికిఁబోయి 'నీసువర్ణభాండము మా దేమను సమ్మకముతో జూదమందోడిపోయితిని. దానిబదులుగా దీనిఁదీసికొమ్మని యీరత్నావళిని నా మెకిమ్మ'ని చెప్పెను.

మై:- అదేమిటయ్యా! మనమేమైన తింటిమా పిడితిమా? అదియెంత దానివిలువయెంత! దానిని దొంగలెత్తుకొనిపోయిరని చతుస్సముద్రసారభూతమైన యీ రత్నావళి నిత్తువా?

చా:— మైత్రేయా! అట్లనఁగూడదు. ననలనుసమ్మి యామె యీ సువర్ణ భాండము మనవద్దఁబెట్టినది. ఈరత్నావళి మనకిచ్చునది యామె న్యాసమునకుఁగాదు. ఆమెవిశ్వాస మునకు. కాఁబట్టి నామీఁద నొట్టుసుమా! దీనినామె కీయకుండఁ దిరిగి రాకుము

మైత్రేయుఁడు రత్నావళినిఁబుచ్చుకొనెను ఆసమయ మున వర్ధమానుఁడచటకువచ్చెను. చారుదత్తుఁడు వర్ధమానుని జూచిఁ "వర్ధమానకా! ఊరిలో నెవ్వరికిఁదెలియకుండ జాగ్రత్త పడుము. ఈయీడఁదీసినరాళ్లతో నే కన్నము నెఱుకవడకుండునట్లు పూడ్చివేయుమ"ని చెప్పెను. వర్ధమానకుఁడు గన్నమును పూడ్చుటకుఁబోయెను. మైత్రేయుడు వసంతసేనయింటికై బయలుదేరెను. చారుదత్తుఁడు మైత్రేయుని వెనుకకుఁ బిలిచి "జాగ్రతసుమా! నీవేమైన దైన్యముగా మాట్లాడెదవేమో!"

మై:— ఓయీ! దరిద్రుఁడు దైన్యముదక్క మాట్లాడునా?

చా:— మైత్రేయా! నేనిప్పుడు దరిద్రుఁడనుగాదు. అట్టి భార్యయున్నది. నీవంటిమిత్రుఁడున్నాఁడు. నాకంటె భాగ్యవంతుఁడెవఁడు?

మై:— సరే!

మైత్రేయుఁడు వసంతసేనయింటికి బయలుదేరెను.

———

# మదనిక

## ౧.

ఆరాత్రి వసంతసేనకు నిద్రపట్టలేదు. ఆమె మనస్సు వ్యగ్రమైయుండెను. తదేకధ్యానముతో నామె చారుదత్తుని గుఱించి యాలోచించుచుండెను. చారుదత్తునియందామె ప్రీతి దినదిన ప్రవర్ధమానమగుచుండెను. ఆనాఁడు సాయంతనమున నాతనితో జరిగిన సంభాషణమును నతని యాదరణమును నామె మనస్సున గాఢముగా నత్తుకొనెను. చారుదత్తుఁడామెపై ప్రావారకము విసరివేసెను. ఆ ప్రావారకము నామె కప్పుకొన్నది. జాజిపూల వాసన గుప్పుమని యామె యొడలంతయుఁ బ్రాకెను. ఆమె యప్పుడనుకొన్నది. ఆతఁడింకను యౌవనమందు ఉదాసీనుఁడుగా లేదని. ఆ జాజిపూలతావితో నాతని యౌవనము గుబాళించి యామె యొడలెల్ల జలదరింపజేసెను. ఆమె రదనిక కాదని తెలిసికొనగనే చారుదత్తుఁడెంత నొచ్చుకొనెను. ఆమె కులవధువుగాదు. చారుదత్తునివంటివాఁడామెను శీఘ్రముగా ననునయించెను. ఆహా! యేమి యాతని వినయసంపద. దానికితోడతని యౌదార్యమెంతని కొనియాడవలయును. సంవాహకునియుదంతమామె మనస్సునందుఁ దిరిగెను. కర్ణపూరకునకిచ్చుట కాయనయొద్ద నేమియు లేకపోయెను. ఆ ప్రావారకమునే యాతనికొసంగినాఁడు. కర్ణపూరకునకొక యాభరణమొసంగి యాప్రావారకము నామె విలుచుకొన్నది. దానినిమజిల నామె కప్పుకొనెను. దానినిజూచి పూలపరి

మళిమ మఱల నామె యొడలెల్లఁ బ్రాకెను. మఱల నా జాజి పూలవాసనలో గుబాళించిన యాతని యౌవనమామెయొడ లెల్ల గౌఁగలించుకొనెను. మఱల నామెయొడలెల్ల జలదరించెను. ఆమె మనస్సున సాత్త్వికభావోదయమయ్యెను. చారుదత్తుఁడాలంబనస్థితినందెను. ఆ జాజిపూలవాసన లుద్దీపనవిభావమయ్యెను. ఈ విభావానుభావము లామెమనస్సునందు రతిని మేల్కొల్పెను. ఆ చారుదత్తుఁడు ఆ పరిమళము పునఃపునరను సంధీయమానములై యామెమనసున మేల్కొల్పిన రతిభావమును హృదయ సంవాదతన్మయీభావక్రమమున పరాంకోటి నందించెను. ఆ యనుభూతివిశేషమామె శరీరమున స్పష్టముగాఁ గోచరించెను. ఆచిహ్నములుతరువాత మదనికవచ్చి చూచు వఱకి ట్లేయున్నవి. ఆమెతన్మయతాస్థితియందు రెండుగడియల కాలమట్లే యుండెను ఆమెకు శారీరకస్మృతి గలుగునప్పటి కామె యొడలెల్ల ముచ్చెమటలు పోసియుండెను. శరీరమెల్ల గగుర్పాటునంది జలదరించుచుండెను. ఆమె మదనికా! యని పిలిచెను. ఆమెకంఠము గద్గదమయ్యెను. స్వరముమారెను. మదనిక పలుకలేదు. ఆమె కంఠముపెగుల్చుకొని మదనికా! యనిమఱల గేకవైచెను. మదనిక యిచ్చటనే పండుకొన్నది. ఆపిలుపున కామె లేచెను.

మదనిక లేచి చూచునరి కుదయారుణకాంతు లోరగా దెరచియున్నగవాక్షమునుండి లోనవ్యాపించి యెఱ్ఱని మణిదివ్వె వెలుఁగులతో సయ్యాటలాడుచుండెను. ప్రాభాతమంద వాయువులు చిన్నచిన్న కెరళ్లుగావచ్చి వసంతసేన కట్టుకొనిన మిసిమి దువ్వలువ చెఱఁగును నామె స్తనమండలమునుండి మెల్ల

మెల్లగాఁ దొలఁగించుచుండెను. మదనిక వసంతసేననుఁ జూచెను. వసంతసేన కూర్చుండియుండెను. ఆమె కన్నులు అరుణములై యుండెను. ఆమె శరీరమున చెమటపట్టి యుండెను. మదనిక యామెను "ఏమమ్మా! యిదియేమి యిట్లు కూర్చుంటివి! నీమొడలంతయు స్నానముచేసినట్లు చెమట పట్టియున్నది" అని ప్రశ్నించెను. వసంతసేన నిర్నిమేషముగా నట్టే చూచుచుండెను. ఆమె మనసింకను నింద్రియసాంగత్యమునందియుండ లేదు. మదనికనుఁ బిలిచినతర్వాత నామె మఱలఁ దన్మయత్వమునందెను. మదనిక యామెను మఱల మఱలఁ బిలుచుచుఁ జేతితో తట్ట సాగెను. రెండుమూడుసార్లు తట్టినతరువాత వసంతసేన బాహ్య స్థితిఁగాంచెను. మదనిక గవాక్షము తలుపులు బాగుగాఁ దెఱచెను. బయట బాగుగాఁ దెల్లవారెను. ఉదయారుణ కాంతులు గవాక్షమునుండి లోనికి వ్యాపించి సజాతీయములగుట మణిదీప్తి వెలుఁగులతో వైరము పెంచుకొనుచుండెను. ప్రాభాతానిలములు కెల్లు కెల్లుగావచ్చి వసంతసేనచనుకట్టుపైని మిసిమిదువ్వలువను మెల్ల మెల్లగాఁ దొలఁగించెను. వసంతసేన కపోలములెఱ్ఱవడెను. ఆమె కన్నులయందు నవ్వుచు పయ్యెదను సరిచేసికొనెను. ఆచల్లనిగాలికి వసంతసేనయించుక తేరుకొనెను. ఆమె మదనికనుఁజూచుచు "మదనికా! నిన్నసాయంత్రము పూర్తిచేసిన ఆలికానిచిత్రపటమిటుకొనిరమ్మ"ని పంపెను. మదనిక చారుదత్తుని చిత్రపటమునుఁ దెచ్చెను. వసంతసేన యాచిత్రపటమును క్రిందటిరోజుసాయంకాలమున రచించి యుండెను. ప్రావారకమును గప్పుకొనియున్నట్లు చారుదత్తుఁడందుఁ జిత్రింపఁబడెను. చిత్రగతమైన ప్రావారకమును జీకాడ

జాజిపూలవాసలువచ్చుచున్నవా? వసంతసేన యాచిత్రముపంక స్నిగ్ధముగాఁజూచుచుండెను. "మదనికా! ఈచిత్రము నిజముగా నార్యచారుదత్తునివలెనున్నదా"?

మద:— లేకేమమ్మా? నీవాచిత్రమువంక నంతమెత్తగాఁజూచుచుంటివి.

వసం:— మదనికా! వేశ్యజాతికింత మెత్తఁదనముండు నందువేమి!

మద:— నేననసేల? నీచూపులవెంట గుండెదుముకుచున్నది. ఆహృదయమే చెప్పును.

వసం:— మదనికా! మదనికా! నన్ను సాటివేశ్యలలో నవ్వుపాలుచేయకు.

మ:— నేను మదనికనుగాదమ్మా! నీమనస్సు నన్న దనము నాకుఁదెలియదా?

వారిసంభాషణమున కంతరాయము గలిగెను. తియ్యని ద్రాక్షపానకములో పుడకవోలె నొకచేటి యాయంతరాయము గల్పించెను. ఆమె వసంతసేనను సమీపించి "దేవమమ్మా! అమ్మగారు నీకోఁజెప్పుచున్నది. వాకిటిలో తెరగట్టిన ప్రవహణము నీకొఱకు వేచియున్నదట. నీవుత్వరగా నలంకారాదికము నిర్వర్తించుకొని పోవలయునని. వసంతసేనకుఁ బ్రాణము లేచి వచ్చెను. తప్పకుండ నతఁడే పంపియుండును. "చేటీ! ఆర్య చారుదత్తుఁడు నాకొఱకుఁబంపినాఁడా?" "అదికాదమ్మా! ఆబండితోఁగూడ నతఁడు పదివేల దీనారములు పంపినాఁడట."

వసం:— ఎవరాతఁడు?

చేటి:— ఆతఁడే రాజశ్యాలుఁడు సంస్థానకుఁడు.

వసం:— ఛీ! ఛీ! నీవిచ్చటనుండిపొమ్ము. మఱలనీమాటలునాయొద్ద నెప్పుడు చెప్పకుము.

వసంతసేన కన్నులనుండి నిప్పులుగుఱిసెను. ఆమెముఖము జేవురించెను. కటములదరెను.

చే:— అమ్మా! అమ్మా! నాపై కోపగింపకుము. నేను మాట తెచ్చితినంతే.

వ:— నాకామాటపైననే కోపము.

ఆమె సంబాళించుకొనెను. చేటి బెదరుచు నడిగెను. "మఱి అమ్మగారి కేమని విన్నవించెదను?"

ఇట్లని విన్నవించుము. "అమ్మకు నేను బ్రతుకవలయునని యున్నచో మఱల నిట్టియాజ్ఞలుపంపవద్ద"ని. చేటి యచట నుండి వెడలిపోయెను. వసంతసేనకీప్రసంగము మిక్కిలి కలవరము గలిగించెను. "ఆ సంస్థానకుఁడే నే రాజశ్యాలుఁడు శకారుఁడు. వాఁడు పట్టి పశువు. వానికీ రాష్ట్రియోద్యోగమునుఁ గలిగించి దురధికారమదమునకుఁదోడు ధనమదమునుఁగూడఁ గలిగించిన యాపాలక రాజెట్టివాఁడో? వాఁడు నాటితో నూరకుండునను కొంటిని. నేటికైన నూరకుండునట్లు లేదు. ఈ క్రూరమృగము నాకు చారుదత్తునిపైఁగల ప్రేమ పసిపట్టెను. ఈదుర్మార్గుఁడా సాధువతంసునేమిచేయునో? వినిబారినుండి తప్పించుకొని గట్టెక్కినప్పటిమాట." ఆమె చిత్రఫలకమువంకఁజూచెను. ఆమెమనస్సులో సంస్థానకుని వికారరూపమూడుచుండెను. ఆమె కన్నులకెదుటగా చారుదత్తుని సౌమ్యసుందరరూపము గోచరించుచుండెను. చారుదత్తుని సౌందర్యమునందు శకారుఁడు మఱియు వికారముగాఁదోఁచు

చుండెను. వసంతసేన మిక్కిలి యసహ్యించుకొనెను. ఆమె మనస్సునుండి శకారుని తొలఁగించుకొనవలయునని రెండు మూడుసార్లు ప్రయత్నించెను. వాఁడు పట్టిపిశాచము. వదలు నట్లు లేదు. ఆపిశాచము మిడిగ్రుడ్లుత్రిప్పును. మిట్టపళ్లతో వెక్కిరించును. వసంతసేనకు వానియందు మిక్కిలి కోపముగలి గెను. 'నాకు వీఁడెక్కడదాపురించెనురా? శనిగ్రహాము? ఆమె మిక్కిలిచీదరించుకొనెను. ఆమె శకారుని మనస్సులో నెన్ని యో తిట్టిపోసెను. "ఛీ! ఈపశువు మనస్సులోనికివచ్చినాఁడు. ఇట్టిమనస్సుతో చారుదత్తునిరూపము సేవింపరాదు." ఆమె కన్నులకెదుటుగా చారుదత్తునిరూపమునుఁ జూడలేకపోయెను. "మదనికా! మదనికా! నా మనసేమియు బాగుండలేదు. అంత మధురమైన ప్రసంగమిట్లంతమైనది. ఆర్యచారుదత్తుని ప్రతి రూపము భద్రముగాఁగొనిపోయి చిత్రరువులగదిలోనిడి త్వరగా రమ్మ"ని యామెమదనికనుఁబంపెను. మదనిక చారుదత్తునిపట ముపై ముసుగువైచి చంకనిడికొని యచటనుండిపోయెను.

౨

శర్విలకుఁడు చారుదత్తుని యింటినుండి బయటపడి త్వర త్వరగా మార్గమువెంట నేగఁజొచ్చెను. అతఁడు కొలఁది నిము సములలో రెండుమూఁడు వీథులుదాఁటి యొకసన్నని సందు లోని కేగెను. అతఁడచ్చటనిలిచి కొలఁదికాల మాలోచిం చెను. అప్పటికింకను జాముచాత్రి మిగిలియున్నది. తాన్నా

...రాత్రి వేళ వసంతసేన గృహమునకెట్లు పోగలడు! ఆవసంతసేన యిల్లొకపెద్దకోట. ఏడుకక్ష్యాంతరములు గడువవలయును. లోపలిసౌధమునందుగాని తనకు మదనికా దర్శనముగాదు. ఈ యేడు కక్ష్యాంతరములు గడచులోపల నెవండైన మేల్కొనవచ్చును. కొంపతీసియట్లు జరిగెనేనికార్యము చెడిపోవును.

అతనిదృష్టి చేతిలోనున్న సువర్ణభాండముపైఁ బడెను. ఇంకను దానినట్లే యతఁడు చేతిలోఁబట్టుకొని యుండెను. అతఁడు కుచ్చులచెంగూడఁదీసి దాని నందు మడచికట్టి బొడ్డునదోపికొని మఱల నడువఁజొచ్చెను. ఈ యలంకారమంత పెద్ద విలువైనదిగాదు. వసంతసేన యొప్పుకొన్నను నా ముండ యున్న దే దాసితల్లి యది వట్టి హిరణ్యాక్షి. ఈసువర్ణభాండము దానికన్న దూరముననిలోఁచదు. ఇంకను జాముర్రాత్రి మిగిలి యున్నది. చేసినపాపమెట్లో చేసితిని. ఒకటిచేసిన నొకటి రెండు చేసిన నాటియొకటియా! ఇంకను నొకటిరెండు ప్రయత్నింతును. అతఁడొక వీధిమలుపుతిరిగెను. ఆ వీధిమలుపుదాఁటగనే యొక యిల్లు. ఆయిల్లంత పెద్దదిగాదు. శర్విలకుఁడు ప్రహరీగోడదాఁటి లోనఁ బ్రవేశించెను. అతఁడు చతుశ్శాలను సమీపించెను. గవాక్షములోననుండి యగరువాసలు వీచెంచు చుండెను. శర్విలకుఁడు గవాక్షమునొద్దకేగి పాదములపై నిక్కి మెడసాచి లోనికిఁ జూచెను. అదిశర్యాగృహము. యువకదపంతులు తల్పమునబరుండి యుండిరి. వారు మేల్కొనియే యుండిరి. శర్విలకుఁడు సరిగాసిలఁబడెను. అతఁడొక నిట్టూర్పు పుచ్చి యచటనుండి వెనుకకుఁ దిరిగి మఱల రాజమార్గమును

బ్రవేశించెదు. "ఇంకనేటికింతే." అతఁడు త్రోవవెంటనడచు చుండెను. అతని సమీపముననే యెవరో నడచుచున్న సవ్వడి. శర్విలకుఁడదిరిపడెను. అతఁడావంకకు తేరిచూచెను. ఎవఁడో పురుషుఁడు సమీపించుచుండెను. వీఁడెవఁడైన నగరరక్షకుఁడేమో! ఇప్పుడు పరుగెత్తుట యంతమంచిపనిగాదు. శర్విలకుఁడటునిటుఁ జూచెను. దగ్గఱలో ప్రఘాణమొకటి గన్పించెను. శర్విలకుఁడు పామువోలె నేలపైఁ బ్రాకుచు నచటికేగి యొక స్తంభముప్రక్క చేతులుజోడించి వెనుదిరిగి యానుకొని నిలుచుండెను. ఆ పురుషుఁడాప్రక్కనుండియే పోయెను. శర్విలకుఁడు రెండుమూడు క్షణములట్లే నిలఁబడి కదలకుండగనే తల త్రిప్పి యటునిటుఁ జూచి మఱల రాజమార్గమునుఁ బ్రవేశించి త్వరగా నేగసాగెను. రాజమార్గమునఁ జీకటిక్రమక్రమముగాఁ బలుచఁ బడఁదొడంగెను. తూర్పుదిశనుండి యెఱ్ఱని రేకలు దూరమునుండి పరుగెత్తివచ్చుచున్న సూర్యదేవుని గుఱ్ఱముల కాలిగిట్టలరేగిన యుదయపర్వతశృంగాటకరేణుపటమువలె నాకసమందు వ్యాపింపఁజొచ్చెను. వరదలెత్తిన యమునానది ప్రవాహముతీసినట్లు చీకట్లు పశ్చిమదిశకు నొత్తిగిలు చుండెను. శర్విలకుఁడాకసమువంకఁజూచెను. అతని పాదములు తొందరించెను. దూరమునుండి యొకపురుషుఁడతనివంకఁ జూచెను. ఒకఁడతనివెనుక తొందరగా వచ్చుచుండెను. ఒకఁడు త్రోవలో నిలచి యతనివంక తీక్ష్ణముగాఁజూచెను. శర్విలకునకిట్లు తెల్లవారెను. అతఁడు వసంతసేన యింటివద్దకువచ్చుసరికి బాగుగా వెలుఁగువచ్చెను. అతఁడు కక్ష్యాంతరములుగడచి యంతస్సౌధమునుఁ బ్రవేశించిలోనికేగి యొకస్తంభముచాటున నిలచియాళ్

కించుచుండెను. సమీపమున మదనికమాట లతనికి వినిపించెను. మదనిక తనవైపునకే వచ్చుచుండెను. ఆమె శర్విలకుని ప్రక్కగా నేగుచుండెను. శర్విలకుఁడు వెనుకనుండి యామె కన్నులు మూసెను. మదనిక వానిచేతుల పట్టు విడిపించుకొని వెను దిరిగి చూచెను. శర్విలకుఁడు. ఆశ్చర్యము! ఇదేమిటి ? నీవిపు డెక్కడనుండి వచ్చితివి ?

శర్వి:— చెప్పెదనులే !

శర్విలకుఁడామెను కౌగలించుకొనెను.

మద:— ఓయీ ! నీకు వేళా వేళలు తెలియవు. నీవెప్పుడునింతే.

శర్వి:— మదనికా ! ఇది నేటివఱకే. రేపటినుండి వేరు. అంతయు నీయిష్టమే యిష్టము.

మద:— అట్లందువేమి? రేపటినుండి విశేషమేమున్నది?

శర్వి:— చెప్పెదనులే! తొందరపడెదవేల?

శర్విలకుఁడటునిటు కనుఁగొనెను. పైకి క్రిందికిఁజూచెను. ఏదియో చెప్పవచ్చి నాలుకకొఱుకుకొనెను.

మ:— శర్విలకా! ఇదియేమిటి యంతకలవరపడెదవేల?

వసంతసేన లోపల మదనికకై వేచియుండెను. మదనిక యింతయాలస్యమేలచేయుచున్నదో? ఇంకనురాదేమి? ఆమె గవాక్షమునుండి యించుకవంగి ప్రక్కకుఁజూచెను మదనికా శర్విలకులేదియో సంభాషించుచుండిరి. ఆమెకు వారు సమీపముననేయుండిరి. మెల్లగామాట్లాడుచుండిరి. కొంచెము జాగ్రత్తగావిన్నచో వారిసంభాషణ నామెవినవచ్చును. ఆమె వారు

న్న దిశకుఁ గొంచెము జరిగి కిటికీతెక్క-చాటుచేసికొని చెవులు రిక్కించి యాలకించుచుండెను.

శర్వి:— మదనికా! అది చాలరహస్యము. ఇక్కడ నెవ రైన వినెదరేమోయని శంకించితిని. అంతే.

మద:— ఇక్కడ కింకొకరువచ్చుటకు వీలులేదు.

వసంతసేన యారహస్యమువినుటకు సందేహించెను. ఇంతలో 'వసంతసేన' యన్నమాట యామెచెవులఁబడెను. ఇది యేదో తనకుసంబంధించిన రహస్యమే. ఆమె మఱికొంచెము వారి దెసకుఁ జరిగెను.

శర్వి:— మదనికా! వసంతసేన డబ్బుపుచ్చుకొని వదలి పెట్టునా?

మద:— ఆమెకు నేనిదివఱకే విన్నవించితిని. ఆమెకు స్వాతంత్ర్యమున్నచో ధనముతీసుకొనకుండగనే పరిజనమందఱిని వదలిపెట్టను. అయినను నీకామాత్రము ధనమెక్కడిది?

శర్వి:— ఓసి! మదనికా! నేనుదరిద్రుఁడ నేయనుకొమ్ము. సాహసమున లక్ష్మిసమకూడును.

మ:— ఏమిటీ? సాహసమా? కొంపతీసి యేదైన పాపముచేయలేదుగదా?

శ:— మదనికా! నేనుక్రూరుఁడనుగాను. వట్టిసాహసిని. అంతే. క్రూరుఁడనగుటకు పూచినతీఁగనురాల్చినట్లు స్త్రీల యాభరణములుదోచుకొంటినా? యజ్ఞముకొఱకు కూడఁబె ట్టిన బ్రాహ్మణద్రవ్యమపహరించితినా? తల్లియొడిలోనుండి పిల్ల నపహరించియమ్ముకొంటినా? దొంగతనమేయైనను దానిలోఁ గూడ నీతియున్నది. ఇదిగో వసంతసేనకుఁ జెప్పుము. "సరిగా

నీయాభరణము నీకుఁ గొలిచిచేసినట్లున్నది. నామీఁది(పేమకు చిహ్నముగా నిదియెవ్వరికిఁదెలియకుండ ధరించుచుండు"మని యామెకిమ్ము.

మ:— ఎవరికిఁదెలియకుండ ధరించుటయా? నీమాటలలో పొసగుదల కన్పించుటలేదు. ఎక్కడిదీయలంకారము?

శర్విలకుఁడు కుచ్చెలచెంగునుండి యలంకారము నూడదీసి మదనికకిచ్చెను. మదనిక దాని నటునిటు (దిప్పిచూచి "యోయీ! ఇది యిదివఱకుఁ జూచినట్లున్నది. దీని నెక్కడనుండి తెచ్చితివి"?

శ:— అదియంతయు నీకెందుకు? తీసికొనిపోయి యామెకిమ్ము.

మదనికకామాటలకుఁగోపమువచ్చెను. నీకు నామీఁద నమ్మకము లేదు. మఱినన్ను నీవు కొనుటగూడ నెందుకులే? యని యామె రోషముతో బల్కెను.

శ:— నమ్మకములేకపోవుటగాదు. తరువాతఁజెప్పవచ్చునులే యని యట్లంటిని. తెల్లవారినతరువాత విన్నాను. చారుదత్తుఁడను సార్థవాహుని యింటిలో దొంగలుపడినారని.

మదనికావసంతసేనల చెవుల కామాటలు శూలముల వలెదాకెను. వారిహృదయములు కంపించెను. కొంపదీసి వీఁడెవరినైన నచటఁజంపలేదుగద?

శ:— అట్లు కలవరపడెదవేమి?

మ:— ఓయీ! ఆయింటిలో నెవరినైన చంపితివా?

శ:— అదియా నీభయము ? నిద్రపోవువారిని, భయపడ్డవారిని శర్విలకుండు గొట్టడు. నేనచ్చట నొక్కనిని ముట్టకో నైన లేదు.

మ:— నిజముగా ?

శ:— నిజముగా ?

వసంతసేనామదనికలా మాటలకుం గొంచెము తెప్పరిలిరి.

అమ్మయ్యా ! బ్రతికితిమి.

ఆమెముఖమున సంతోషచిహ్నములు గానవచ్చెను. శర్విలకుండామెను గాంచి యనుమానపడెను. "ఆయింటిలో నెవండేమైనను దీనికెందుకు ? చారుదత్తునకు దీనికి నేమిసంబంధము ! ఈ భోగముజాతియింతే. ఇదినట్టి పాపపుజాతి. బయటకెంతయో ప్రేమలుపొగవేసి, కామమును మండింపజేయును. ఆ పొగకు కన్నులు గప్పవడి పురుషులు తమ యౌవనములు ధనములా మంటలో హోమముచేయుదురు. అసలీ యాడజాతినే నమ్మరాదు. శ్రీ, స్త్రీ యివిరెండుగూడ ఆడత్రాచువలె నందముగాం బ్రాకుచువచ్చి మెడకుచుట్టవేసి ముఖముపైం గాటువేయును. ఆ కాటుకొన్నవాని కావిషము స్థూలశరీరమందే గాక సూక్ష్మశరీరమందును వ్యాపించి నూరుజన్మములెత్తినను వదలిపెట్టదు. వీరువేయుటక్కరివేసముల కంతుపంతునుండదు. అంతలో నవ్వుదురు అంతలోనేడ్తురు. అరచేతిలో వైకుంఠము చూపించి దీనికిసర్వాధికారము నీదేయని పురుషునినమ్మింతురు. మఱలవానిని నమ్మునది లేదు. ఇది వానివద్ద ధనమున్నంతవరకే. ఆయున్నధనము సర్వము సర్వము అరతికప్పురమువలె హారించినతరువాత వారికాళ్ళకుం బారాణిపెట్టుకొనుట కుపయోగిం

చిన దూదివ త్తికంటె హీనముగా దూరమునకుఁ ద్రోసివైతురు. అబ్బ! యింతచపలజాతి యిదియేగాని లోకములో మఱియొకటి లేదు. మనసులో నొకనిఁ బెట్టుకొని కళ్ళతో నొకనినిఁ బిలుతురు. ఒకనినోఁ దియ్యగామాట్లాడి యొకనిని మొత్తగాఁ గౌఁగిలించెదరు. వాఁడెవఁడో చెప్పినట్లుగా పర్వతాగ్రమునఁ దామర తీఁగపుట్టినట్లు గాడిద గుఱ్ఱపుబరువు మోయునట్లు, బోగము వాండ్రలోఁ బతివ్రతలుండరు. ఆ చేనూడ్చునప్పుడే యుండవలయునుగాని కోయునప్పుడేడ్చి యేమిప్రయోజనము? కుసుమయూడ్చి యాట్రగడము పండుమన్నట్లుండును. అందుకని కులశీలములుగలవాఁడు ఈబోగమువాండ్రుండిరే వీరిని శ్మశానపుష్పమువలె వదలిపెట్టవలయును.” శర్విలకుఁడింతసేపాలోచించి తలయెత్తి “ఛీ! నీమొగముచూడరాద”ని యచటనుండి పోవుదొడఁగెను. మదనిక వానియుత్తరీయమునుఁ బట్టుకొనిలాగి “ఓయీ! అంతకోపమెందులకు? నీవేమందువో చూతమని యింతదాకనుండి యూరకుంటిని. నీసంగతినాకుఁ దెలియును. నీవెప్పుడునింతే” యనెను.

శ:— ఏమి యెప్పుడునింతే? నేనెంతకసిపింతునో యంతే.

మ:— ఓయీ! పిచ్చివాఁడ! ఈయలంకారము వసంతసేనది.

శ:— అయిననేమి?

మ:— వసంతసేన యిది యార్యచారుదత్తునివద్దనుంచినది.

శ:— ఎందుకు?

మ:— నీవువట్టి ఛాందసుఁడవు. నీకన్నియుఁ జెప్పవలెను.

శర్విలకుఁడు సంగతి గ్రహించెను. తానువట్టి దుఃఖి ప్రాయుపడెను. 'అయ్యో! నేనెంతపాపమాచరించితిని! ఎండ యని చెట్టుక్రిందఁజేరి చల్లఁబడినతరుహాత నాచెట్టుకొమ్మలే నరికితిని. ఇది వసంతసేనకే యుపకారముగునని యూహించి యైననుండలేదు.' అతఁడు మదనికనుఁజూచి "యిప్పుడేమిచేయ వలయు" ననెను.

మః— నీవేయాలోచింపుము.

శః— పురుషుఁడూరకే సిద్ధాంతముగా నాలోచించును. ఆచరణకడకువచ్చుసరికి స్త్రీలేపండితులు.

మః— శర్విలకా! నామాటయందు నీకు గురియున్న చో నిదితీసికొనిపోయి మఱల చారుదత్తునకిమ్ము.

శః— మదనికా! అతఁడు నాపైనభియోగముదెచ్చు నేమో?

మః— ఓయీ! జాబిలి యెండకాయునా?

శః— ఎండ నే కాయుననుకొమ్ము. నేనందుకుజడియుట లేదు. మావంటితెగించినవారిని రాజుమాత్ర మేమిచేయును? నేసతనివద్దకువెళ్లుటకు లజ్జించుచుంటినంతే.

మదనిక యింకనాలోచించెను.

మః— అవును నీవు చెప్పినదినిజమే. అంతకంటె నీవా యలంకారమును వసంతసేనవద్దకుఁ దీసికొనిపోయి చారుద త్తుఁడుపంపెనని చెప్పియిమ్ము. అట్లయినఁ జాలబాగుండును.

శః— దానివల్ల లాభమేమున్నది?

మ:- అప్పుడునీవుదొంగవుగావు. చారుదత్తుఁడు ఋణా మునుండి విముక్తుఁడగును. వసంతసేన యలంకారము వసంత సేనకువచ్చును.

శ:- అట్లుచేసిన నతిసాహసముగాదా?

మ:- అట్లుచేయకపోయినచో నతిసాహసము.

శ:- ఓసీ! మదనికా! యీచీఁకటిలో దివ్వెనుఁబట్టు కొంటివి. నీవుచూపినమార్గము వెంటనే వచ్చెదనుపద.

మ:- అయితేయిదిగో! యీ కామదేవాయతనములోఁ గొంచెముసేపుండుము. వసంతసేనకు నీసంగతి చెప్పెదను.

మదనిక యచటనుండి వసంతసేనవద్దకువచ్చెను. వసంత సేన యీ సంభాషణమంతయువినెను. ఆమె విన్నంతసేపు మద నికనెంతో మెచ్చుకొనెను. ఔరా! ఈమదనిక శార్విలకు నియందెంతప్రేమ! తన యందెంతభక్తి! పాపమాశర్విలకుఁడు వట్టిపిచ్చివాఁడు. సాహసియన్నమాట గాని యెంతపేదగుండె వాఁడు? అంతలో సముద్రపుపొంగు. అంతలో వట్టియెడారి. వసంతసేన తలయెత్తిచూచుసరికి మదనిక గదిలోఁ బ్రవేశించెను.

వ:- మదనికా! నీవుచాల యాలస్యముచేసితివి.

మ:- అవ్వనుచేసితిని. చారుదత్తుఁడు పంపించెనట యెవరో బ్రాహ్మణుఁడు వచ్చియుండెను. దర్శనముగోరుచు నాఁడు.

వ:- అయితే తప్పకుండ రమ్మనుము.

మదనిక బయటకుఁబోయి శర్విలకునిఁదెచ్చెను. వసంత సేన లేచి శర్విలకునకు నమస్కరించి కూర్చుండుమనెను. శర్వి లకుఁడామెను దీవించుచు నిలుచుండియే చారుదత్తుఁడు నీకో

నిట్లు చెప్పుచున్నాడు. "మాయిల్లంతగా గట్టిదిగాదు. ఈసు వర్ణభాండము రక్షించుట కష్టముగానున్నది. కాబట్టి మీరాది మీరు దీసికొనుటమంచి"దని. శర్విలకుడు సువర్ణభాండమును మదనిక చేతికిచ్చి యిచటనుండి త్వరగా బయలుదేరెను. ఆమా టలనుచున్నంతసేపును వానిముఖము వెలవెలఁ బోవుచుండెను. వసంతసేన వానిని వెనుకకుఁబిలిచి "అయ్యా! నేను రెండు మాటలుచెప్పెదను. అవికూడ చారుదత్తునితోఁ జెప్పు"మనెను. శర్విలకుఁ డచటికెవడుపోవునని లోన ననుకొని హూనముగా నామెవంకఁజూచెను.

వ:— ఇదిగో! యీమదనికను నీవు పరిగ్రహింపుము.

శ:— నీవుచెప్పినది నాకేమియుఁదెలియుటలేదు.

శర్విలకుఁడు వెలవెలఁబోయెను. అతఁడచ్చెరువుగా మదనికవంకఁ జూచెను.

వ:— ఏమయ్యా! అంతబిత్తరపడెదవు? ఈయలంకారము తెచ్చి యిచ్చినవారికి మదనికనిమ్మని యాచారుదత్తుఁడు నాకుఁ జెప్పెను. కాఁబట్టి యీమదనికను నీకిచ్చినది యాచారు దత్తుఁడే.

శర్విలకుఁడు దాను పట్టుబడితినని తలంచెను. ఇట్లు జరుగునని యతఁడు కలనైనఁ దలంచియుండలేదు. ఈమదనిక వసంతసేన కిదియంతయుఁ జెప్పినదా? అతఁడు సంబాళించు కొని వసంతసేనతో నిట్లనెను. "అవునమ్మా! ఆచారుదత్తుఁ డట్టివాఁడే. ఆయనకున్న వేయిగుణములలో నీ సెప్పినయుప కారముసేత యొకటి. ఆయన దరిద్రుఁడైననేమి? మహాగుణ

వంతుఁడు. ఈగుణ ప్రకర్షచూచియే పరమేశ్వరుఁడా చంద్రునిఁ దలపై నిడుకొనెను.

వసంతసేన చేటినిఁబిలచి బండిని సిద్ధముసేయింపుమని యాజ్ఞాపించెను. చేటి బండిని సిద్ధముచేసి తెచ్చెను. వసంతసేన మదనికాశర్విలకులను బండివద్దకుఁ దీసికొనిపోయెను.

వ:— మదనికా ! నాకుఁబేరు తెమ్ము. నిన్నొకరిచేతిలోఁ బెట్టితిని, బండియెక్కుము. నన్ను మఱచిపోయెదవేమోసుమా!

మదనికకు దుఃఖమాగలేదు. ఆమె యేడ్చుచు "నీవు నన్ను వదలిపెట్టితివి" అనియామె పాదములపైఁబడెను.

"ఇప్పుడు నీవేనాకు వందనీయురాలవు. మనజాతికి దుర్లభమైన వధూత్వము నీకు సిద్ధించినది" అని వసంతసేన యామెనుదుటఁ దిలకమిడి తలపై మేలిముసుఁగువైచి బండి యెక్కించెను. బండి కనుచూపుమేర దాఁటిపోవువఱకు గడపలోనిల్చి వసంతసేనయు, బండిలోనుండి మదనికయు నన్యోన్యమాప్యాయముగాఁ జూచుకొనుచునేయుండిరి. బండి మలుపు తిరిగెను. దూరమునుండి యేదియో చాటింపువలె వినవచ్చెను. తరువాత నాదెస నేదియో కలవరయు వినిపించెను. శర్విలకుఁడు బండినుండి బయటకుఁజూచెను. రాజమార్గమునందు రక్షకభటుల సంచలనము గానవచ్చెను. జనులు వేగముతో నాదెస పోవుచుండిరి. క్రమముగా నచటివాతావరణ ముద్రిక్తమయ్యెను. ఈ సారి చాటింపు దగ్గరగా వినవచ్చెను. "ఆర్యకుఁడన్న గొల్లపిల్లవాఁడు పట్టుబడెను. అతనిని గారాగారమందు బంధించిరి. కాబట్టి రక్షకభటులు జాగ్రతపడవలెను. వారివారి స్థానములు జాగ్రతగా రక్షించుకొనవలెను. ప్రజలీవిషయమున

నెట్టియుద్రేకమునకును లోనుగా రాజస రాష్ట్రియుఁడు హెచ్చరించుచున్నాఁడని యీచాటింపు సారాంశము. శర్విలకుఁడా చాటింపువినెను. అతఁడదరిపడెను. ఆర్యకుఁడతనికి మిక్కిలి స్నేహితుఁడు. అతఁడు బంధితుఁడైయుండగాఁ దానెట్లుచూచుచు నూరకుండును! శర్విలకుఁడు బండినుండి క్రిందికిదుమికెను. అతఁడు బండివానినిఁజూచి "ఓయీ! రేభిలుఁడన్న గాయకుని యిల్లెఱుఁగుదువా?

బం:— ఆయన నెఱుగకేమి! మాయమ్మగారికిసంగీతము చెప్పినదాయనయే.

శ:— ఈబండి నక్కడకుఁదోలుకొనిపోయి 'శర్విలకుఁడీమెను మీయింటిలోదిగఁబెట్టుమన్నాఁడ'ని చెప్పుము.

బండివాఁడు బండినిఁదోలుకొనిపోయెను. శర్విలకుఁడు కారాగారమువంక చఱచఱనడచిపోయెను.

# రత్నావళి

## ౧

మైత్రేయుఁడు వసంతసేన యింటికి బయలుదేరెను. అతఁడు రాజమార్గమువెంట మెల్లగా నడచుచుండెను. అతఁడు నడచినంతసే పతని కాళ్లు వెనుకకే లాగుచుండెను. వసంతసేన యింటికిఁ బోవుట కతని కేమియు నిష్టములేదు.

ఇష్టము లేకపోయినను దాను పోవలసియే వచ్చెను. చారుదత్తుని పద్ధతి యతని కేమియు బాగుండలేదు. అప్పటికిని తానతనికిని జెప్పిచూచెను. చారుదత్తుని పక్షమునఁ దాను వాదింపఁగలఁడు. బల్లగుద్ది మరీ వాదింపఁ గలఁడు. ఎవరిది యాయలంకారము? ఎవరి కిచ్చిరి? ఎప్పు డిచ్చిరి? ఎందుల కిచ్చిరి? సాక్ష్యమెవరు? సవాలక్ష గ్రంథమున్నది. చారుదత్తుఁ డొప్పుకొనలేదు గాని తాను వాదించుచుండగా నావాదమునుఁ గాదను ధైర్య మెవరి కున్నది? తా నింత తెలివిగా సలహా చెప్పినప్పటికిని నాచారుదత్తునికిఁ దాను పట్టి మూర్ఖుఁడు. అపండితుఁడు చెప్పినదియేమి? ఇట్లుండును. ఆచెప్పినది వినకపోగా నాసువర్ణభాండ మున్నదే యది యెంత? దాని యాయువెంత? దానికి బదులు చతుస్సముద్ర సారభూతమైన యీరత్నావళిని నాబోగము దాని కీయవలయునఁట. దాని కేమి కష్టము? చక్కఁగా సరఁటికొప్పల వలె రెండుచేతులు చాచి దోసిలి పట్టి పుచ్చుకొని తిరుగుడు పూవువలె మొగము విప్పార్చి మెడలో నలంకరించు కొనును. మైత్రేయుఁడు రత్నావళినిఁ జేంగునుండి యీవఁదీసి మొగమునకు నుత్తరీయ మడ్డ మిడుకొని రత్నావళినిఁ జూచెను. రత్నావళిపై నేటవాలుగాఁ బడుచున్న సూర్యకిరణములు ప్రతిఫలించి మైత్రేయుని కన్నులు మిఱుమిట్లు గొల్పెను. మైత్రేయుఁడు గన్నులు నులుముకొని యుత్తరీయముతోఁ దుడుచుకొనెను. ఈరత్నావళినిఁ దానే యలంకరించుకొనిన నెంత బాగుండును? అతఁ డారత్నావళిని మెడలో వైచికొనెను. త్రోవవెంట నడచువారు తా నలంకరించుకొనిన వారి సొమ్మేమిపోయినది? అట్లువిరుగఁబడి

చూచుచుఁ బగలబడి నవ్వెదను. అయినను నల్లు గడిగిన ముసలి దున్న మెడలో మల్లెపూల మాల వేసికొనినట్లు నాకీ యలంకరణ మెందులకు?" అని మైత్రేయుఁ డుత్తరీయమును విప్పి కప్పుకొనెను. వసంతసేన యేమాత్రమైన నసంగీకారము సూపెనేని నెంత బాగుండును! తాను మాటకోసమైనను రెండవమాట యనకుండ నామెకు నూరుదీవనలిచ్చి భద్రముగా రత్నావళినిఁ దీసికొని యింటికిఁ దిరిగివచ్చెను. వసంతసేన యట్లెందుకనును? తా ననుకొనెనేగాని యట్లెప్పటికినిఁ జరుగదు. మైత్రేయుఁడు దానే వసంతసేనయింటికి వచ్చితినని గ్రహించెను. అతఁడు మొగమెత్తిచూచెను. బహిఃప్రకోష్ఠమందుఁ జేటి యొకతె నిలచియుండి మైత్రేయునకుఁ జిఱునగవుతో స్వాగతముచెప్పెను. చేటి యతనినక్కడ కొంచెము కాలము నిలువుమనిచెప్పి లోనికేగి వసంతసేనతో నతనిరాక నివేదించెను. వసంతసేనకు మైత్రేయుని యాగమనము మిక్కిలి సంతసముచేకూర్చెను. ఆమె చేటితో "నతనిని తప్పకుండఁ బ్రవేశపెట్టుము. బంధులునితోసహా నీవుకూడ నాతని వెంట నుండి సమర్యాదముగాఁ బ్రవేశపెట్టు"మని చెప్పెను.

మైత్రేయుఁ డట్టి మర్యాదతో లోనఁ బ్రవేశించెను. అతఁడు సింహద్వారము వద్దకువచ్చెను. అతనికన్నులు మిఱుమిట్లుగొల్పెను. ఆద్వార మంతయు బంగారుతోఁ బూయఁబడి యుండెను. ద్వార ప్రాంగణమంతయుఁ జిత్రముగ రంగవల్లికలచే నలంకరింపఁబడి కమ్మనివాసనలుచిమ్ము పూలు చిమ్మబడి యుండెను. ద్వారముకిరుప్రక్కల నైరావణ శుండస్థూలములగు మల్లికా దామములు వ్రేలుచుండెను. క్రిందినుండి గజ

మెత్తు మరకతపు ఱాలతోఁ గట్టింపబడిన స్తంభములనుండి రెండు ప్రక్కల తెల్లని యేనుగుదంతము లాద్వారమున కిరుప్రక్కల తోరణములవలెనుండెను. తోరణ స్తంభ వేదికలయం దిరుప్రక్కల స్ఫటిక కలశములయం దమర్పఁబడిన మామిచివుళ్లు గాలికూగుచు ప్రేక్షకులనుఁ బిలుచుచున్నట్లుండెను. ఆద్వారమునకు బంగారుతలుపు లమర్పబడియుండెను. ఆతలుపులకు వజ్రపుగుబ్బలు. అతఁడు ద్వారముదాఁటి ప్రథమ ప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. ఆప్రకోష్ఠమునందు వెన్నెలలుచిమ్ముచున్న తెల్లనిమేడలవరుసలు. ఆమేడలకు స్ఫటిక గవాక్షములు. ఆగవాక్షములకు ముత్తెపుజాలరలు. అచట దౌవారికుఁడొక్కఁడు గూర్చుండి నిద్రవోవుచుండెను. పెరుగులో రాజనాల యన్నము గలిపిపెట్టినను నదితీయగాలేదని కాబోలు కాకులుముట్టుకొనుట లేదు. మైత్రేయుఁడు ద్వితీయ ప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. అచట బండియెద్లు గట్టివేయఁబడియుండెను. పాళెగాండ్రు చుక్కాకుకట్టలను వానికిమేపుచుండిరి. కొందరాయెడ్లకొమ్ములకు నూనె పూయుచుండిరి. ఒకప్రక్క దున్నపోతొకటి కట్టివేయఁబడియుండి తనదగ్గరకెవ్వరురాలేదను కోపమునఁగాబోలు నిట్టూర్చుచుండెను. ఒకప్రక్క పొట్టేలునకొకఁడు మెడ[illegible]ముచుండెను. ఒకచోటఁ గుఱ్ఱములకు జుట్టుకత్తిరించుచుండిరి. ఒకచోఁట కోఁతియొకటి కట్టివేయఁబడియుండెను. ఒకచో మావటివాఁడు నూనెనేయియునన్నములోఁగలిపి యేనుఁగునకు మేపుచుండెను. మైత్రేయుఁడు తృతీయ ప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. అచ్చట నందమైనకుర్చీలు వరుసలుదీర్చి యమర్పబడియుండెను. ఒకబల్లపైన వ్యాస పీఠమునందు విప్పినపుస్తక మొకఁడుండెను.

వివిధవర్ణ యుక్తములగు చిత్రఫలకములు చేతితోఁబట్టుకొని గణికలు వృద్ధవిటులు నటునిటు దిరుగుచుండిరి. మైత్రేయుఁడు చతుర్థ ప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. అచ్చటఁగొందరు యువతులు మద్దెలలు వాయించుచుండిరి. కొందరు తాళము వేయుచుండిరి. ఒకతె వేణువు నూదుచుండెను. ఒకతె వీణ మీటుచుండెను. కన్నెఱికముగాని గణికదారికలుకొందరు నృత్యము చేయుచు పూఁదేనెత్రాగిన తేటులవలెఁ బాడుచుండిరి. మైత్రేయుఁడు పంచమప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. అచ్చట గుమ్ముమని యింగువవాసనలు నాసాగోళతర్పణ మొనరించుచుండెను. వివిధములగు పిండివంటలవాసనలు మైత్రేయుని నోరూరఁజేసెను. కటికవాండ్ర కుఱ్ఱవాఁడొకఁడు గొఱ్ఱెమాంసమునుఁ గడుగుచుండెను. వంటవాఁడు వివిధములగు నాహారములను వండుచుండెను. ఉండ్రాళ్లు, లడ్డువములు, గారెలు, అప్పడములు, వరుసగాఁ బళ్లెములందుఁ బెట్టఁబడి వరుసగా నమర్పఁబడియుండెను. అచట వివిధాలంకార శోభితలగు గణికలు, బంధులులునుండిరి. మైత్రేయుఁడు షష్ఠ ప్రకోష్ఠమునఁ బ్రవేశించెను. అచట బంగారపుఁ దోరణములు వ్రేలుచుండెను. ఆతోరణములందు నీలరత్నములు తాపిరి. శిల్పిజనులు వైడూర్య, మౌక్తిక, ప్రవాళిక, పుష్యరాగేంద్రనీల, పద్మరాగ, మరకతప్రభృతులగు రత్నవిశేషములనుఁ బరీక్షించుచుండిరి. కొందరలంకారములయందు మాణిక్యములుదాపుచుండిరి. కొందరు బంగారునగలుచేయుచుండిరి. కొందరు ముత్తెములు గ్రుచ్చుచుండిరి. కొందరు వైడూర్యములకు రంధ్రములఁ బొడుచుచుండిరి. కొందరు పగడములను తరణ

పట్టుచుండిరి. ఆర్ద్రి కుంకుమ ప్రస్తరముల నెండఁబెట్టుచుండిరి. కస్తూరిని పఱచుచుండిరి. కొందరు చందనరసమునుఁ బిండు చుండిరి. కొందరు వివిధములగు సుగంధములను మేళవించు చుండిరి. కొందరు కర్పూరవిడెములు చుట్టుచుండిరి. కొందరు గణిక లోరచూపులు చూచుచుండిరి. కొందరు నవ్వుచుండిరి. మైత్రేయుఁడు సప్తమప్రకోష్ఠమునుఁ బ్రవేశించెను. అచ్చట గూళ్లయందుఁ పావురాళ్లు జంటలుగట్టికూర్చుండెను. పంజర ములందు చిలుకలు పెరుగన్నముదిని పొట్టలుబలిసిన బ్రాహ్మ ణులవలె సూక్తములు పలుకుచుండెను. కోకిలలు ప్రహృష్ట ములై కూయుచుండెను. పొట్టేళ్లు పోట్లాడుచుండెను. నెమిళ్లు ఆడుచుండెను. రాజహంసమిధునములు వెన్నెలకుప్పవోసినట్లు మెరయుచు యువతులకు మందగమనములు నేర్చుచుండెను. మైత్రేయుఁడష్టమ ప్రకోష్ఠమునఁబ్రవేశించెను. అచ్చటనొకఁడు పట్టుబట్టలుగట్టుకొని యొడలినిండ నలంకారపు బరువు మోయలేక మోయుచు నటునిటు దిరుగుచుండెను. మైత్రే యుఁడతఁడు వసంతసేన యన్నయనియూహించెను. వాఁడెంత తపస్సుచేసి వసంతసేనయన్నగాఁబుట్టెనో? అచట నొకతె బంగారుపూలచీరఁగట్టుకొని నూనెరాచినపాదములకు చెప్పులు దొడిగికొని యాసనముపైఁ గూర్చుండియుండెను. ఆమెకుఁ బెద్దపొట్టగలదు. ఆమెనుఁజూచుటతోడనే మైత్రేయుండు చేటిని యిట్లుప్రశ్నించెను.

మై:— లింగప్రతిష్ఠచేసి తరువాత గుడికట్టినట్లు ముందీ మెనుబెట్టి తరువాత నిల్లుగట్టిరా?

చే:— ఓరి! దుర్మార్గుడా! ఈమె మావసంతసేనతల్లి. ఈమెకు వాయురోగము.

మై:— చాలయుండమైనరోగము. ఓసి వాయురోగమా! నేను బ్రాహ్మణుఁడను నన్నుఁగూడ కొంచెము కనికరించితివా!

చే:— చచ్చిపోయెదవు.

మై:— ఇంతపొట్టతో బ్రతుకుటకంటెఁ జచ్చుటయే మేలు. ఈముండ కల్లు త్రావి త్రావి యింతపొట్ట పెంచు కొన్నది. ఇది చచ్చినా వేయినక్కలు సంతసించును. మీరు గూడ పడవలెక్కెదరా!

చే:— లేదు. లేదు.

మై:— మీకు వేరే యానపాత్రములెందుకులే! మదన సముద్రమునీదుటకు మీరే పడవలుగదా! సరే! బాగున్నది. ఈ వసంతసేన యిల్లుచూచి నేను చాలమెచ్చుకొన్నానని, తరు వాత నాకుఁగనిపించిన రాగిరేకుమీఁదఁ బ్రశంసాపత్రము వ్రాసి యిత్తునని నేను వెళ్ళినతరువాత నామెతోఁ జెప్పుము.

చే:— నీవువెళ్ళినతరువాత నెందులకు? నీవే చెప్పుము.

మై:— సరే! ఆమె యిప్పుడెక్కడనున్నది?

చే:— ఇదుగో యిక్కడనుద్యానవనములో.

మైత్రేయుఁడుద్యానవనమునుఁ బ్రవేశించెను. అందువరు సలుదీర్చియున్న పూలచెట్లు చక్కగా పూచియుండెను. అందందుఁ గూర్చుండుటకు వితర్దిక లమర్చఁబడియుండెను. మల్లెలు, మొల్లలు, మాలతి, జాతి, గోరంట మొదలైన పూలచెట్లందు విస్తారముగా పూచి సువాసనలు వెదజల్లు చుండెను. ఆయుద్యానవనమునకు మధ్యదేశమునఁనొక కొల

నుండెను. ఆకొలనులో నెఱ్ఱని కలువలు పూచి యాకాంతి ప్రక్కలకు వ్యాపించి సంజవేళయన్న భ్రాంతిగొల్పుచుండెను. దానియొద్దున నశోకవృక్షమొకటి యుండెను. ఆయశోక వృక్షముక్రింద వసంతసేన కూర్చుండియుండెను. మైత్రేయుఁడు పైకిఁజూచుచు "ఏది మావసంతసేన? ఇక్కడెక్కడను కనుపించ దేమి?"

చే:- ఓయీ! కన్నులు వంచిచూడుము. ఇదిగో! ఈ యశోకవృక్షముక్రింద వసంతసేన కూర్చున్నది.

మైత్రేయుఁడు వసంతసేననుఁ జూచెను. వసంతసేన మైత్రేయునిఁజూచెను. ఆమె వానినిఁజూచుటతోడనే యాసనమునుండి లేచి మైత్రేయా! రమ్ము రమ్ము! కూర్చుండుమని యాహ్వానించెను. మైత్రేయుఁడామెను దీవించుచు గూర్చుండెను.

వ:- మైత్రేయా! మీసార్థవాహపుత్రుఁడు కుశలమా?

మై:- ఆఁ నీదయవల్ల.

వ:- మైత్రేయా! నీవేదో పనిమీఁద వచ్చినట్లుంటివే?

మై:- నీవుచక్కనియూహాశాలినివి. మాచారుదత్తుఁడు చేతులొగ్గి నీతో నిట్లు విన్నవించుచున్నాఁడు.

వ:- విన్నవించుట యేమి? ఆజ్ఞాపించుచున్నాఁడనుము.

మై:- ఆయన విన్నవించుమనియే యన్నాఁడు. "ఆసువర్ణభాండమున్నదే యది తనదిగా భావించి జూదములో నోడిపోయినాఁడు.

వ:- జూదములోనే పోయినదిగద! అయినచో నేమి?

మై:— ఏమియు లేదు. అది జూదములోఁ బోయినది కాబట్టి దానికిబదులుగా నిదుగో చూచితివా యెంతగానున్నదో యీరత్నావళిని నీకీయమన్నాఁడు.

వసంతసేన యించుక యాలోచించెను. తానిప్పుడు సువర్ణభాండమునుఁ జూపించినచో నెట్లుండును! ఎట్లుండును? కథ యంతటితో నంతమగును. ఏమియుఁదెలియనట్లు రత్నావళిని దీసికొనుటయే యుచితమేమో!

మై:— ఏమి యీరత్నావళి నీకక్కర లేదా?

వసంతసేన నవ్వుచు చేటివంకఁజూచెను.

వ:— మైత్రేయా తీసికొనకుండ నెట్లుండును?

మై:— మఱి యాలోచించుచుంటివేమి? ఈ రత్నావళి చతుస్సముద్రసారభూతమైనది.

వ:— ఏమియు లేదు. పూలు రాలిపోయినను నీ తీయ మావిచెట్టునుండి తేనెబొట్లు పడుచున్నవేమో? యని యాలోచించుచుంటిని.

మై:— పూవులున్ననేమి లేకున్ననేమి? మనకుఁ గావలసినది తేనెయయినప్పుడు ఆ తేనె నేలమీఁదఁ బడకుండగనే చక్కగా దోసిలిపట్టి త్రాగవలయునుగాని యాలోచించుట వలన నేమి లాభము?

వ:— ఆ రత్నావళి నిటు తెమ్ము.

విదూషకుఁడు రత్నావళిని వసంతసేనకందించెను. వసంతసేన దానినిఁ దీసికొని మెడలో నలంకరించుకొనెను. ఆమె మెడపై మెఱుపులు ప్రాకెను.

వ:- మైత్రేయా ! మీరాజూదగానితో వసంతసేన నిన్ను జూచుటకు సాయంతనము వచ్చెదనన్నదని చెప్పుము.

మైత్రేయునకీమాటలువిని యొడలుమండుకొనిపోయెను. ఈ బోగముదాసి కీరత్నావళి చాలినట్లులేదు. మఱలనక్కడకు వచ్చునట. వచ్చియింకను నేమిపుచ్చుకొనును ? అతఁడిట్లనెను. "సరే! అట్లేచెప్పెదను."- అతఁడనుకొనెను "చెప్పవలయునట! చెప్పెదనులే. ఓయీ ! నాయనా ! ఇఁకచాలు. ఈ బోగము దానివ్యవహారము కట్టిపెట్టుమని." మైత్రేయుఁడు వసంతసేన నుండి సెలవుదీసికొనకయే యచటనుండి నిష్క్రమించెను. పోవుచున్న మైత్రేయుని వీనులకు వెనుకనుండి వసంతసేన సన్నని నవ్వు ప్రాకుచువచ్చి తగిలెను. మైత్రేయుఁడు వెనుకకుఁ దిరిగి యైననుఁ జూడలేదు. నవ్వునులే! నన్నేమి చేయును ?" అని యనుకొనుచు నతఁడు వెడలిపోయెను. వసంతసేన యచ్చట నుండిలేచెను. ఆమె మెడలోని రత్నావళినిఁ దీసి చేటికిచ్చెను. నేను చారుదత్తునితో నానందించుట కిపుడు వెళ్లవలయుననెను.

వసంతసేన వృక్షవాటికనుండి యింటికి బయలుదేరెను. ఆకసమునుండి ఘంద్రధ్వని యొండు ధీగధీగముగ ?నదించుచు వచ్చి వారికర్ణములకుఁ దగిలెను. చేటి తలయెత్తిచూచెను. "అమ్మా! చూడుచూడుము. ఆకసమంతయు నట్టహాసముగ నున్నది."

వసంతసేన యాకసము చక్కికి చూపు నిగిడించెను. అప్పుడే యాకసమునందంతటను కాఱు మొయిళ్ళు పలుచగా వ్యాపించుచుండెను. క్రమముగా నాకసమంతయు మూసికొని పోయెను. వసంతసేన మనసున నుత్కంఠితయయ్యెను. ఈమే

ఘము లాకసమునిండ ముసుఁగు వేసి చీఁకటిక్రమ్మి జోరుగా వాన కురియనిమ్ము. ఆమెహృదయము ప్రియాభిముఖమైనది. ఇవి యేవియు నామె నడ్డజాలవు.

చే:— అమ్మా! వర్షమువచ్చునట్లున్నది.

వ:— రానిమ్ము! రానిమ్ము! నేనిప్పుడు వర్షాభిసారిక నయ్యెదను.

సాయంసమయ మయ్యెను. దిక్కులేనిన యేనుగుపిల్ల లాకసముఁ బ్రాకుచు మంద్రమధురముగా గీపెట్టినట్లు నల్లని చిఱుమబ్బులు ధీరముగా గర్జించుచు దిగంతములనుండి యాకాశముపై కెక్కుచు నుజ్జయినీపట్టణమును ముట్టడించెను. ఎక్కడఁజూచినను మబ్బులు. నల్లనిచిఱుమబ్బులు. ఒకమబ్బు మేడలపైనుండి తనయందమంతయుఁ జేకన్నులతోఁ ద్రావు పౌరవిలాసినులపై విల్లెక్కుపెట్టి మల్లెపూవులు చిమ్మెను. మఱియొకటి బరువుగా ప్రేలుచు సాగలేక సాగలేక సాగి యాకసమురాయు సౌధాగ్రవిమానమునకుఁ దగిలి తన ముత్తెపుకోలుచెల్ల నొలుకఁ బోసికొనెను. ఇంకొకటిహార్మ్యోపరి భాగమునఁ గనకయష్టిపై నిలిచి షడ్జమున నొలుకు కేళీ బర్హిణముల విస్తారిత మణిపింఛముల వీజనముల శ్రమ నుడిపి కొనెను. ఆకసమంతయు చిఱుమబ్బులు కొల్లలుగా వ్యాపించి మణిధనువు నెక్కువెట్టి కొట్టి కోలాహలము సేయుచుండెను. ఆకోలాహలములకు నిద్దురపోవుచున్న పెంపుడు నెమిళ్లదరి పడిలేచి మెడలు నిక్కించి యాకసమువంకఁ జూచుచు గూళ్ల నుండి విస్ఫురత్పింఛాభిరామముగ దూఁకుచు తమ ప్రాణబంధు వగు పర్జన్యదేవునకు షడ్జధ్వనులచే స్వాగతము చెప్పుచుండెను.

ఆకసమున ధీరధీరములగు సామంద్ర గర్జా నిస్స్వనములు, భూమిమీఁద నిప్రౌఢోదారములగు నిర్ఝర పద్ఘారావములు, క్రమముగా నాకసమంతయు నడవి యయ్యెను. ఆయడవిలోఁ గాఁ జెనుఁబోతులు తల లడ్డముగా వంచి దూఁకుచుండెను. ఏనుఁగు దండ్లు కొమ్ములెత్తి గీపెట్టుచుండెను. పెద్దపులులు తోఁకలు పైకెత్తి కాల్దువ్వుచు గాండ్రించుచుండెను. క్రమక్రమముగా నాకసమంతయు నల్లనిముసుఁగు వైచినట్లు, కాటుకలు గుప్పలు వోసినట్లు, కాల మను మహాసర్పము సహస్ర ఫణా మండలము విప్పినట్లు మేఘములు దట్టముగాఁ బట్టెను.

ఆసమయమున నాకాలిక మగు దుర్దినాగతి కుత్కంఠితుఁడై ప్రియైకచిత్తవృత్తి యగు చారుదత్తుఁడు వృక్షవాటిక యందు మైత్రేయుని రాకకై ప్రతీక్షించుచుండెను. ఆ మైత్రేయుఁడు వసంతసేన యింటినుండి వానలోఁ దడిసిపోవుదు నేమో యను భయము లేకయే మెల్లగా వచ్చుచుండెను. అతనిమన స్సాకసముపైన లేదు భూమిపైన లేదు. రత్నావళిపై నుండెను. వసంతసేనపై నాతనికిఁ గోప మింకను తగ్గలేదు. ఆవసంతసేన పట్టి బోగముది. అంతయున్నది యేమిలాభము? ఇంకను లోభమే. అది మాఱుమాటైన మాటాడలేదు. ఇచ్చుటయే తడవుగా రత్నావళినిఁ బుచ్చుకొని యూరకొన్నది. తనంత వాఁడచ్చుటకుఁ బోయెనా! యేమైన గౌరవించినదా? "మైత్రేయా! పాపమక్కడనుండి నడచివచ్చితివి. కొంచెము కాలము విశ్రమింపుము. కొంచెము ఫలహారము సేయుము. పానకము త్రావి పోయెదవు లే" యని యేమైననన్నదా! ఏదో లోకమో పాడో చిన్ననాటనుండి స్నేహితులము గదా

యని యాచారుదత్తుఁడు పంపగావెళ్లితిని. నన్నింత తేలికగాఁ జూచునా! ఆచెప్పినవాఁడు పిచ్చివాఁడా? దుంపలేకుండగా తామరపుష్పము పుట్టదు, మోసగించని కోమటివాఁడు లేఁడు. తగవులాటలేని పల్లెరచ్చయుండదు. అట్లే లోభములేని బోగముది యుండదట. ఎంతచక్కఁగాఁ జెప్పినాఁడు! ఏమిలాభము? చెప్పుటవఱకే! నేనునుఁ జెప్పినాను. "ఓరే! నాయనా! యిది మనకుఁ బనికిరాదురా" యని. అయినను మఱలఁ జెప్పిచూచె దను. "ఇఁక చాలులే! యీగణికా ప్రసంగము, కట్టిపెట్టు"మని. ఆకసమునుండి యొక వడగల్లు మైత్రేయుని వీపుపై పెడేలు మని చఱచెను. ఆదెబ్బతో మైత్రేయునకు మెలకువవచ్చి యాకసమువంకఁజూచెను. ఓరి! దీనిదుంపతెగా! మొగము నిండ మసిపూసికొని కొఱవిదయ్యమువోలె నిప్పులు మియు చున్నది. నేను చూడనేలేదు! అనుకొనుచు మైత్రేయుఁడు త్వరత్వరగా నడచి యింటికిఁ జేరెను. చారుదత్తుఁడు వృక్ష వాటికయందలి సంచపాళిలోని వేదికపైఁ గూర్చుండియుం డెను. మైత్రేయుఁడు స్వస్తివచనముతో నతనిని సమీపించెను.

చా:— మైత్రేయా! నీవు వెళ్లినపని యేమైనది?

మై:— పాడైనది.

చా:— ఏమి! యామె రత్నావళిని బుచ్చుకొనలేదా?

మై:— మనకా మాత్రమదృష్టము గూడనా? క్రొత్తగా వికసించిన తామరమొగ్గవంటి దోసిలియొగ్గి తీసికొన్నది.

చా:— మఱి పాడైనదనెదవేమి?

మై:— పాడుగాక యేమైనది? మనమేమైన తింటిమా పెట్టితిమా! ఎవఁడో దొంగముండకొడుకు కెత్తుకొనిపోయినన

చవుకనగకు—అవి బంగారపుది కూడనైయుండదు. వట్టికట్టునగ. దానికిబదులుగ చతుస్సముద్ర సారభూతమైన రత్నావళి కాజేసినది.

చా:— మైత్రేయా! అట్లనకుము అమె విశ్వసించి మనవద్ద న్యాసముంచినది. మనమా విశ్వాసమునకు బదులుగా రత్నావళినిచ్చితిమిగాని యీసువర్ణభాండమునకుగాదు.

మై:— ఇంతేగాదయ్యా! ఆరత్నావళినిఁ దీసికొన్నది సరే యది యటుంచుము. ఆనేటిముండ కన్నుగీటుట యీ వసంతసేన ముఖమునకు చెరగడ్డము పెట్టుకొని ముసిముసినవ్వులు నవ్వుట నేనేమైన పిచ్చివాఁడననుకొన్నదేమో! ఇదిగో! నేను బ్రాహ్మణజన్మమెత్తితిని. అవునా? ఇప్పుడు నాతల నీపాదముల మీఁదఁబెట్టి విన్నవించుకొనుచున్నాను. ఈవ్యాపారము నింతటితోఁ గట్టిపెట్టుము. భోగముది చెప్పులో దూరినరాయివలెఁ దీసివేయుటకు వీలులేక తెగ యేడిపించును. భోగముది, యేనుఁగు, కరణము, బిచ్చగాఁడు, గాడిద యుండియున్నచోట గడ్డికూడ మొలవదు.

చా:— నీవింతదూరము చెప్పుటయెందులకు? నా దారిద్ర్యముచేతనే నివారింపఁబడితిని. డబ్బుగలవానికిటువంటి ప్రసంగములుగాని నాబోటివానికెందుకు?

మై:— అవునులే! నేనేదో చెప్పితినిగదాయని నాలుక చివరనుండి మాట్లాడుచుంటివి. ఇటువంటిప్రసంగములు నీకుఁగావలయునో లేదో నీవాలకమే చెప్పుచున్నది. సరే! నాకెందుకీ గోల? ఆమెనీతోఁ జెప్పుమన్నదేదో చెప్పెదను. ఆమె యీ నాఁటిసాయంకాలమిక్కడకు వత్తునని నీతోఁ జెప్పుమన్నది. బహుశః

ఆరత్నావళిలోఁ దృష్టిలేక యింకేదైన నడుగుదమని కాపలయును.

చా:— సరే! రానిమ్ము. పరితుష్టుఁడైపోవును.

ఇంతలో మైత్రేయునిపై వెనుకనుండి మట్టిబెడ్డయొకటి పడెను. మైత్రేయుఁడు తలయెత్తిచూచెను. చుట్టును కంచె వేసిన వెలఁగచెట్టునుఁ గొట్టినట్లుగాఁ దనపై గడ్డలు విసెరెద రెవరు? మైత్రేయుఁడు నలుమూలలఁగలయఁజూచెను. వారు గూర్చుండిన చతుశ్శాలావలభియందు నివసించుచున్న పావు రాయిజంట యాతనికంటఁబడెను. "ఓసి! మీదుంపతెగ! మీకుఁగూడ నేను లోకువేనా? మీరోగము కుదిర్చెదనుండుడు." ఇట్లని యాతఁడచటపడియున్న కొంకికఱ్ఱ పుచ్చుకొని వానినిఁ గొట్టఁబోయెను. చారుదత్తుఁడు మైత్రేయుని శాంతింపఁజేసి కూర్చుండఁబెట్టెను. ఇంతలో మఱల వెనుకనుండి రెండుమూడు బెడ్డలు మైత్రేయునిపైఁబడెను. ఈమాటు మైత్రేయుఁడు కపోతముల నను మానించలేదు. వాఁడెవఁడో మనుష్యుఁడే యయియుండవచ్చును. అతఁడు చతుశ్శాలనుండి బయటకువచ్చిచూచెను. ప్రాకారమువద్ద కుంభీలకుఁడు నిలఁబడియుండెను. కుంభీలకుఁడు మైత్రేయునకు నమస్కరించెను. మైత్రేయుఁడు కుంభీలకు నాశీర్వదించెను.

మై:— అరే! కుంభీలకా! ఇంతప్రళయములో నేమి మునిగిపోయినదనివచ్చితివిరా?

కుం:— అదికాదయ్యా! ఆమె వచ్చినది.

మై:— ఎవరురా? ఆమె?

కుం:— ఆమె ఆమెయే?

మై:– ఓరీ! సరిగాఁజెప్పుమురా! మేకవలె మే మే యనెద వేమి ?

కుం:– నీనొక ప్రశ్న వేసెదను చెప్పుము. మామిచెట్టెప్పుడుపూయును ?

మై:– ఇదేచెప్పలేనా! గ్రీష్మములో.

కుంభీలకుడా మాటవిని నవ్వెను. మైత్రేయుఁడాలోచించెను. చారుదత్తు నడిగివచ్చెదనని యతఁడు చారుదత్తునివద్దకేగి మఱలవచ్చెను.

కుం:– ఇప్పుడు చెప్పగలవా?

మై:– ఆఁ చెప్పెదను. వసంతములో.

కుం:– ఇంకొకప్రశ్న వేసెదను. కలిగినయూళ్ళను రక్షించెడి దెవరు ?

మై:– మార్గము.

కుం:– నీబొందవలె నున్నది. మఱలపోయి ఆయన నడిగిరమ్ము.

మైత్రేయుఁడు చారుదత్తునడిగివచ్చెను.

కుం:– ఒకే! కుంభీలకా! సేనరా.

ఇప్పుడు రెంటినిఁ గలుపుము.

మై:– సేనావసంతము.

కుం:– త్రిప్పిచదువుము.

మైత్రేయుఁడు వీపు వానివైపుత్రిప్పి "సేనావసంతమ" నెను.

కుం:– ఓరీ! మూర్ఖుఁడా! పదములుత్రిప్పి చదువుము.

మైత్రేయుఁడు కాళ్ళుపైకిత్రిప్పి "సేనావసంత" మనెను.

కు:- ఓరి! మూర్ఖుఁడా! అక్షరపదములు త్రిప్పి చదువుము.

మైత్రేయుఁడుకొంచమాలోచించి 'వసంతసేన' యనెను.

కుం:- అదిగో! ఆమెవచ్చినది.

మై:- సరే! వచ్చినదిగదా! చారుదత్తునితోఁ జెప్పెదనులే ఉండుము.

మైత్రేయుఁడు చారుదత్తుని వద్దకువచ్చి "స్నేహితుఁడా! ధనికుఁడువచ్చినాఁడు"

చా:- మాయింట ధనికుఁడెవఁడు?

మై:- మీయింటిలో లేకున్న గుమ్మములోనున్నాఁడు. "అదిగో! ఆ వసంతసేనమ్మ" వచ్చినది.

చా:- మైత్రేయా! నన్ను ప్రతారించుచుంటివా?

మై:- నామాటలయందు నమ్మకములేనిచో నిదిగో! యీకుంభీలకునడుగుము. ఒరే! కుంభీలకా! యిటురమ్ము

కుంభీలకుఁడువచ్చి చారుదత్తునకు నమస్కరించెను. చారుదత్తుఁడు వానినాదరించి "ఓయీ! నిజముచెప్పుము. వసంతసేన వచ్చెనా?" యని యడిగెను.

కుం:- నిజమే ఆమె యిపుడువత్తునని మీకు నివేదింపుమన్నది.

చారుదత్తుఁడుపైనున్న యుత్తరీయమునుదీసి కుంభీలకునకిచ్చెను. కుంభీలకుఁడు చారుదత్తునకు నమస్కరించి సెలవుగైకొని వెళ్ళిపోయెను.

మై:- ఏమయ్యా! ఇంతప్రళయములో వసంతసేన యెందుకువచ్చుచున్నదో తెలియునా?

చా:- నాకు సరిగా తెలియుటలేదు. ఎందుకువచ్చి చున్నది ?

మై:- నాకుఁదెలియును. "ఈ రత్నావళి తక్కువవెల గలది, సువర్ణభాండము ఎక్కువవెలగలదని పేచీపెట్టి యింకే దైన బట్టుకొనిపోవమని, తెలిసినదా ?

చా:- రానిమ్ము. పరితుష్టయై పోవును.

ఆకసమున మేఘములు దట్టముగాఁబట్టి యుజ్జయినీనగర రాజుపై నీలిముత్యాల గొడుగువిప్పినట్లు భాసించెను. క్రమ ముగా చినుకులు పెద్దవై సన్ననిజల్లు పడఁజొచ్చెను. ఆజల్లులో నుజ్జయినీ నగరసౌధములు ముత్తెములజాలరుల నందగించు సన్ననిపట్టు తెరవెనుకనుండి చూచుచున్న యభ్యంతర జన ముపోలెఁ బ్రకాశించెను. మేఘములు శైలశిఖరములందు వరు సలుదీర్చిఁ వేలుచు గర్జించుచుండెను. ఆగర్జారవము విని వానలో దమ మణిపింఛములు దడిసిపోవుచున్న భయమైనలేక గొంతు కాకాలనువిప్పి యూపుచు నెమిళ్ళు నృత్యముసేయఁ దొడం గెను. ఆకసమున మేఘములు మదించిన యేనుగులఘండునవలె గీపెట్టుచుండెను. వాని కాళ్ళకుఁ దగలకుండఁ దగిలించిన బంగారు సంకెలలవలె మిలమిల మెఱయుచుండెను. ఆకసమున మణిధనువు పుట్టపైనుండి క్రిందికిదిగుచున్న జెఱ్ఱిపోతువలెఁ బ్రకాశించెను. స్వర్గమునందలి యేనుగులనొకచో మందవేసి మెఱ పుఁదీగల బంధించి యింద్రుఁడాజ్ఞపెట్టగా నాయేనుగులీ భూమిని వెండిత్రాళ్ళచేఁ బైకిలాగుచున్నట్లు వర్షధార లొప్పారుచుండెను. క్రమముగాఁ జీకటిపడఁజొచ్చెను. రాత్రి తనసల్లని రెక్కల నుజ్జయినీ పట్టణముపైఁజాచెను. ఆచీకటిలో నిది యది యని

వస్తుభేదమెఱుంగరాక దృష్టియుండియు లేకపోయెను. విశ్వమంతయు గాఢాంధకారము వ్యాపించి కాటుకముద్దలు చిమ్మినట్లు ఒక్క టేసలుపై భాసించెను. పల్వలములందు వర్షధారాపాతములై దర్దురములు నోళ్ళుగా బురద నప్పళించుచు బెకబెకలాడుచుండెను. కీచురాలు చెవులు చిల్లులుపడునట్లు జిల్లుమను నాదమును భూనభోంతరాళములఁ దిరుగుళ్ళు పడునట్లు చేయుచుండెను.

ఆసమయమున వసంతసేన ప్రియాభిముఖియై బయలుదేరెను. ఆమె నల్లనిచీర ధరించియుండెను. నల్లనిగొడుగు ధరించియుండెను. నెమలికన్నులవీవన చేతఁబట్టియుండెను. ఆమెకుఁ దోడుగా విటచేటు లిద్దఱు నడచుచుండిరి. ఆమె ముఖజ్యోత్స్న వ్యాపించి ప్రాంతములఁ జీకట్లామె పోయినంతమేర పలుచఁబడుచుండెను. ఎవరైనఁదన్ను జూడవచ్చును. తన్ను గుర్తింపవచ్చును. ఆమె సిలువెల్ల లజ్జామూర్తియయ్యెను. విటుఁడన్నాఁడుగదా! "ఇదిగో నమ్మా! ఇది నీకేగాక వటి యేరైన నభిసారికలకుగూడ విఘ్నము గలిగించును. చూడుము. ఈ రాత్రిగూడ మబ్బుచెఱఁగున దనమోము చందురునిఁ గప్పికొన్నది." యని. వసంతసేన చెఱఁగునుఁ దలపై మేలిముసుఁగుగాఁ దీసికొనెను. ఆకసము నిరంతరముగా వర్షించుచుండెను వాన సముద్రమెత్తివచ్చినట్లు నల్లని చీఁకటికెరటములతోఁ గలిసి హోరుపెట్టుచుండెను. మెరపులను బంగారు కళలంటి నటించు బడ్డ యొడవిదున్నలవలె మేఘములుఱిమెను, మెఱసెను సముచుఁజీల్చెడి క్రొక్కారు తళతళలు కనుగ్రుడ్లు లపటముఁ జేయుచుండెను. ఆమెఱపుకాంతులలోఁ గనవైన వర్షధారలు

పరుగెత్తుచున్న వర్షభూతముయొక్క వ్రేలు కాళ్ళవలెఁ జూపులకు వెక్కసమై తోఁచుచుండెను. ఆదృశ్యమునుఁజూచి వసంతసేన యించుక చకితయయ్యెను. విటుఁడన్నాఁడుగదా! "వసంతసేనా! ఈ సౌదామనినిఁ జూచితివా? తాను కప్పుకొన్న నీలికప్పడ మెడనెడ జారిపోవుచుండగాఁ దరతర లాగికొనుచుఁదన తళతళలు చూచువారి కన్నుల మిలమిల మిలలాడఁజేయుచు చఱచఱ నభిసారికవోలె నడచిపోవుచున్నది. చూచితివా!" యని. వసంతసేన తన చీరను నొడలినిండ లాగికొనెను. వాన హోరెక్కువయ్యెను. గాడ్పు వీవఁదొడఁగెను. ఆ గాలిదెబ్బకు వానజల్లు ఏటవాలుగాఁబడి వసంతసేన యలకలపై ముత్తెములు చల్లెను. పయోధరము లప్పళించెను. వసంతసేన యొడలు పులకించెను. ఆమె దీర్ఘముగా నిశ్వసించి వానకు గొడుగడ్డము పెట్టుకొనెను. మఱల విటుఁడన్నాడుగదా! "వసంతసేనా! చూచితివా! ఈ నిశ తన సొమ్మేమిపోయినదని నీవు చారుదత్తుని నభిసరించుచుండగాఁ జూచి చుప్పనాతియై సవతివలెఁ దళతళలు పెళపెళలుగా నీమార్గము నడ్డగించుచున్నది." యని. వసంతసేన మనసునఁ గటకటఁబడెను. తనమార్గము నెవరో యడ్డగించుచున్నట్లే యామె భావించెను. ఆకసమంతయు నుఱుములు మెఱుములయ్యెను. క్షణమంధకారము క్షణము వెల్గుగా వసంతసేన మార్గము చారుదత్తుని గృహద్వారము సేరెను. ఆ మెఱుపులు మెఱసినప్పుడు మేఘములను నల్లనియిండ్లకు నచ్చరలెత్తిన మణిదివ్వెలు కాంతులుమిసినట్లు తోఁచుచుండెను. వసంతసేన యన్నదిగదా "ఈమేఘమునకు సిగ్గులేదు. అభిసారికనగు నన్నుఱుములతో బెదరించి తన ధారాహస్త

ములఁ బరామర్శించుచు నామార్గము నడ్డగించుచున్నాఁడు. ఇతఁడు గర్జించిన గర్జించనిమ్ము. మగవాండ్రు కటికవాండ్రని తెలియునింతేగదా! ఓసి! సౌదామనీ! ఆడుపుట్టువు పుట్టితివి నీకుఁగూడఁ దెలియదా?" యని. విటుఁడు వసంతసేన చేసిన యుపాలంభమును వినెను. "వసంతసేనా! యెందులకీ యుపాలంభనము? ఈ సౌదామని నీకుపకారిణియేసుమా! క్షణమంధకారము క్షణము వెల్గుగా నీమార్గమున నీమె నీకుఁ జెలికత్తె యయినది. ఆమె నుపాలంభించుట యెందులకు?

వసంతసేన యాకసమువంకఁ జూచెను. ఐరావతము మెడలో వ్రేలాడు స్వర్ణరజ్జువోలె శైలశిఖరముపై గాలికి రెపరెపలాడు సితపతాకవలె నింద్రుని యింటికెత్తిన మణిదివ్వెవలె మెఱపుఁదీవ లాకాశమునఁ బ్రాకులాడెను. ఆవెల్గులో విటుఁడు ముందుకుఁ జూచి "వర్షాభిసారికా! వసంతసేనా! నీయభిసరణోద్దేశమునుఁ జేరితివమ్మా" యనెను. వసంతసేన ముందునకుఁ జూచెను. చారుదత్తుని వృక్షవాటికనుండి సన్ననిదీపపు వెల్గులు బంగారు బాణములవలెఁ జీఁకటిలోనుండి దూసికొని వచ్చి యామెకన్నులకు గ్రుచ్చుకొనెను.

విటుఁడు చారుదత్తుని గృహద్వారమును సమీపించి "ఎవరక్కడ! ఆర్యచారుదత్తుని కిట్లని నివేదించుఁడు. ఈమేఘములు విస్ఫారితకాలములో, నీకడిమిపూలగాలిలో ప్రియతముఁడవగు నిన్నుగుఱించి మావసంతసేన యభిసారికయై వచ్చినది. ఈలలితాంగి ముంగురులు వర్షోదకముచేఁ దడిసినవి. నీదర్శనాకాంక్షిణియై వచ్చుచు నుఱుములచే మెఱుములచే మిక్కిలి బెదరిపోయినది. ఇదిగో! యీమెయిప్పుడు నీగవనుకడనిలిచి

పల్వలములందు నిలిచిన వార్షికజలములం దండెలవలికు బురద యయిన పాదములనుఁ గడిగికొనుచు న్నది." అని. చారు దత్తుఁడీ మాటలువినెను. అతఁడు వసంతసేనను స్వీకరించుటకై మైత్రేయునిఁ బంపెను. మైత్రేయుఁడు బయటకువచ్చి వసంత సేనకు స్వాగతి నెఱపెను. వసంతసేన ఛత్రధారికతోడ విటుని వెనుకకుఁబంపి మైత్రేయునివెంట లోనికివచ్చెను.

వః— మైత్రేయా! మీజూదగాఁడెక్కడనున్నాఁడు?

చారుదత్తుని జూదగాఁడని పిలచుటకు మైత్రేయుఁడు మిక్కిలి సంతసించెను.

మైః— ఇదిగో! యీశుష్కవృక్షవాటికలో.

వః— శుష్కవృక్షవాటిక యనుచున్నా విదిగాక మఱి యొకటి యెచ్చటనైననున్నదా?

మైః— వేరేయెందుకు? తిండి—నీరు ఎచటనుండదో యదే శుష్కము.

వసంతసేన చిఱునవ్వు నవ్వెను.

మైః— నవ్వంతయు నిప్పుడే నవ్వెదవేల? కొంచెము కట్టి పెట్టుకొనినచో లోనికివచ్చి నవ్వవచ్చును.

వసంతసేన మైత్రేయునితో లోనికిబోయెను. లోపల చారుదత్తుఁ డాసనముపైఁ గూర్చుండియుండెను. వసంతసేన యతనిని సమీపించి పువ్వులతోఁ గొట్టుచు "ఓయీ! జూద గాఁడా! ఈప్రదోషకాలమున నీకు సుఖముగానున్నదా?" చారు దత్తుఁడు వెనుదిరిగి వసంతసేననుఁజూచెను. అతఁడు లేచినిల్చి వసంతసేనతో "ఓసీ! ప్రియురాలా! ఈప్రదోషము నీవిశ లివి యన్నియు దీర్ఘనిశ్వాసములచేత వెళ్లించితిని. నీరాకవలన

నీప్రదోషము మాత్రము నాకు సుఖప్రాయమైనద" నెను. వసంతసేన కూర్చుండెను. చారుదత్తుఁడు వసంతసేన ముఖమువంకఁ జూచెను. ఆమె స్తనమండలమువంకఁ జూచెను. ఆమె చెవిలోని కడిమిపూవునుండి వర్షధారలు జారి యామె స్తనమును యౌవరాజ్యమున నృపసూనునివలె నభిషేకించెను. ఆమెచీర యంతయుఁ దడిసియుండెను. చారుదత్తుఁడు మైత్రేయునితో వసంతసేన కొక క్రొత్తచీరం దెచ్చి యిమ్మని చెప్పెను. చేటి మైత్రేయుని వారించి వసంతసేనను పొడిచీర ధరింపఁజేసెను.

మై:— ఏమమ్మా! వసంతసేనా! కన్నుకన్ను పొడుచుకొన్ననుఁ గాన్పించుటలేదుగదా! ఈచీఁకటిలో నీవానలో నిట్లేలవచ్చితివి?

చేటి వసంతసేనతో మెల్లగా "ఈయన పట్టియమాయకుఁడువలె నున్నాఁడే"య నెను.

వ:— అమాయకుఁడుగాడు. దేవాంతకుఁడనుము.

చేటి యందుకొని యిట్లనెను. "అయ్యగార్లా! వసిమీరొద్దనే వచ్చితిమి. ఆరత్నావళియున్నది దే దానివెలయెంత"? మైత్రేయుఁడు చారుదత్తునితో మెల్లగా నిట్లనెను. ఓయీ! నేను చెప్పలేదా? ఈరత్నావళి తక్కువవెలగలదని తగవుపెట్టుకొని యింకేమైనఁ దీసికొనిపోవుటకని వచ్చినది.

చే:— ఆరత్నావళి తనదే యనుకొని మావసంతసేన జూదమునందోడిపోయినది. మేము జూదమాడిన సభికుఁడు రాజువద్ద సేవకుఁడు. వాఁడెక్కడకుఁ బోయెనో మాకుఁ దెలియుటలేదు. అందుచేత దానివెలయెంత? యని యడుగుచుంటిమి.

మై:— మామాట మాకేయెదురు త్రిప్పితివి. ఎంత చెడ్డా బోగము దానివైతివి.

చే:— అది కాదయ్యా పోనీ మేమూ రత్నావళిని వెదకి పట్టుకొనులోపల నీసువర్ణభాండమును మీావద్దనుంచుకొనుఁడు.

చేటి సువర్ణభాండమునుఁ బైకిదీసి చూపించెను. మైత్రేయుఁడు దానివంక తీక్ష్ణముగాఁజూచుచు నేదోయాలోచింపఁ దొడఁగెను.

చే:— ఏమయ్యా! అట్లుచూచెదవు? దీనిని నీవితివఱ కెప్పుడైనఁ జూచితివా?

మై:— ఆఁ! లేదు లేదు. ఈ నగపనితనము కంటిని లాగుచున్నది. అందుకని చూచుచుంటిని. ఇది యెక్కడఁ జేయించితిరి!

చే:— ఓయీా! నీకన్నులు నిన్ను మోసగించినవి. అదే యీాసువర్ణభాండము.

మై:— స్నేహితుఁడా! అదే యీాసువర్ణభాండము. దొంగలెత్తుకొనిపోయినది దీనికెట్లు వచ్చినదో?

చా:— మైత్రేయా! ఇదియంతయు మనకెందుకు? మన దగ్గరపెట్టిన న్యాసమునకుబదులుగా మనమేదో యూహించితిమి. దానిని పట్టుకొనియే మాట్లాడవలయును. తక్కినది మన కెందుకు?

మై:— ఓసీ! చేటీ! ఇది యదే యంటివే యది నీకెట్లు వచ్చినది?

చేటి మైత్రేయుని చెవిలో సంగతియంతయుఁ జెప్పెను.

చా:- మీరిద్దరు చెవులు కొఱికికొనుచున్నారు. మేము వినగూడదా ?

మైత్రేయుఁడు చారుదత్తుని చెవికొఱికెను.

చా:- చేటి ! యిదినిజముగా నదియేనా ?

చే:- అవును.

చారుదత్తుఁడు చేతివ్రేళ్ళు తడుముకొని లజ్జితుఁడై యూరకుండెను. ధనహీనుని జీవితమింతే. వానికోపము, వాని దయ ప్రతీకార నిరర్థకములై విఫలములగును. ఱెక్కలువిఱిగిన పక్షి, యెండినచెఱువు, కోఱలుదీసినపాము, దరిద్రుఁడైన మానవుఁడు, ఇవియన్నియు నేకరాశి. దరిద్రునకు పరితోష కాలమీవిధముగా విఫలమగును.

మైత్రేయుఁడు చారుదత్తుని రహస్యముగా మందలించెను.

మై:- ఓసి ! చేటికానా ! సరే ! సువర్ణభాండము దెచ్చితివి. నాయంగవస్త్రమేది ? అదియేమయిన పైటకుఁ బనికివచ్చునని దాచుకొంటివా ?

ఈ మాటలకు వసంతసేన విఱుఁగఁబడి నవ్వెను. ఆమె యిట్లనెను. "ఆర్య చారుదత్త ! ఈ రత్నావళినిచ్చి నన్ను తేలికచేయుట నీకు న్యాయమని తోఁచినదికావయును." చారుదత్తుఁడలఁతిగా నవ్వుచు నిట్లనెను. "వసంతసేనా నీవేచూడుము. జరిగినది జరిగినట్లుగా నెవఁడునమ్మును ? ప్రతిమానవుఁడు నన్ను తేలికసేయును. ఈ దరిద్రమున్నదే యిది ప్రతాపమునుఁ జంపును. ఎవరేమన్నను నూఱకొనవలసినదే.

మైః— ఓసి! చేటికా! నీవుగూడ నిచ్చటనే పండుకొందువా?

చేటిక నవ్వి బలేవాఁడనయ్యా యనెను.

బయట మేఘములు గర్జించెను. సాయంతన వాయువులు కడిమి పూలవాసనలు చిమ్ముచు వీచుచుండెను. ఆగాలి తాకుచే వానజల్లు ఏటవాల్పడి పంచపాళీనిఁ దడిపిపోయెను.

మైః— ఇదిగో! దీని ముంప తెగ మఱలవచ్చినది. సుఖముగాఁ గూర్చుంటివిగా యింటిలోఁ గూడఁ జొరఁబడి తడిపిపోయినది. ఆశకొలుపుచున్నాఁడే వాఁడే మెఱుఁగు. వాడిపుణ్యమాయని హాయిగా నిద్రపోనిచ్చినాఁడు.

అందఱు నాకసముపంకఁ జూచిరి. ఆకసము కోలాహలముగా నుండెను. తొలిరోజు యుద్ధమైనతఱువాత మలిరోజున నిరుపక్షలవారు చతురంగములను దీర్చి సన్నద్ధపడుచున్నట్లుండెను. తప్పెటలు వాయించినట్లు, శంఖములూదినట్లు నాకసమునుండి మేఘగర్జలు వినిపించుచుండెను. సన్ననిజల్లుపోయి వానబలిసెను. వర్షధారలు శరపాతమువలెఁ బడుచుండెను. చారుదత్తుఁడు వసంతసేననుఁ జూచుచు "ప్రియురాలా! చూడుము చూడుము! కాటుక యుగుళ్ళనుఁ బిసిచి యాకసమునఁ జిక్కఁగాఁ బూసినట్లు మేఘములాకసమున నలముకొన్నవి. ఈసౌదామని యీమేఘునియందుఁ బ్రణయముతో నభిసారికవోలె నతనినిఁ గౌఁగిలించుకొనుచున్నదనెను. వసంతసేన యొడలెల్ల పులకరించెను. ఆమెనిలువెల్ల లజ్జామూర్తియై మెల్లగా చారుదత్తునిఁ గౌఁగిలించుకొనెను. చారుదత్తుఁడు ప్రత్యాలింగనముచేసెను. అతని శరీరమున విద్యుత్ప్రసరించెను. "ఓయి! మేఘమా!

గంభీరముగా గర్జించుము. నీదయవలన స్మరపీడితమైన నాతను ప్రియురాలికౌఁగిలిలో కడిమిమొగ్గలు తొడిగినది."

మై:— ఈదిక్కుమాలిన దుర్దినమెంతపనిఁ జేసినదో చూచితివా? పాపమీామె యీా మెఱుపులనుఁ జూచి భయపడి చారుదత్తునిఁ గౌఁగిలించుకొన్నది. ఆడువాండ్రని కూడ లేదు. ఇట్లు భయపెట్టవచ్చునా?

చా:— ఈవర్షదినమునుఁ దిట్టెద వెందులకు? ఈవర్షమిట్లే నూరేండ్లు కురియునిమ్ము. ఈమెఱుపులనిట్లే మెఱవనిమ్ము. నాబోటివానికందని కొమ్మ గాలికివంగి వచ్చి నాబుజముపై విశ్రమించినది. ప్రేమతో నింటికివచ్చిన కామినుల యొక్క వర్షోదక శీతలములగు శరీరములనుఁ గౌఁగిలించుకొను వారి జీవితము లెంతధన్యములు!

మఱల మేఘములు గర్జించెను. మెఱుపులు మెఱసెను. గాలివీచి వాన గోడలపైఁజిమ్మెను. తాళవనముపై తారముగ, చెట్లయాకులపై మంద్రముగ, శిలలపై రూక్షముగ, నీటిపై చండముగ తాళానుసారముగ వీణవాయించుచు వర్షధారలు సంగీతము పాడుచుండెను.

# ప్రవహాణ విపర్యాసము.

౧

తెల్లవాఱెను. ఉదయ సంధ్యారాగమంతయు వ్యాపించెను. మబ్బుకుబుసమూడ్చిన నీలినింగి ప్రసన్నమై తోఁచెను. ప్రభాతవాయువులు మందముగా వీచుచుండెను. వసంతసేన యింకను నిద్దురలేవలేదు. ఆమె యేదియో మధురస్వప్నము గనుచుండెను. చారుదత్తునితోడి ప్రథమ సమాగమ మాస్వప్నమందా మెకుఁ దిరిగితిరిగి తోఁచుచుండెను. ఆమె తన్మయురాలై యట్లే పండుకొనియుండెను. ఒకచేటి యచటకువచ్చి యామెనుఁ దట్టుచు నిద్దుర లేపుచుండెను. కొంతసేపైన తఱువాత వసంతసేన యావులించుచుఁ గూర్చుండి కన్నులు నులిమికొనుచు "అబ్బా! యింతరాత్రివేళ నిదుర లేపితివేమి?" యనెను.

చే:— మాయందఱకుఁ దెల్లగాఁ దెల్లవాఱినది. నీకుమాత్రమింకను రాత్రి.

వసంతసేన గవాక్షమునంకఁ జూచెను. బయట లేయెండలు వ్యాపించుచుండెను. ఆమె నగ్నమైన తన స్తనమండలమునుఁ జూచుకొని సిగ్గుపడుచుఁ బ్రక్కగానున్న యుత్తరీయమునుఁ బైకిలాగుకొని 'చేటి! మీాజూడగాఁ డిప్పుడెక్కడనున్నా' డని యడిగెను.

చే:— వర్ధమానుకు నాజ్ఞాపించి యార్యచారుదత్తుఁడు పుష్పకరండకమను జీర్ణోద్యానమునకు వెళ్ళినాఁడు.

వ:— వర్ధమానకు నేమని యాజ్ఞాపించెను.

చే:— "ఓరి! వసంతసేన వెళ్ళవలెను. బండిసిద్ధముచేసి తెమ్మ"ని.

వ:— నేనిప్పుడెక్కడకుఁ బోవలయును?

చేటి నవ్వుచు 'చారుదత్తుఁడున్నచోటున' కనెను వసంతసేన చేటినిఁ గౌఁగిలించుకొనెను. ఆమె రాత్రి సరిగా చారుదత్తునిఁ జూడలేదు. ఆతన్మ యత్వములో నామె యభ్యంతర చతుశ్శాలనుఁ బ్రవేశించినట్లే యెఱుఁగదు. ఆమెకుఁ దెలిసిన దెల్ల నారాత్రి రాత్రియెల్ల నొకసుఖ ఖండమని. అదియైన నామె వివేకించలేదు. ఒకముద్దగాఁ దెలిసికొన్నది. ఆమె కాసుఖానుభూతి తలఁపునకువచ్చి లజ్జతో మొగమువంచుకొనెను. ఆమె కుచమండలముపై మిలమిల మెఱయుచున్న రత్నావళి యామెకన్నులఁబడెను. ఆమె యారత్నావళినిఁ దీసి చేటికిచ్చి "చేటి! యీరత్నావళినిఁ గొనిపోయి మాయక్కగారు ధూతాంబకిచ్చి నేను శ్రీచారుదత్తునకు గుణనిర్జిత యగు దాసిని. అందుచే నీకుఁగూడ దాసిని. కాబట్టి యీరత్నావళి నీమెడలో మెఱసినచో బాగుండు"నని నామాటలుగాఁ జెప్పుము.

చే:— ఇదివిన్నచో నార్యచారుదత్తుఁడు కోపగించును.

వ:— మఱేమియుఁ గోపగింపఁడు. ఆయనతో నేను చెప్పెదనులే.

చేటిపోయి మఱల వెంటనే తిరిగివచ్చెను. వసంతసేన చేటిని మఱల వచ్చితివేమని ప్రశ్నించెను.

చే:- అదికాదమ్మా! మా అమ్మగారు నీతో నిట్లు చెప్పమన్నది. "ఆయన నీకిచ్చిన నగను నే దీసికొనుట యుచితము గాదు. నాకు నాభర్తయే యాభరణ విశేషము" అని.

వసంతసేన యామాటలకు మిక్కిలి సంతసించెను. ఆమె యభ్యంతర గృహమును వదలి బయటి పంచపాళీ లోనికి వచ్చెను. వాకిటనొక కరుణామయమైన దృశ్యమామె కన్నులఁబడెను. రదనిక రోహసేనునెత్తుకొని యతనిని బుజ్జగించు చుండెను. రోహసేనుఁడామె చంకనుండి దిగజారుచు దేనికో మారాము చేయుచుండెను. వసంతసేన దగ్గరకుఁ బోయి చూచెను.

రో:- రదనికా! నాకీ మట్టిబండియెందుకు? ఆ బంగారు బండినే తెచ్చిపెట్టుము.

రదనిక:- నాయనా! మనకు బంగార మెక్కడనుండి వచ్చును? నాన్నకు మంచిరోజులు వచ్చినతరువాత బంగారుబండితో నాడుకొనెదవు. ఇప్పటికీ బండితో నాడుకొమ్ము. ఇదిగో! మా బంగారునాయనవుగాదూ! నామాటవినవు? పోనీ సిన్ను వసంతసేనమ్మగా రెత్తుకొనునులే. ఏడువకు.

వసంతసేన యామాటలువిని "రదనికా! ఈ కుఱ్ఱవాఁడెవరు? వీనినిఁ జూడగనే నాకానందమగుచున్న" దనెను. ఇతఁడార్యచారుదత్తుని కుమారుఁడు రోహసేనుఁడని రదనిక చెప్పెను. వసంతసేన యాకుఱ్ఱవానిని రదనిక చంకనుండి తీసి

కొని హృదయమునకు హత్తుకొని "పేఁడచ్చముగ తండ్రిపోలి కయే" యని కుఱ్ఱవానిని ముద్దుపెట్టుకొనెను.

ర:— రూపములోనే కాదు బుద్ధిలోను తండ్రిపోలికయే. ఇపుడార్య చారుదత్తునకు వినోదకారణమితఁడొక్కఁడే.

వ:— మఱి యిపుడెందులకీతఁ డేడ్చుచున్నాఁడు ?

ర:— ప్రక్కయింటి పిల్లవాఁడును నితఁడును బంగారు బండితో నాడుకొన్నారు. ఆబండి యాపిల్లవానిది. వాని బండిని వాఁడీడ్చుకొనిపోయెను. ఈతఁడాబండి తెచ్చియిమ్మనుచు న్నాఁడు. నేను మట్టిబండినిఁజేసి యిచ్చితిని. నాకీ మట్టిబండి యెందుకు ? నాకాబంగారుబండి తెచ్చియిమ్మని మారాము సేయుచున్నాఁడు.

వసంతసేన కన్నులు సజలములయ్యెను. ఆమె వానిని బుజ్జగించుచు "నాయనా ! ఏడువకుము. బంగారుబండితోడనే యాడుకొందువులే" యనెను. రోహసేనునక దియేమియు నర్థముకాలేదు. ఈమెయెవరు తన్నట్లు ముద్దుపెట్టుకొనుటకు ? అట్లు బుజ్జగించుటకు ? వెంటనే యాతఁడు 'రదనికా ? యీమె యెవ' రని యడిగెను.

వ:— నీతండ్రికి గుణనిర్జితయగుదాని.

ర:— నాయనా ! యీమె నీకు 'అమ్మ' యగును.

రో:— రదనికా ! అన్నియు నబద్ధములే. మాఅమ్మ యయినచో మెడనిండ నిన్నినగలెక్కడివి ?

వసంతసేన యామాటలువిని భోరుననేడ్చుచు మెడ లోని నగలన్నియుఁదీసివైచి యాయలంకారములన్నియు నా మట్టిబండినిండఁబెట్టి "యిదిగో ! యిప్పుడు నీకు అమ్మనైతిని

ఈయలంకారముతో నీవు బంగారుబండి చేయించుకో" మ్మని పలికెను.

రో:— నాకువద్దు. నీవే యుంచుకొనుము. పాపము నీవేడ్చుచుంటివిగా !

వసంతసేన కన్నులనీరు తుడుచుకొని "నాయనా !" యేడువనులే ! వెళ్ళి యాడుకో ! బంగారుబండి చేయించుకో" యనెను. రదనిక బండితోడ నగలనుఁగూడఁ దీసికొని యచట నుండి వెడలిపోయెను.

౨

చారుదత్తుని యాదేశము ననుసరించి వర్ధమానకుఁడు వసంతసేన నుద్యానమునకుఁ దీసికొని వెళ్ళుటకు ప్రవహణ మునుఁదోలుకొని వచ్చెను. అప్పటికే ప్రొద్దెక్కుటచే త్వర త్వరగాఁ దోలుకొనివచ్చి చారుదత్తుని యింటి పక్షద్వారము వద్ద నిలువఁబెట్టి రదనికనుఁ బిలిచి "బండి సిద్ధముగానున్న" దని వసంతసేనకుఁ జెప్పు"మనుచు బండితలుపు దెరచెను. తొందర పాటులో బండిలో నాస్తరణము లేకుండ వచ్చుట గమనించి వసంతసేన కై సేసికొనివచ్చునంతలో మఱల రావచ్చునుగదా యనియు ముక్కు-ద్రాళ్ళుపోసిన యాపొగరుబోతు గిత్తల బండి నచటవిడిచి వెళ్ళుటమంచిదిగాదనియుఁ దలఁచి యాతఁ డాబండినిఁ దోలుకొని వెళ్ళెను.

రాజమార్గమునిండ బండ్లు కిటకిట లాడుచుండుటచే శకారుని బండివాఁడు స్థావరకుఁడుగూడ గొంతతడవు తన

బండిని నిలుపఁ బెట్టవలసి వచ్చెను. ప్రొద్దునెత్తిపైకివచ్చుచున్నది. అయినను నతఁడేమి చేయఁగలఁడు ! ఆతనిబండికి ముందున్న బండ్లలో నొక బండిచక్రము బురదలోదిగఁబడుటచే నాబండి వాఁడు సాయముచేయుమని కోరగా ! తనంతవాఁడాతని బండిచక్రము వేయుటా ? యనుకొనుచునే యతఁడా తనికి సాయముచేయుటకై తనబండిని చారుదత్తుని యింటి పక్షద్వారమువద్ద నిలువఁబెట్టి వెళ్ళెను. ఆబండిచప్పుడువిని రదనిక వసంతసేనను తొందరచేసెను. వసంతసేన వచ్చి బండియెక్కెను. తరువాత స్థావరకుఁడువచ్చి బండిని తోలుకొని పోసాగెను. బండి బరువెక్కినట్లనిపించెను. బరువెక్కుటకు బండిలో నేము న్నది ? కాదుకాదు ఆ బురదలో దిగఁబడిన యాబరువైన బండిచక్రము వేయుటచే తా నాయాసపడెనుగదా! అది యను కొనుచు నతఁడు బండినిఁ దోలుకొని పోయెను.

## 3

సిద్ధుఁడు చెప్పినమాటలకు భయపడి పాలకుఁ డార్యకుఁ డను గోపాలదారకుని పట్టితెప్పించి చెఱసాలయందుంచెను. ఆర్యకుని ప్రాణమిత్రమగు శర్విలకుని కాసంగతి తెలిసి యాతని నెట్టులో విడిపించెను. ఆర్యకుఁడు రాజగునట. సంపదలువచ్చునట. అందాతని దోషమేమున్నది? సిరిరామోకాలడ్డు వారుందురా? ఉండిరేయనుము, రాకమానునా? నృపతికి పగయేల? ఏకాకియగు నార్యకునిపై బలవంతుఁడగు రాజునకా వైరము? ఆగొల్లవానిని వన్యగజమట్టుల బంధించెనే. తుదకాతఁడెట్టులో

తప్పించుకొనియేపోయెను. ఏది యెప్పుడెట్లు జరుగునో యెవరె రుంగుదురు?

ఆర్యకుఁడు కట్టుకొయ్య పెగల్చి యొంటికాలి నిగళముతోఁ బారిపోవు నేనుఁగు వలెనున్నాఁడు. ఆతండెవరి కంటనుఁబడకుండఁ బోవలయునని తొందరగాఁ బోవుచుండెను. ఎచటకుఁ బోవలయును? పరుగెత్తుటకైన వీలుగాకుండ కాలి కొక సంకెల గూడనున్నది. అతఁడెవరికంటనుఁ బడకుండఁ దప్పించుకొనుటకై యెచటనేని దాగికొనవలయునని యటు నిటుఁజూచెను. పాడువడిన దూలములు, శీర్ణములైన తలుపులు గల పెద్ద ప్రాతయిల్లొకటి యాతని కంటఁబడెను. వీధిగుమ్మపుఁ దలుపులుగూడ మూయబడియుండలేదు. ఆయింటి యజమానుఁడు బ్రతికిచెడినవాఁడై యుండవలయును. 'ఈయింటిలోనఁ బ్రవేశింతునా'? యని యాలోచించుచు నతఁడు పక్షద్వారము వైపుఁజూచెను. అచటనొక పెట్టెబండి నిలువబెట్టఁబడి యుండెను. అందెవరున్నారో! లేనిచో నెక్కవచ్చునుగదా? యని యాతఁడాబండి దగ్గరకుఁబోయి యోరగాఁదెరచియున్న తలుపు సందులందునుండి లోనికిఁజూచెను. ఎవరును లేరు. దేవుఁడు దానిని తనకొఱకే పంపెనేమో? ఎక్కినచో నేమగును? ఆబండి యెచటకుఁబోవునో? ఈయాలోచనకిది సమయముగాదని యార్యకుఁడు బండియెక్కి తనకాల జీరాడుచున్న యినుపగొలుసును నెమ్మదిగా లోనికిలాగికొనెను. తలుపుమూసెను. ఆగొలును చప్పుడువిని వసంతసేన బండియెక్కినదని తలఁచి వర్థమానకుఁడు బండినిఁ దోలుకొనిపోయెను.

ఆర్యకుఁడు తప్పించుకొని పోవుటచే నగరమంతయు గగ్గోలుగానున్నది. అప్రమత్తులై యుండవలసినదిగా రక్షకభటులను వారియధికారులు హెచ్చరిక చేయుచున్నారు. అందుదిట్టలైన వీరకచందనకులు ప్రాకారమెక్కి చూచుచున్నారు.

చం:— ఏరా! వీరకా! ఆగొల్లవానిని విడిపించినవాఁ డెవఁడైయుండును? వాఁడు బ్రతుకదలచిన వాఁడేనా? వాఁడెచట దాగియుండును?

వీ:— చందనకా! సూర్యోదయమైనఁగాలేదు. అప్పుడే యెవఁడో వానిని చెఱసాలనుండి తప్పించినాఁడు. వాఁడెచటకేగియుండునో? వానిఁ బట్టుకొనుటెట్లు?

చం:— వీరకా! త్వరత్వరగాఁ బోవుచున్న యాబండి ఎవరిదో? అది పెట్టెబండికూడ. చూచుచూచు. ఎవరెక్కిరో! ఎచటకేగుచున్నదో తెలిసికొనవలయును.

వీ :— ఓరీ! బండినాపుము. ఈబండి యెవరిది? లోన నెవరున్నారు? ఎచటకు వెళ్ళుచున్నది?

వ:— అయ్యా! ఈబండి యార్యచారుదత్తుల గారిది. ఈబండిలో వసంతసేన యున్నది. ఈమె యార్య చారుదత్తుఁడున్న యుద్యానవనమునకు వెళ్ళుచున్నది.

వీ:— ఓరీ! చందనకా! ఏమందువు?

చం:— అట్లయినచో చూడనక్కఱలేదు.

వీ:— చూడనక్కఱలేదా? ఏమిటానమ్మకము?

చం:— ఆర్యచారుదత్తునిమీఁద నమ్మకము.

వీ:— ఆర్యచారుదత్తుడెవరు? ఆవసంతసేన యెవరు?

చం:— చారుదత్తుని, వసంతసేనను నెఱుంగని నీవాకాశమునఁ బ్రకాశించు చంద్ర చంద్రికలనుగూడ నెఱుఁగవన్నమాట. ఆర్యచారుదత్తు నెఱుంగని వారెవరుందురు? అతఁడాపన్న జనరక్షకుఁడు. చతుస్సముద్ర సారభూతంబగు రత్నము వంటివాఁడు. ఇంతటి మననగరమునకా చారుదత్తుఁడు వసంతసేన యీయిర్వురే తిలకస్థానీయులు. వారి నెఱుంగనివాఁడవు నీవొక్కఁడవే కన్పడుచున్నావు.

వీ:— ఓరీ! చందనక! నేనుమాత్ర మెఱుంగననుకొనుచున్నావా? చారుదత్తుని నెఱుంగుదును వసంతసేనను నెఱుగుదును. కాని రాజ్యకార్యము నెఱపునెడ నేను నాతండ్రినైన నెఱుంగనుసుమా!

వారియిరువురి సంభాషణమువిని యార్యకుఁడు "ఇతఁడొకఁడు నాకు పూర్వబంధువు మఱియొకఁడు పూర్వవిరోధి వలె నున్నాఁడు. వీరిద్దరు నొకేరాచకార్యమందు నియుక్తులైనను వివాహమందలి యగ్నికిని శ్మశానమందలి యగ్నికిని నున్నంత భేదము పరిశీలములందుఁ గాన్పించుచున్నదనుకొనెను.

చం:— నీవు రాజునకు నమ్మినసేనాపతివి. తంత్రకుశలుఁడవు. నేను బండినాపెదను. నీవు పరీక్షింపుము.

వీ:— నీవును రాజునకు నమ్మినసేనాపతివేగదా! నీవే పరీక్షింపుము. నేనెద్దునుఁ బట్టుకొందును.

చం:— అయినచో నేను చూచినఁ జాలునా?

వీ:— నీవు చూచినచో రాజుగారు స్వయముగాఁజూచినట్లే.

చం:— ఓరీ! బండివాఁడా! కాడి నెత్తుమురా!

వర్ధమానకుఁడు బండినాపి కొడినెత్తుచుండెను. ఆర్య కుఁడు "తన్నువారు చూతురేమో? ఏమిచేయవలయును? చేతిలోఁ గత్తియైనను లేదే. ఇఁక బాహువుల తోడనే పోరాడవల యును. అచట నా కారాగారశాలలోఁ జచ్చుటకంటె నిట్లు పోరాడి చచ్చుటే మంచిది. కాని యిది సాహసమునకు సమయము గాద"నుకొనెను. ఇంతలో చందనకుఁడు ప్రవహణమెక్కెను. ఇంకెవ్వరు? ఆర్యకుఁడే! డేగ బారినుండి తప్పించుకొని పక్షి కిరా తుని చేతిలోఁబడినది. శరణుశరణని యార్యకుఁడు చందనకునకు నమస్కరించెను. శరణన్నవానినిఁ జంపుటకంటె మహాపాతక మొండేమియుండును? చందనకుఁడభయమిచ్చెను. రాజకా ర్యము జ్ఞప్తికివచ్చెను. అయినను నీయార్యకుఁడు చేసిన తప్పేమి? ప్రాణమిత్రము శర్విలకుఁడు వీనిని విడిపించెను. ఆపైన నార్యచారుదత్తుని బండినెక్కి వెళ్లుచున్నాఁడు. ఇటు మిత్రుఁడు—అటు రాజాజ్ఞ—ఏమిచేయవలయును. తోఁచుట లేదు ఏదియైనను సభయమిచ్చితినిగదా! జరుగనున్నది జరు గకమానదు. శరణన్నవానిని రక్షించినవాఁడు, పరోపకారి యగువాఁడు కీడ్పడినను నది వానికీర్తికే హేతువగు"ననుకొ నుచు బండిదిగి "యార్యునిఁజూచితి"ననెను. నాలుక కఱచు కొని వెంటనే "కాదు కాదు ఆర్యురాలినిఁ జూచితిని. ఆమె యార్యచారుదత్తుని నభిసరింపఁ బోవుచున్నదట. రాచబాట యందిట్లు నిలుపుటమంచిదిగాద"నుచున్నది.

వీ:— చందనక! నాకనుమానముగానున్నది.

చం:— అనుమానమా?

వీ:— నీకంఠస్వరము, నీవు మొదట నార్యునిజూఁచితిని నని తరువాత నార్యురాలిననుట యివియన్నియు నాయనుమానమునకు హేతువులు.

చం:— ఇందనుమానమేమిటి? మేము దాక్షిణాత్యులము. మాసంభాషణ మంత విస్పష్టముగానుండదు. ఖష, ఖత్రి కర్ణాట, కర్ణ, ప్రావరణ, ద్రావిడ, చోళ, చీన, బర్బర, ఖేస, ఖానముఖ, మధుఘాత ప్రభృతులగు మ్లేచ్ఛభాషలలో మేము నేకభాషల నెఱింగినవారము. కావున ననేకరీతులుగా మాట్లాడ గలము. ఆర్యుఁడో! ఆర్యురాలో, చూడఁబడినాఁడో, చూడఁ బడినదో యేదైన నేమి?

వీ:— ఈ మాటల కేమిగాని నేను చూడవలసియే యున్నది. ఇది రాజాజ్ఞ. రాజుగారికి నాయందు నమ్మకము.

చం:— అయిన నాయందు నమ్మకము లేదా?

వీ:— ఏమో! అయినను నిది రాచకార్యము.

"పరిస్థితి విషమించుచున్నది. చారుదత్తునకు మాటరా వచ్చును. రాకుండఁ జేయుటకిప్పుడేమి చేయవలయును? కర్ణాట కలహము గల్పించవలయు"ననుకొని చందనకుఁడు వీరకునితో "ఓరీ! ఈచందనకుఁడు చూచినతరువాతఁ జూచుటకు నీవెవఁ డవురా?" యనెను.

వీ:— ఓరీ! నీవెవఁడవురా?

చం:— ఓరీ! వీరకా! రాజుగారిదగ్గర చనవుగలదనియుఁ బదిసార్లు వెళ్ళగలననియు గర్వించిన నీవు నీజాతి నెఱుఁగకున్నా వురా!

వీ:— నాజాతి యేదిరా?

చం:- చెప్పెడువాఁడెవఁడిక్కడ?

వీ:- నీవే చెప్పుము.

చం:- నాకేమిపని నేను చెప్పను. తత్త్వమెఱిఁగిన నే నున్నదున్నట్లు చెప్పినచో పచ్చివెలగకాయ పగులఁగొట్టినట్లుం డును. పరువుండదుగదా!

వీ:- చెప్పుము. చెప్పుము.

చందనకుఁ డెడమచేతిలో కుడిచేతి వ్రేలిని నూఱుచున్నట్లభినయించగా వీరకుఁడు "ఓరీ! సంజ్ఞతోఁ బనేమి? నోటితోఁ జెప్పు" మనెను.

చం:- చెప్పుటకేమున్నది నూఱుడురాతిని, కత్తిని, కత్తెరనుఁ బట్టుకొని తిరుగుచుఁ పాతపడిన శిరోజములను సంస్కరించు జాతి. అట్టినీవీనాడు సేనాపతివైనావు.

వీ:- ఓరీ చందనకా! నీవును నీజాతి నెఱుఁగకున్నావు.

చం:- చంద్రునివలె విశుద్ధమగు నాజాతినిఁగూడ నాక్షే పించుచున్నావుగా! చెప్పుము నాజాతియేమి?

వీ:- చెప్పెడువాఁడెవఁడిక్కడ?

చం:- నీవున్నావు! నీవే చెప్పుము.

వీరకుఁడు తప్పెట గొట్టుచున్నట్లభినయించగా చందన కుఁడు "అభినయముతోఁ బనేమి? నోటితోఁ జెప్పుమనెను.

వీ:- నీజాతి విశుద్ధమైనదే. కాకేమి? నీతల్లి భేరి, తండ్రి పటహము, అన్నగారు కరటకము. కావుననే నీవు రాజుగారి యొద్ద సేనాపతివైతివి.

చం:- ఏమి చందనకుఁడు చర్మకారుఁడని యాక్షేపించు చున్నావా! కానిమ్ము. కావలయునన్నచో నీవుపోయి బండి చూడుము.

వీరకుఁడు బండిని బరీక్షించుటకై బండి నెక్కఁబోయెను. చందనకుఁడు వీరకుని జుట్టుపట్టిలాగి క్రిందఁబడవైచి కాలితోఁ దన్నెను. తన్నులుతినిన వీరకుఁడు లేచి "తాను రాజాజ్ఞను నిర్వర్తించుచుండఁగాఁ దన్ను జుట్టుపట్టి లాగి పడద్రోసి కాలితోఁ దన్నిన చందనకునిపై నభియోగముదెచ్చి వానికిఁ దగినశాస్తి చేయించవలయు" ననుకొనుచు నిన్నేమిచేతునో చూడు మనుచు వెళ్ళిపోయెను. చందనకుఁడు "ఓరీ! కుక్కా! నీవేమి చేయఁగలవు? నీకుచేతనైనది చేసికొమ్ము. నీకు దిక్కున్న చోటఁ జెప్పికొ"మ్మనెను. తానును సేనాపతియేగదా! తన్నా చందనకుఁడింత యవమానించునా? యని యనుకొనుచు త్వరత్వరగా వీరకుఁడచటనుండి వెడలిపోయెను. చందనకుఁడు బండివానితో నిట్లనెను. "ఓరీ నిన్నెవరైన నడిగినచో చందనక వీరకులీబండిని బరీక్షించిరి"ని చెప్పుము. ఎవరైన నడిగినచో నీవీ కత్తినిఁజూపు" మని తనవద్దనున్న కత్తిని బండిలోని యార్యకుని కిచ్చి భద్రముగాఁబొమ్మని, నీకు సంపదలు గలుగుగాక! చందనకుని మఱువకుమా" యనెను. ఆర్యకుఁడును నిన్ను నేనెట్లు మఱతును? దైవకృపచే నాయోగీశ్వరుని మాటలు నిజముగావలయునేగాని చందనశీలుఁడగు చందనకుఁడు గుర్తురాకుండునా?" యనెను.

ప్రవహణము గదలిపోయెను. రాజుగారికి ముఖ్యుఁడైన వీరకునితో విరోధము దెచ్చుకొన్నందున నింకఁదాను దన

సోదరుడు శర్విలకునితోఁ గలిసి యార్యకుని పక్షమందుట మంచిదని చందనకుఁడు నిశ్చయించుకొనెను.

# ఆ ర్య కుఁ డు.

అప్పుడు చారుదత్తుఁడు మైత్రేయుఁడు వెంటరాఁగాఁ దన పుష్ప కరండకమను జీర్ణోద్యానమునకుఁ బోయెను. ఆపుష్ప కరండకమునుఁ జూడఁగనే యాతని దారిద్ర్యము కన్నులకుఁ గట్టెను. శిథిలమైన ప్రాకారము, అచ్చటచ్చటఁ జెట్లు పోవుటచే వెలితి యేర్పడిన చెట్లవరుసలు, సంస్కారములేని శిరోజముల వలెనున్న పూఁబొదలు, ప్రాకుగొయ్యలు పందిళ్ళులేకపోవుటచే నేలమీఁదనే జీరాడుచున్న తీఁగలు, రూపుసెడియున్న యాలవాలములు, కాలువలు, నిరంకుశముగా బెరిగిన కంటకవృక్షములు మొదలగునవి యాతనికిఁగొంత వేదనగలిగించినవి. ఆయుద్యానమున మధ్యగా నొక పెద్ద బావిగలదు. దానిచుట్టును దట్టముగా గడ్డి పెరిగియుండుటచే దూరమునకాబావి యొక పెద్ద బీటదిబ్బవలె నుండెను. నిట్టనిలువుగాఁ బెరిగి ధీరముగా నిలిచియున్న వృక్షములు బ్రతికిచెడినవాఁడు బోలెఁగొంత దైన్యమును సూచించుచునే యున్నవి. గాలితాఁకునకుఁగదలిన పూల తీఁగలు దమ ప్రవాళాంగుళులతో చారుదత్తు నాహ్వానించుచున్నట్లుండెను. పూలచెట్లు గొన్ని బేహారులంగళ్ళయందుఁ బణ్యవస్తువులనుఁ గుప్పలువోసికొని కూర్చున్నటుల పూల రాసులనుఁ గుప్పలువోసినవి. విక్రేతలవలె మధుకరములా

చెట్టునుండి యాచెట్టునకుఁ దిరుగుచున్నవి. అసంస్కృతముల య్యును దమరామణీయకమునుఁ బ్రకటించుకొనుచున్న శిలా వితర్దిక లందందు గలవు. అందొంకదానిమీఁద చారుదత్త మైత్రేయులిరువురు గూర్చుండిరి.

చారుదత్తుఁ డేదియో యాలోచించు చుండెను. ఏమయ్యా నీ యాలోచనమునకు నంతమున్నదా లేదా? ఎప్పుడు నేదియో విచారించుచునే యుందువే" యని మైత్రే యుఁడనెను.

చా:— మైత్రేయా! విచారించుటకేమున్నదిగాని యింతప్రొద్దెక్కినది వర్ధమానకుఁడింకను బండితోలుకొని రాలే దేమి? ఇంతతడవు వసంతసేన యేమిచేయుచుండునా? యని యాలోచించుచున్నాను.

మై:— ఉన్నదుండగా నుపరి యిదియొక విచారమువచ్చి పడినది. నీకెన్నియోసారులు చెప్పినాను నాకెందుకులే! ఆవర్ధ మానకునితో నేనను చెప్పితిని. ఆవసంతసేనమ్మగారిని త్వరగాఁ దీసికొని రారా! లంజకొడుకా! యని.

ఇట్లు వారనుకొనుచుండగనే బండితోలుకొని వర్ధమాన కుఁడు వచ్చెను. "ఆలస్యమేలచేసితి"వని మైత్రేయుఁడు వానిని నాలుగు తిట్టెను. యానాస్తరణము మరచి మరల దానికొఱకు వెళ్ళివచ్చుటతో నాలస్యమైనదని యాతఁడు సమాధానము చెప్పెను.

చా:— మైత్రేయా! ప్రవహణమునుండి వసంతసేనను దింపుము.

మై:— ఏమయ్యా! ఆమె దిగలేదా? ఆమె కాళ్ళకు సంకెలలున్నవా?

ఇట్లనుచునే యాతఁడు బండితలుపు దెఱచి చూచెను. "ఏమయ్యో! యిందులో నున్నది వసంతసేనుఁడయ్యా వసంతసేన గా"దనెను. చారుదత్తుఁడు మైత్రేయా! యిది పరిహాసమునకు సమయముగాదు. ప్రణయము కాలవిలంబనము సహింపదు. పోనిమ్ము. నేనేదించెదను లే" యనుచు బండివద్దకుఁబోయి బండిలోనికిఁజూచెను.

ఎవఁడీతఁడు? బలిసిన భుజములు, కరికరప్రకాశములగు బాహువులు, విశాలమగు వక్షస్థలము, చెంగలువలఁబోలు కన్నులు నాతని యుత్తమ పురుషలక్షణములనుఁ జాటుచున్నవి. ఇట్టివానికి దుర్గతి యేమి! కాలియందు నిగళముగూడనున్న దే యని యనుకొనుచు "ఎవఁడవయ్యా నీ"వనెను. ఆర్యకుఁడు శరణాగతుఁడను నే నార్యకుఁడను గోపాలదారకుఁడ" ననెను.

చా:— పాలకమహారాజు బంధించి చెఱసాలనుండుంచినది నిన్నేనా?

ఆ:— అవును.

చా:— విధివశమున నిచటకువచ్చి శరణాగతుఁడవగు నీవు భయపడకుము. వలసినచో నాప్రాణములనైన వదలుదునుగాని నిన్ను వదలను.

చారుదత్తుఁడు బండివానినిఁబిలిచి "ఓరీ! యీతనికాలి సంకెల నూడదీసి యీపాడువడిన నూతిలోఁ బడవేయు మనెను. వర్ధమానకుఁ డార్యకుని కాలిసంకెలనూడఁదీసి బావిలోఁ బాఱవైచెను. ఆర్యకుఁడు చారుదత్తునిఁజూచి "మహాత్మా! నీవ్

కాలిబందమూడఁదీసి (తెంపరాని హృదయబంధము వైచితి” వనుచు నమస్కరించి వెళ్లుటకు సెలవుగోరుచు బండిదిగబో యెను. చారుదత్తుఁడు “మిత్రమా! ఇంతవఱకు నీకాళ్ల సంకెల లుండుటచేఁ ద్వరగా నడువలేవు. అదియునుఁగాక రాజమార్గ మున రాజభటులు దిరుగుచుందురు. ఈబండిమీఁదనే యేఁగి నచో నెవరును నిన్ననుమానింపరు. కావున నీవీబండిమీఁదనే పొమ్ము. సుఖముగా నీమిత్రులనుఁ గలిసికొమ్ము. మమ్ము మఱువకు”మనెను. ఆర్యకుఁడు “మహాత్మా! నిన్ను మఱచుట నాహృదయమును మఱచుటేయగును. నీకన్న నాకు మిత్రు లెవరు? నన్నింతవఱకు రక్షించినది నిజముగా నీవుగాని దైవము గాద”నుచు వెడలిపోయెను.

చారుదత్తునకు వసంతసేనవిషయము జ్ఞప్తికివచ్చెను. ఎడమకన్నదరెను. హృదయము తల్లడిల్లెను. ఇంటికి బయలు దేరగా శ్రమణకుఁ డొకఁడెదురయ్యెను. మఱియొక మార్గ మున చారుదత్తుఁడింటికి బయలుదేరెను.

# దౌర్జన్యము.

## ౧

బౌద్ధశ్రమణకుఁ డొకఁడు కాషాయాంబరముల నార్వై చుకొనుటకుఁగాను రాష్ట్రీయ శ్యాలకుఁడు శకారుని యుద్యాన వనములోనికి బయలుదేఱెను. అతఁడు క్రొత్తగా సన్యసించెను గావలయును కావిగుడ్డ కట్టుకొను నేర్పుగూడనున్నట్లు లేదు. ఫాలతలమింకనుఁ దెల్లగనే యున్నది. భుజమునుండి కాషాయాంబరము జారిపోవుచుండ మాటిమాటికి సవరించుకొనుచు న్నాఁడు. పెద్దగా వయసుమీరినవాఁడునుగాఁడు. కాకున్న నేమి? సన్యసించుటకనేక కారణములుండవచ్చును. ఒంటరి వాఁడుగావచ్చును. తానాచరించిన యకృత్యములకు మనసు కలతచెంది విరక్తిగలిగియుండవచ్చును. భరింపరాని పరాభవముపైకొనగాఁ బ్రపంచముపై నీర్ష్యజనించియుండవచ్చును. అట్టి తఱినాతని హృదయమునకే మూలనో మినుకుమినుకుమను చున్న జ్ఞానదీపము నూనెబోసి వత్తిసెగఁద్రోసినటుల నొక్కమాఱుగఁ గాంతితో విరాజిల్లియుండును. నెమ్మదిగా నతఁ డేవో బౌద్ధధర్మముల నేకరువుపెట్టుచు నుద్యానవనమునుఁ జేరెను. చేరెనేగాని యేదో భీతునివలె నటునిటు జూచుచు నందలిపుష్కరిణిని సమీపించెను. ఆశకారుఁడీ బౌద్ధభిక్షుకు లనుఁ జూచినచోఁ బ్రాణములతో విడువఁడు. మున్నెవఁడో

యొకసన్యాసి వానికపరాధముచేసెనట. నాటినుండి వానికి పిరిమీఁదఁబగ. పాపమాతఁడాపుష్కరిణినిఁ జేరెనో లేదో యంతలో "ఓరీ! శ్రమణకుఁడా! ఉండుముండుమురా!" యను కేకలువినవచ్చెను. వెనుకకుఁ దిరిగిచూచెను. ఇంకెవ్వరు? ఆదుర్మార్గుఁడున్నాఁడే వాఁడే యాశకారుఁడే. ఇప్పుడేమి చేయుట? ఎవరిని శరణుఁజొచ్చుట? ఆబుద్ధదేవుఁడే శరణమును కొనుచునతఁడు ముందునకొక యడుగైన పడక యచ్చటనే నిలఁబడెను. ఆశకారుఁడు మఱల "ఓరీ! దుష్టశ్రమణకుఁడా! ఉండుముండుము. నీతల నీకత్తితో నరికెదను. నీ వెందుఁకీ యుద్యానవనములోఁ బ్రవేశించితివి? దీనిని మా బావగారు నాకిచ్చిరి. ఇచ్చటి యీపుష్కరిణిలోఁ గుక్కలు నక్కలు నీళ్ళుద్రాగును. నీరు పాడగునని నేను స్నానమైనఁ జేయనే అట్టి యీ నాతోటలోని యీపుష్కరిణిలోఁ బ్రాతయులవ గుడ్డిళ్ళ రంగుగల కాషాయవస్త్రము నుదుకుటకు వచ్చితివా?" యను చుండ నాశ్రమణకుఁడు వానిని బ్రతిమాలుకొనుచు బుద్ధదేవునకు నమస్కరింపసాగెను. శకారుఁడదివిని తన్నుఁ దిట్టుచున్నాఁ డనుకొని వానిఁదన్ని "నీవు క్రొత్తగా సన్యసించినట్లున్నావు. నీవు పుట్టినవెంటనే యేల సన్యసింపలే" దనుచు మఱలఁదన్ని వెళ్ళిపొమ్మనెను. అతఁడు వెళ్ళఁబోవుచుండగా "ఓరీ! నీవు వెళ్ళను వలదు. ఉండను వలదు. ఊపిరి పీల్చను వలదు వదలను వలదు. నీవిరీతి నిచటనే చావవలయు" నని మఱలఁ దన్న బోవుచుండగా శకారుని వెంటనున్న విటుఁడదిచూచి శకారుని మందలించి వానిని విడిపించెను. ఆసన్యాసి యెట్టులో ప్రాణములతో బయటఁబడెను.

విటశకారు లిరువురు నొక శిలావితర్దికపైఁ గూర్చుం డిరి. రెండుజాములైనది. సూర్యుఁడాకాశమధ్యమునకు వచ్చు టచేగావలయును వీధులందెవ్వరునుఁ దిరుగాడుటలేదు. పశు గణములు చెట్లనీడలందుఁ బరుండి నెమరువేయుచుండెను. ఆతపమునకు వెఱచియే గావలయును నీడగూడఁ జెట్లక్రిందకిఁ జేరెను. శకారుఁడు విటునితో "బావా! ఆవసంతసేన నాకు మఱి పునకురాకున్నది. ఆనాడు మీరందరుండుటవలన నట్లన్నదిగాని నాయందు వలపులేదందువా?" యనెను. విటుఁడదివిని "ఓరి! వీడిమొంప తెగ. ఆవసంతసేన వీని నెంత నిరాకరించినదో యంతగా వీఁడామె యందనురాగమునుఁ బెంచుకొనుచున్నాఁడు. వీడు వట్టి నీచుఁడు. నీచులు వనితలచేఁ దిరస్కృతులయ్యుఁ గామ మునుఁ బెంపొందించుకొందురు. ఉత్తములు విరక్తులగుదురు. వీనితోడి స్నేహమున నాకుఁగూడ నిందయేర్పడుచున్న" దను కొనెను. ఇంతలో శకారుఁడు "బావా! స్థావరకుఁడింకను బండి తోలుకొని రాలేదు. నాకాకలియగుచున్నది. మనకుఁగాలక్షే పముగావలయునుగదా! నేను పాటలుపాడెదను. చాల మధుర ముగాఁబాడెదను మాయమ్మ చిన్ననాడు నాకు వస, శొంఠి, బెల్లము, జీలకఱ్ఱ, యింగువ కలిపి పొడిచేసి గంధములోఁగలిపి పెట్టినది. పెద్దవాఁడనైనతరువాత నాకంఠశుద్ధికి, మాధుర్యము నకుగాను మిరియాలు, ఇంగువ పొడిచేసి నేతిలోవేచి ముద్దలు చేసి కోకిలల కఱకుట్లతోపాటు దింటిని. నాస్వరము మధురము గాకుండునా? విను" మని వెఱ్ఱివెఱ్ఱిగాఁ బాడఁదొడఁగెను. విటుఁడు "నీవు గంధర్వుఁడవే" యనెను. శకారుఁడు "బావా! నీవంటివారందరు మెచ్చుకొని తీరవలసినదే, మెచ్చుకొనక

చచ్చెదరా ?" యనెను. ఇంతలో బండి వచ్చుచున్నట్లు మ్రోత వినిపించెను. క్రమక్రమముగాఁ బండి ప్రాకారముదగ్గఱకు వచ్చెను.

---

౨

శ:- ఓరీ! స్థావరకా! వచ్చితివిరా?
స్థా:- ఆఁ! వచ్చితిని.
శ:- బండివచ్చినదా?
స్థా:- ఆఁ! వచ్చినది.
శ:- గిత్తలువచ్చినవా?
స్థా:- ఆఁ! వచ్చినవి.
శ:- నీవును వచ్చితివా?
స్థా:- ఆఁ వచ్చితిని.
శ:- అయినచో బండిని లోనికిఁ దీసికొనిరమ్ము.
స్థా:- ఏమార్గముగాఁ దెమ్మందురు?
శ:- ఆపడిపోయిన ప్రాకారముమీఁదుగా
స్థా:- బండివిఱుగును, గిత్తలుచచ్చును, నేనుచచ్చెదను.

శ:- ఓరీ! నన్నెఱుంగవా? నేను రాజశ్యాలకుఁడనుగానా? బండివిఱిగినచో మఱియొకబండి, గిత్తలుచచ్చినచో నింకొక గిత్తలజత, నీవుచచ్చినచో మఱియొకఁడు నాకు దొరకును లే.

స్థా:- మీకన్నియునుండును. నాకుమాత్రము నేనుం డను.

శ:- ఏమైనఁగానిమ్ము నీవాతోవనే బండిదీసికొని రావ లయును.

ఈసంభాషణము వినుచున్న వసంతసేనమనసు మనసులో లేదు. ఆమెమిక్కిలి భయపడెను. పొఱపాటున తానొకబండి యెక్కవలసినది మఱియొకబండి యెక్కియుండును. అదియును శకారుని బండియగుట మఱియు దురదృష్టము. ఇప్పుడు తానే మిచేయఁగలదు? దైవమునునమ్మి యూరకుండవలయును. చవిటి నేలయందు నిక్షిప్తములగు విత్తములవలెఁ దానుపడిన ప్రయాసవ్యర్థమాయెనుగదా!

స్థానరికుఁడు బండి లోనికిఁ దోలుకొనివచ్చెను. శకా రుఁడదిచూచి "యేమిరా! గిత్తలు తెగలేదు, త్రాళ్లువిఱుగ లేదు, బండిచావలేదే" యనుచు విటునితో "బావా! నీవు నాకు గురువవు, ఆంతరంగికుఁడవు, పురస్కరణీయుఁడవు గావున నీవుపోయి ముందుబండి నెక్కుము. ఆఁ-కాదు ఆగుమా గుము. ఓయిపిచ్చివాఁడా! నిన్నెక్కమంటిననుకొమ్ము, అంత మాత్రమున నెక్కటతగునా? బండినీదే కావున నీవే ముందు బండి నెక్కమని యనవలదా? నీకీమాత్రమునుఁ దెలియదే" యనుచు బండినెక్కి వెంటనే క్రిందికిదుమికి విటునికంఠము గౌఁగిలించుకొని, బావా! బావా! చచ్చితిని చచ్చితిని. బండి

మీాఁద రాక్షసియో చోరుఁడోయున్నాఁడు. రాక్షసియైనచో మనలదోచుకొనును. దొంగయయినచో మనలను మ్రింగివేయు"నని యఱచెను. విటుఁడు "ఓయీా! ఈయెండకు నీకన్ను చెదరియుండును. బండిమీాఁద రాక్షసియుండు టేమి దొంగయుండు టేమి? భయపడకు"మనెను. శకారుఁడు "బావా! కాదుకాదు! అందులో స్త్రీయున్నది చూడు"మని విటుని బలవంతముచేసెను. విటుఁడు బండిలోనికిఁజూచెను. ఎవరు? వసంతసేన. అయ్యో! శరచ్చంద్రనిభమై పులినమందుశయనించియున్న హంసనువదలి హంసి వాయసము పాలైనదనుకొనుచు "వసంతసేనా! యిది నీకుఁదగునా? నీతల్లిమాటలువిని యిట్లు యితివారేము"నెను. వసంతసేన వెంటనే "కాదుకాదు-ప్రవహణ విపర్యయమున నిట్లువచ్చితిని. శరణాగతురాలను. ఈదుష్టునిబారినుండి కాపాడు"మని బతిమాలుకొనెను. దుర్బుద్ధిచేతకు నొచ్చుకొని విటుఁడామె నెట్లైనఁ గాపాడవలయునని కొనెను. శకారునిజూచి "ఓయీా! నిజముగా నీబండియందున్నది. రక్కసియే మనమాబండి నెక్కనేల? కాలినడకనే యుద్ధ్రోవవెంట మనమిండ్లకు వెళ్లుదముర మ్మ"నెను. కాని యాతఁడామాటలు వినలేదు. బండిలోనున్నది వసంతసేనయని యెఱింగిన శకారున కామాటలెట్లు నచ్చును. వెంటనే యాతఁడామెను క్రిందకుదింపించెను. తన్నుఁగామింపు మని యామెనుఁ బ్రార్థింపసాగెను. తుదకు పాదములపైఁబడెను. ఆతని దుర్నయమునకు నలిగి కుపితయై యామె యాతనిమూర్ధమును నొకతన్నుఁదన్నెను. "తాను చారుదత్తునే కామించితిననియుఁ దనహృదయమున నాతని కే తావుగలదనియు నాతని నభిసరిం

చుటకే వచ్చితిననియుఁ జెప్పెను. అందులకా శకారుఁడు మిగుల క్రుద్ధుఁడై "యోసి! యాదరిద్రుని కామించిన నీవు నాబండి నెక్కితివేల యనుచు స్థావరకునిఁజూచి "ఓరీ! తొత్తుకొడుకా! దీనిని మనబండిమీఁద నెక్కించుకొనివచ్చినావేమిరా? నిజము చెప్పకుండి నన్నుఁ గామించివచ్చినదా లేదా"? యనియడిగెను. "అయ్యా! ఈమె బండిలోనున్నదనియే నేనెఱుఁగను. రాజమార్గమంతయు బండ్లతోనిండియుండుటచే నందులో నొక బండి చక్రము బురదలోదిగఁబడిపోగా నాబండివాఁడు సాయముచేయుమని నన్ను బతిమాలుకొనెను. వానికి సాయము చేయఁదలఁచి నేను మనబండి నాప్రక్కగనేయున్న చారుదత్తుఁడుగారి పక్షద్వారమువద్దనాపి వానికి సాయముచేసివచ్చితిని. ఇంతలో నీమె యీబండి చారుదత్తుఁడుగారిదే యని యెక్కియుండు"నని స్థావరకుఁడు సమాధానము చెప్పెను. అదివిని శకారుఁడు "ఓసీ! వసంతసేనా! నీవు ప్రవహణవిపర్యాయముచేవచ్చితివిగాని రావలయునని రాలేదన్నమాట. నీవు నాబండియెక్కినందునఁ నిన్నిప్పుడే చంపెదను చూడు"మని విటునితో "బావా! నీకు నాతోపాటు మాంసము పెట్టెదను. మంచిప్రావారకమిత్తును. నేనొకపని చెప్పెదను చేసెదవా లేదా? యనెను.

విటుఁడు:- అవియకృత్యముగానిచోఁ జేసెదను.

శ:- అకార్యమేమియుఁ గాదు

వి:- సరే చెప్పుము.

శ:- వసంతసేననుఁ జంపుము.

వి:– ఛీ! పశువా! ఆమెనుజంపుటా? ఈనగరమున కలంకారప్రాయమగునది యీవసంతసేన. కులముచేత వేశ్యయయ్యును వేశ్యావిరుద్ధ ప్రణయోపచారముగలది. చిన్నది. ఆమెయెడ నేదోసము లేదు. అట్టి యీయబలను జంపినచో పరలోకమనెడు నదిని నేనెట్లుదాటగలను?

శ:– నేను పడవచేయించియిచ్చెదనులే! అదియునుంగాక యీనాతోటలో నిన్ను జూచువారెవరు?

వి:– ఓరీ! మూర్ఖుడా! చూచువారెవరనియా? దశదిశలు, సూర్యచంద్రులు, వనదేవతలు, అనిలుండు, ధర్మము, అంతరిక్షము, భూమి, అంతరాత్మ యివియన్నియు సుకృతదుష్కృతములకు సాక్షిభూతములే.

శ:– అయినచో ముసుగువైచి చంపుము.

వి:– ఓరీ! నీచుండా? నీవిహమునకుం బరమునకుం గూడ దూరుండవు.

శకారుండు విటునిమాటలువిని వీనివలన లాభము లేదనుకొని స్థావరకునిబిలిచి ఓరీ! నీవు నేను చెప్పినదిచేసినచో నీకు బంగారు మురుగులు చేయింతును. బంగరుపీట కొనియిత్తును. నే తినగా మిగిలినదంతయు నీకిత్తును. నిన్ను జేటులకందర కధిపతి జేతునని. వాండందుల "కయ్యా! యివియన్నియుం బుచ్చుకొందునుగాని యకృత్యమైనచోం జేయ"ననెను.

శ:– ఓరీ! నేనుజెప్పుపనిలో నకృత్యపు వాసనగూడ నుండదురా! వసంతసేనను జంపుటేగదరా!

చే:— అనుగ్రహింపుఁడు అనుగ్రహింపుఁడు. ఈమెనిచ్చి టకుఁదెచ్చి యిప్పటికే పాపాత్ముఁడనైతిని. ఇంకను ఘోర కృత్యముచేయుటా ?

శ:— ఓరీ! నేను నీయధికారినిసుమా!

చే:— నాశరీరమునకేగాని నాశీలమునకుఁగాదు. ఇట్టి వాటికినే భయపడుదును.

శ:— నాచేతుఁడవైననీకు భయము దేనివలన ?

చే:— పరలోకమువలన.

శ:— పరలోకమననేమి!

చే:— సుకృతదుష్కృతముల పరిణామము.

శ:— ఆపరిణామమెట్టిది ?

చే:— మీరింత బంగారము ధరించి యజమానులగుట సుకృత పరిణామము. నేను దరిద్రుఁడనై మీబోటివారికి దాసుఁడనగుట దుష్కృతపరిణామము. ఏజన్మమందలి దుష్కృతము వలననోయింత గర్భదాసుడనైతిని. ఇంకను నీజన్మమందును, నకృత్యములుచేయుటా ? నేనుచేయలేను.

శకారుఁడు స్థావరకునిఁ దన్నెను. అయినను నతఁడందుల కంగీకరించలేదు. విటుఁడడ్డముపోయి వారించెను. లేమి గర్భ దాసుఁడైనను జేటుఁడే వానియజమానుని కన్నను త్తముఁడు. ఇంతగ దుష్కృత్యములుసేయు నిట్టియధములు నాశము చెంద రేలకో ? నిజముగా నిట్టివారిని ప్రభువులుగను, నట్టివారిని దాసులగానుఁ జేసిన యాకృతాంతుఁడు దోషపక్షపాతిగాని గుణపక్షపాతిగాఁడు. విషమబుద్ధిగలవాఁడు గాకున్నచో చేటుని శకారునిగను శకారుని చేటునిగను జేసియుండెడివాఁడు. ఆ వి

టుఁడు ధర్మభీరువు. ఈచేటుఁడు పరలోక భీరువుకావున వీరిరువురను వెడలఁగొట్టి దోచినలఁవను భయములేని శకారుఁడే యీపానికిఁ బూనుకొనెను అతఁడు చేటునిఁబిలిచి 'ఓరీ! నీకిక్కడఁ బనియేమియు లేదు గావున నీవు దూరముగాఁబొమ్మ"ని చెప్పెను. విటునిఁబిలిచి "బావా! నేనీమెనుఁ జంపను లే. భయపడినన్నుఁ గామించుచనని యట్లు టిసి. నీవుంటినయిది సిగ్గుపడుచున్నది. కావున నావలకుఁబోయి యీచేటుఁడు పాటిపోవుచున్నట్లున్నాఁడు వానినిఁ బట్టి తెమ్మని పంపివేసెను. అదినిజమేగానచ్చుననుకొని విటుఁడు వెడలిపోయెను. కానియతఁడొక చెట్టుచాటున నిలఁబడి శకారుఁడేమిచేయునో చూడఁదలంచెను. అది గుర్తించిన శకారుఁడు కొంతసేపేవో పూవుఁగోసి యీమెకిచ్చుచు నామెతో మాట్లాడుచున్నట్లు నటించెను. నిజముగా శకారుఁడు వసంతసేనను వశముచేసికొనుటకే యత్నించుచున్నాఁడనుకొనిన విటుఁ డచటనుండి దూరముగ నేగెను.

శకారుఁడు వసంతసేనను సమీపించి బతిమాలుకొనసాగెను. ఏమేమో యాసపెట్టెను. మఱల పాదములపైఁ బడెను. ఆమె యచటనుండి కొంచెము దూరమేగి నిలుచుండి "ఓరీ! నేనా చారుదత్తుని విడువనేరను. నీధనమున కాసపడు దాననుగాను. దరిద్రుఁడైననేమి కులశీలములుగల పురుషునే వనితలు వరింపఁదగును. వారకాంతలకు సైతమీసూత్రమే యనుసరింపఁదగినది. తీయమామిడి కున్నాశ్రయించిన నేను మోదుగుమొద్దు నెట్లాశ్రయింతు"ననెను. ఆచారుదత్తుఁడు తీయమామిడిగున్న. తాను మోదుగుమొద్దు. కనీసము కింశుకవృక్షమైనఁగాఁడు. ఆమె తన్నుఁదనయెదుటనే నిందించి

చాటుననున్న యాచారుదత్తుని స్తుతిపట్టుచున్నది. తాను భయపెట్టుచున్నకొలది యామె యాదరిద్రునే స్మరించుచున్నది. ఇప్పుడీ గర్భదాసినిఁ జంపినచో నాసార్థవాహుఁడడ్డుపడునా! ఆచారుదత్తుఁడేమైన దేవేంద్రుడా? వాలిసుతుఁడైన మహేంద్రుఁడా? రంభకొడుకు కాలనేమియా? ద్రోణనందనుఁడైన జటాయువా? ధుంధుమారుఁడా? త్రిశంకువా? చాణక్యుఁడా? తుదకు శివ్రుఁడునుఁగాఁడే. వీరందరొక్కపెట్టు చనుదెంచినను నిప్పుడామె కడ్డుపడలేరు. ఈతఁడు వారలలో నొక్కఁడైనఁ గాఁడు. భారతమందు సీతను చాణక్యుఁడు చంపినట్లు, జటాయువు శరాసారముతో ద్రౌపదిని వధించినట్లిప్పుడీ వసంతసేనను దానుఁ జంపవలయుననుకొనెను. వెంటనే యాతఁడామెను బలుసార్లుదన్నెను. ఆమె దీనురాలై యాచారుదత్తునే పలుసార్లు స్మరింపఁదొడఁగెను. ఆదుర్మార్గునకది మఱింత ద్వేషమునుఁ గలిగించెను. వెంటనే యాతఁడామెను బలాత్కారముగాఁబట్టుకొని క్రూరముగా గొంతు నులిమెను. స్మృతితప్పి వసంతసేన క్రిందఁబడిపోయెను. ఆసమయమునఁ దన వీరకృత్యమునకుఁ దనతల్లియుఁ దోఁబుట్టువునున్నచో నెంతగా సంతసించెడివారో కదా! యని యాశకారుఁడనుకొనెను. విటుఁడు రావచ్చును. కావునఁ దానచటనుండుట తగదని యాతఁడా ప్రదేశమునువదలి విటుఁడు వచ్చువైపుగాఁ గొంతదూరమేగి నిలఁబడెను.

---

# 3

చేటుని వెంటనిడుకొని విటుడు వచ్చెను. వచ్చుచుండగా నతనికొక స్త్రీశవము గానిపించెను. ఇట్లుచచ్చిపడియున్న దీనురాలెవరోగదా! యనియనుకొనెను. విటుఁడాతనిని సమీపించి వసంతసేననుగూర్చి ప్రశ్నించెను. శకారుఁ "డామెయిటువెళ్ళినదనియటువెళ్ళిన"దనుచు నేమేమో చెప్పెను. అతని మాటలత్యంత మాకులపాటును సూచింపగా నిజము చెప్పుమని శకారునిగద్దించెను. శకారుఁడు "బావా! నాపాదములను నీతలపైఁబెట్టి చెప్పుచున్నాను. ఆమెను స్వయముగా నేచంపితిని. అనుమానమున్న చోనటుచూడు"మని వసంతసేన పడియున్నచోటు చూపెను. అచటకువెళ్ళి విటుఁడు నేలపైఁబడియున్న వసంతసేనను జూచెను. "ఈ నాటితో నీనగగ (శ్రీ) తరలిపోయినది. ఆరతిదేవి స్వస్థానము చేరుకొన్నది. దాక్షిణ్యావాహిని యింకిపోయినద"నుకొనెను. ఈదుర్మార్గుడెంతకు సాహసించినాఁడు. ఆడుదియని యైనను వెనుకాడలేదే? ఇంతకుదిగిన వాఁడికెంతకుదిగఁడు! కావున నీతని సాహచర్యము గట్టిపెట్టుటమంచిదని నిశ్చయించుకొని విటుఁడచటనుండి బయలు వెడలెను. శకారుఁడు వెంటనే వానినిఁబట్టుకొని "యీహత్యగావించినదినీవు. ఎచటకుఁబోయెదవు? ఈవిషయము న్యాయస్థానమునకువెళ్ళి చెప్పెదను. నిలువు"మనెను. విటుఁడు "ఓరీ! నీచుఁడా! పాపాత్ముఁడవైన నీవు నన్నుఁదాకకుము. నీవిహాపవములకు దూరుఁడవు. నీసాంగత్యమికఁజాలును. పో"మ్మని విదలించుకొనుచు పోవుచుండ "బావా!

బావా! ఇన్నాళ్ళనుండి నాసహచరుఁడవైన నీకీఘనకార్యఫల మందు భాగముపంచిపెట్టకుండ నామనసూరకుండునా? రార మ్మ"ని పిలచెను. విటుఁడుమాత్ర మాతనిని, తీవ్రముగా దూషించుచు "ఓవసంతసేనా! నీవిఁక నెన్ని జన్మములందైనను వేశ్యవైజన్మించక సత్కులమందే జన్మింపు" మనుచు వెడలి పోయెను. అతఁడును నాగ్యకశర్విలక చందనకుల పక్షమందుఁ జేరఁదలఁచెను.

ఇఁక నీ శకారుని యకృత్యము నెఱింగినవాఁడు చేటుఁ డున్నాఁడు. వాఁడీయకృత్యము నెవరికైనఁ జెప్పవచ్చును. కావున వానికిఁదన యాభరణములనిచ్చి వానిని లోఁగొనవల యునని చూచెను. కాని వాఁడందుల కాసపడక యిట్టిఘోర కృత్యముచేసినందులకు శకారుని నిందించెను. వీనివలనఁ దన యకృత్యము బయటకురావచ్చును గావున వీనిని బయటతిరుగు టకు వీలులేని విధమున బంధించి యెచటనో పడవేయవలయు ననుకొని శకారుఁడు "ఓరీ! నీవీబండితోలుకొనిపోయి నాభవ నాగ్రప్రతోళికయందుండు"మని చెప్పి వానినిఁబంపెను. శకా రుఁడు మఱల వసంతసేనవద్దకు వెళ్లి యామె చచ్చినదో లేదో యని చూచెను. ఇఁకనామె బ్రతికిచెప్పునన్న భయములేదు. ఆమెపైఁదన యుత్తరీయమునుఁ గప్పఁదలఁచెను. వెంటనేయాత నికి దానిపై తనపేరున్నసంగతి గుర్తునకువచ్చి యచటబడి యున్న బండుటాకులనామెపైఁగప్పి యీదోషమెవరిమీఁద నాపాదించుటాయని యాలోచించుకొను చటఁడింటికివెళ్లెను.

కాషాయవసనములనుతికి యారవైచుకొనుటకు గాను నాబౌద్ధశ్రమణకుఁడు శకారుఁడు లేకుండుటచే శకారుని యుద్యానములోనికివచ్చెను. మట్టియంటునని వస్త్రము భూమిమీఁద నారవేయలేదు. కోతులుచూచినచో బ్రతుకనీయవుగావునఁ జెట్లకొమ్మలకుఁ గట్టలేదు. తుదకాతఁడావస్త్రమును పండుటాకులపైఁబరచి ధర్మసూక్తములఁ బఠించుచుఁ గూర్చుండెను. ఎంతపఠించుచున్నను నాతనికిఁ దనకుపకృతిమొనర్చిన వసంతసేన మఱపునకు రాకుండెను. ఇంతలోనచటఁ బండుటాకులు గదలినట్లనిపించెను. ఎండకెండి ముడుచుకొనిపోయిన యాకులు కాషాయవస్త్రపు తడికిమెత్తపడి విడులుచుండవచ్చెను. ఇంతలో నాయెండుటాకుల మధ్యనుండి బయటకుఁగన్పించెను. ఆతఁడదిచూచెను. అది స్త్రీహస్తము. స్త్రీహస్తమేగాదు. తనకుపకారము చేసినహస్తమే. దప్పికఁగొన్నట్లాహస్తము సంజ్ఞచేయఁదొడఁగెను. బావి దూరమందుండుటచేఁ దానువెళ్ళివచ్చుట కాలస్యమగునుగావున నతఁడామెపైఁదన తడిగుడ్డ కప్పివెళ్ళి నీరుతెచ్చియిచ్చెను. ఆమె కొంతతేరుకొన్నట్లు గన్పడెను. ఆమె లేచినిలుచుటకొక చెట్టుకొమ్మనందించెను. దానినాధారముగాఁజేసికొని యామె లేచి నిలఁబడెను. వసంతసేన యతనిని గుర్తించెను. ఇట్టిదుస్థితికిఁ గారణమేమని యాతఁడామెనుఁబ్రశ్నించెను. "తనకులమే కారణ"మని యామెయనెను. ఆబుద్ధోపాసకుఁడామెనుఁ దనవెంట

నిచుకొని దగ్గఱలోనున్న బౌద్ధవిహారమునకుఁ జని యచటనున్న యొక బౌద్ధసన్యాసినిచే నామె కుపచారములు చేయించెను.

---

# న్యాయస్థానము.

## ౧

శోధనకుఁ డందరికన్న ముందుగా నధికరణమండపమునకు వచ్చెను. మండపమును పరిశుభ్రపఱచి యాసనములఁ దత్తదుచితస్థానము లందుంచెను. అధికరణికులు వచ్చుసమయమగుటచే వారిరాకకై ప్రతీక్షించుచు నొకచో నిలచుండెను. నిజముగా నధికరణమండపములు నేతిబీరకాయలవంటివి. వ్యవహారమనునది యెల్లప్పుడు పరాధీనమైనది. పరుల చిత్తమును న్యాయాధికారిమాత్ర మేమి గ్రహింపఁగలఁడు? అది దుష్కరమైనది. సామాన్యముగా నధికరణమండపమునకుఁ గొనిరాఁబడు వ్యవహారములన్నియు నీతిరహితములే యయి యుండును. స్వార్థపరులగు జనులు స్వదోషమును బ్రకటించుకొనరుగదా! ఇరుదెసలవారును పరదోషప్రఖ్యాపనమునకే గడంగుదురుగదా! ఒకపక్షమువారున్నదున్నట్లే చెప్పుచున్నారనుము. రెండవపక్షమువారది నూటికి నూఱుపాళ్లు బద్ధమేయందురుగదా! లేకున్నచో తాముపీగిపోదురు. శిక్షననుభవింప

వలసివచ్చును. అంగీకరించువారైనచో నధికరణమండపమునకు వెళ్ళనేవెళ్ళరు. ఇకన్యాయవాదులు న్యాయవాదులెట్లగుదురు? తమపక్షమువారిం గెలిపించితీరవలయును. గెలుచుటకు స్వపక్షదోషనిహ్నవము, పరపక్షదోషఖ్యాపన మేతీరుగాజరుగునో యాతీరున వాదింపగడంగుదురు. అట్టివాదనలో న్యాయపరిశీలన మెంతదుష్కరము! కావున న్యాయాధికారులకు నిందయు, రాజునకుంబాపము తప్పదు. అందువలన న్యాయాధికారులు కపటగ్రహణకుశలులై యుండవలయును. అక్రోధనుండు, వక్త, స్వపరభేదరహితుండు సధర్ముండు, లోభములేని వాండే న్యాయాధికారి కాందగును. అతండు శత్రులకు గుండెలోని గాలముగను, దుర్బలులకండగను నుండవలెను. సత్యమునకు బద్ధుడై రాజభీతిరహితుండై యుండవలయును.

పుండులోని పురుగువంటి వాండగు శకారుండధికరణ మండపమువైపునకు వచ్చుచుండెను ఆతనిచూపు దమపై బడునేమోయని యెల్లరు వైదొలగుచుండిరి. ఆతండా యధికరణ మండపమును సమీపించి దానిని జూచుటతోడనే తానొడిగట్టిన పాపమును చారుదత్తునిపైం దోయవలయుననుకొనెను. ఆ చారుదత్తుండతి దరిద్రస్థితిలో నున్నవాండు గావున బంగారు నగలకాశపడి తప్పక యీపనిం జేసియే యుండును. కావున చారుదత్తుండు నగలకొఱకు వసంతసేనను గొంతుపిసికి చంపె నని తానేముందుగా వ్యవహారపత్ర మొసంగుటకధికరణ మండపమును బ్రవేశించెను. అధికరణికులున్నారు. అధికరణికుని యాజ్ఞప్రకారము శోధనకుండు వ్యవహారార్థు లెవ్వరైన నున్నారా? యని కేకవైచెనో లేదో శకారుండు "రాజస్యాల

కుఁడను, పరపురుషమనుష్యుఁడను వాసుదేవుఁడను నేనున్నా" ననెను. మొట్టమొదటనే యీతని వ్యవహారమా ! యనుకొనుచు వెళ్ళి శోధనకుఁ డధికరణికులకాతని సమాచారము తెలియఁ జేసెను. వారలు నామాటవినుటతోడనే "యీనాఁడు మొట్టమొదటగా నీతని వ్యవహారము చూడవలసివచ్చుచున్నదే" యనుకొనుచు "శోధనకా ! నీవు వెళ్లి యాశకారునితో నేడు నీ వ్యవహారము చూడరు పొమ్మని చెప్పు" మనిరి. శోధనకుఁడు వెళ్ళి శకారునితోఁ జెప్పెను. శకారుఁడు వానిని జూచి "ఓరీ ! ఈనాఁడు నావ్యవహారము చూడమను చున్నారా ? చూడనిచో వీరిపని నేను చూచెదనులే. వీరివిషయము మా బావగారితో, మా అక్కమగనితో, అనగా రాజుగారితో, మా అక్కతోడను మా అమ్మతోఁగూడఁ జెప్పి యీ యధికరణికుల స్వస్తిచెప్పింతును. క్రొత్తవారినిఁ దెప్పింతును చూడు" మనుచు వెళ్లబోవుచుండ శోధనకుఁడు వెళ్ళి యాశకారుని మాటలనా యధికరణికులకు నివేదింప వారును భయపడి వెంటనే నీవ్యవహారము విచారింతుము రమ్మని శకారుని లోనికిఁ బిలిపించిరి. ఈయుద్యోగులందరు దన్నుఁ జూచి భయపడినారు. ఇంతకు ముందుగా నీ వ్యవహారము చూడమని చెప్పి యిప్పుడే విచారింతుమను చున్నారు. కావునఁ దానేదిచెప్పిన వారిచే నంగీకరింపజేయులేను? వెంటనే శకారుఁడు లోనికిఁ జనెను. "నాకును మీకును సుఖమగుఁగాక ! ఆఁ మీకెందుకులే సుఖము నాకే సుఖమగుఁగాక" యనుచు నేనిక్కడ కూర్చుండునా ? యిక్కడ కూర్చుండునా ? యని వారివైపు వీరివైపుఁజూచి యిక్కడఁ గూర్చుండును లేయని యధికరణికుని శిరముపై చేయి పెట్టి

తునకు క్రిందగూర్చుండెను. వానిని జూచి యధికరణికుఁడు "ఓయీ! నీవు కార్యార్థివైనచో నట్టి కార్యమేమిటో యా నుడువు" మనెను. శకారుఁడు వానిచెవిదగ్గఱ చేరి నేను మల్లక మాత్రంబగు వంశంబున జన్మించిన వాఁడను. పాలక మహారాజునకు మాతండ్రిగారు మామగారు. మాతండ్రికి పాలక మహారాజు అల్లుడు. నేను రాజుగారి బావమఱిదిని. రాజుగారు మాఅక్కగారికి పెనిమిటి"యనెను. ఇదంతయు నిజమే కాని నీవువచ్చినపని యేమో తెలుపుమని యధికరణికుఁడనెను. శకారుఁడు "ఇదిగో! చెప్పుచున్నాను. వినుఁడు. నేనేమి తప్పు చేసినను నన్నుమీరేమియుఁ జేయలేరుగదా! నన్నుఁజూచి సంతుష్టుఁడైన మాబావగారు నేను క్రీడించుటకు రక్షించుటకుఁగాను సర్వోద్యానవనములకెల్ల దలమానికంబనదగు పుష్పకరండక జీర్ణోద్యానమును నాకిచ్చెను. నేను దానిని జూచుటకు నెండబెట్టుటకుఁ జడపులకు పుష్పములగోసి చిగురు త్రుంచుటకుఁగా ననుదినమును నచటకు వెళ్లుచుందును. దైవయోగమున మొన్న నచట నొక స్త్రీ శవమునుఁ జూచితిని. లేదు లేదు చూడలేదు.

అధి:— ఆమె యెవరో నీకు తెలియునా?

శ:— ఎఱుఁగ కేమి? ఈనగరమున కలంకారభూతురాలగు వసంతసేన నెఱుగనా? ఆమెయే. నగలకొఱకై యామె నెవఁడో దరిద్రుడు వివిక్తమగు పుష్పకరండోద్యానమున గొంతుపిసికి చంపినాఁడు. నేనుగాదు.

అధి:— శ్రేష్ఠికాయస్థులారా! నేనుగాదను పదములు ముందు వ్రాసికొనుఁడు.

శకారుఁడు వేడిపాయసము మ్రింగినవానివలెఁ దనప్రాణ ములమీఁదకుఁ దెచ్చుకొన్నందుకు విచారపడి "నేనుచూచితి నని చెప్పఁబోయితినని శ్రేష్ఠికాయస్థులు వ్రాసినదానిని దనకాలితోఁ జెఱిపివైచెను.

అధి:— పగలుగాఱకామెను గొంతుపిసికి చంపెనని నీకెట్లు తెలియును?

శ:— మెడవాచియున్నది. ఆభరణస్థానములు శూన్యములైయున్నవి.

ఈవ్యవహారము వసంతసేనతల్లికి సంబంధించియుండు టచే నధికరణికు లామెను బిలువఁబంపిరి. శోధనకుఁడు వెళ్లి వసంతసేనతల్లిని వెంటనిడుకొనివచ్చెను. యౌవనసుఖ మనుభ వించుటకు చారుదత్తునింటికివెళ్లిన వసంతసేన యింతదనుక రా కుండుటయు నధికరణికులు న్యాయస్థానమునకుఁదన్నుఁ బిలువ నంపించుటయు నామెమనస్సును గలవరపఱచినవి. ఆమె న్యాయస్థానమునకు రాగానే యధికరణికు లామె కుచితస్థాన మొసంగిరి.

అధి:— ఏమమ్మా! నీవు వసంతసేన తల్లివా?

వృ:— అవును.

అధి:— ఇప్పుడు వసంతసేన యెచటనున్నది?

వృ:— మిత్రగృహమున నున్నది.

అధి:— ఆమిత్రుని పేరేమి?

వృ:— అయ్యా! ఇదిమీరాబోటివారడుగదగినదిగాదు.

అధి:— అడుగుచున్నది మేముగాదు వ్యవహారము.

వృ:— వ్యవహారమైనచోఁ జెప్పకతప్పదుకదా! అతఁడు

సార్థవాహవినయదత్తుని మనుమఁడు, సాగరదత్తుని పుత్రుఁడు ఆర్యచారుదత్తుఁడు. ఆతఁడు శ్రేష్ఠిచత్వరమునం దుండును. నాకూతురు యౌవనసుఖమనుభవించుటకై యాతనికడకేగెను.

శ:— ఆమాట వ్రాసికొనుఁడు. ఆ చారుదత్తునిమీఁదనే నా పగ.

శ్రేష్ఠి కాయస్థులు — చారుదత్తుడు మిత్రుఁడట. ఇందు దోస మేమున్నది?

అధి:— ఈ వ్యవహారముతోడ చారుదత్తునకును సంబంధము గలదు గావున నాతనిని బిలిపింపవలయును.

చారుదత్తునిగూడ న్యాయస్థానమునకు రప్పింప వలసి వచ్చినందుల కధికరణికులు విచారపడిరి. అందుఁ దనుదోస మేమున్నది? వ్యవహారమే యాతనిని రప్పించుచున్నది. వెంటనే చారుదత్తుని సగౌరవముగాఁ దీసికొనిరమ్మని శోధనకుని బంపిరి. శోధనకుఁడు వెళ్ళి చారుదత్తుని వెంటనిడుకొనివచ్చెను. అవంతీ నగరమునఁ దన కులశీలము లెఱుంగనివారెవ్వరును లేరు. అట్టియెడ నీయధికరణికులకుమాత్రము దనవిషయము దెలియదా? తెలిసియుండియువారు దన్నధికరణ మండపమునకుఁ బిలిపించు చున్నారేల? ఇన్నాళ్ళుగా దాని మొగమైనఁ దానెఱుంగఁడే. సంకెళ్లు త్రెంచుకొని పాఱిపోవుచున్న గోపాలదారకు డార్యకుఁడు తనబండిపై నెక్కఁగాఁ దాను వానిని రక్షించెను. ఈ విషయము నెట్టులో గ్రహించిన చారు లెవరేని ఈ విషయమును రాజునకుఁ దెలిపియుందురేమో? ఏల యీ విచారము? అధికరణ మండపములోనికే పోవుచున్నానుగదా యనుకొనుచు చారుదత్తుఁ డధికరణమండపమునుఁ బ్రవేశించెను.

తా నింటినుండి బయలుదేరినప్పటినుండి యన్నియు దుశ్శకునములే తోఁచినవి. ఏదో యాలోచించుచు నధికరణమండపమును బ్రవేశించుచున్న చారుదత్తుని తలకు గుమ్మము తగిలెను. ఇచ్చటఁగూడ దుశ్శకునమేనా! అధికరణికు లార్యచారుదత్తుని జూచిరి. సుందరములై విశాలములైన నేత్రములు, ఉన్నతమైన నాసిక, విశాలమైన వక్షస్థలము, ఆజానులంబి బాహుద్వయముతో నొప్పారుచున్న యీతం డపరాధియనుట యెట్లు? సల్లక్షణంబులుగల యేనుఁగులు, గుఱ్ఱములు, గోవులు, మనుజులు దుష్టులెట్లగుదురు? అధికరణికులు చారుదత్తునకు స్వాగతము చెప్పి యుచితాసనమునొసంగిరి. చారుదత్తున కాసనమొసంగినందులకు శకారుఁడుమండి "ఓయీ! మీరీ స్త్రీఘాతకున కాసనమిచ్చుచున్నారుగా! కానిండు కానిండ" నెను.

అధి:- ఆర్య చారుదత్త! ఈ ముదుసలి యొక్క కూతుతో నీకేమైన సంబంధమున్నదా?

వసంతసేన తల్లినిజూడగనే చారుదత్తుఁడామెకు నమస్కరించెను. ఆమె యాతని నాశీర్వదించెను. ఆమె మున్నెన్నఁడును నార్యచారుదత్తునిజూచి యెఱుఁగదు. ఈనాడతనిని జూచి తనకూతు నదృష్టమునకు సంతసించెను. కాని యీ విప్లవమేమి?

అధి:- నీకు వేశ్యతో మైత్రిగలదా?

చారుదత్తుఁడు తలవంచి తానీమాట నలుగురిలో చెప్పుటా చెప్పకపోవుటాయని యాలోచించుచున్నట్లుండెను. ఇంతలో శకారుఁడు "ఓ శ్రేష్ఠికాయస్థులారా! ఈ చారు

దత్తుఁడు భయమువలనను సిగ్గువలనను చెప్పక దాచుచున్నాడు. ధనముకొఱకా వసంతసేన నీతఁడే చంపినాఁడనెను.

శ్రే-కా:- ఓచారుదత్తా! సిగ్గుపడెదవేల? ఇది వ్యవహారము.

చా:- ఓయధికరణికులారా! నేనెట్లు చెప్పుదును గణిక నాకుమిత్రమని? ఈ గణికాప్రసంగము యౌవనకృత దోసము గాని చరిత్రకృతముగాదు.

అధి:- ఇది వ్యవహారము. ఇందన్నియు నాటంకములే. హృదయమందలి సిగ్గువదలి నిజము చెప్పుము. వ్యవహారమడుగుచున్నదిగాని మేముగాదు.

చా:- నాకెవ్వనితో వ్యవహారము!

శ:- నాతో.

చా:- నీతోడి వ్యవహారము చాల దుస్సహము.

శ:- ఓరీ! స్త్రీహంతకుఁడా! ఆవసంతసేనను ఆభరణములకొఱకై చంపి తెలియనివానివలె నటించుచున్నావే.

చా:- నీవు నట్టి యబద్ధములాడువాఁడవు.

అధి:- చారుదత్తా! నీకు వానితోఁ బనియేమి? నిజము చెప్పుము. నీకా వేశ్యతో స్నేహమున్నదా? లేదా?

చా:- అవును. ఉన్నది.

అధి:- ఇప్పుడావసంతసేన యెక్కడనున్నది?

చా:- ఇంటికివెళ్ళినది.

శ్రే-కా:- ఎట్లువెళ్లినది? ఎవరివెంట వెళ్లినది? ఎప్పుడు వెళ్లినది?

చారుదత్తుఁడాలోచించుచు నిలఁబడెను. త్వరగాఁ జెప్పు మని శ్రేష్ఠికాయస్థులు తొందరపెట్టిరి.

చా:- ఆమెయింటికేగినది. ఇంకేమి చెప్పుదును.

శ:- "నీవు నాపుష్పకరండకజీర్ణోద్యానమునకు వసంత సేనను దీసికొనివచ్చి ధనముకొఱకు కామెను గొంతు పిసికి చంపి యెఱుఁగనివానివలె బ్లీమేమో పలికెదవే" యనెను. చారు దత్తుఁడు "ఓరీ! హేమంతమందలిపద్మమువలెనున్న నీమోము నీవాడుచున్న యబద్ధమును సూచించుచు నేయున్న" దనెను. చారుదత్తునియందు దోషారోపణ చేయుట యద్రిరాజును తూచుటవంటిది. సముద్రమును దాఁటుటవంటిది. గాలిని పట్టుటవంటిదని యధికరణికుల భావము. ఆర్యచారుదత్తుఁడీ యకార్యమేల చేయును? ఎవనియీగికి సముద్రము సలిలమా త్రావశిష్టమయ్యెనో యట్టి సకలసద్గుణనిధియగు నామహా త్ముఁడు ధనమునకాసపడి యింతటి యకార్యాచరణమునకు గడంగునా? యని వారనిరి. వారిమాటలు విన్న శకారుఁడు "ఓహో! అధికరణికులారా! మీరీవ్యవహారమున పక్షపా తముచూపుచున్నారు. తెలిసికొన్నాను లెండ" నెను. వసంత సేనతల్లి యాశకారునిజూచి "ఓరీ! నిర్దయుఁడా! ఈమ హానీయుఁడు దనదగ్గఱ దాచఁబడిన సువర్ణభాండమును దొంగ లెత్తుకొనిపోగా దానికి మాఱుగా చతుస్సముద్ర సారభూత మగు రత్నావళినర్పించెను. అట్టి యీతఁడేమిటి దరిద్రకారణ ముగా నీయకార్యాచరణమునకు నొడిగట్టుటేమిట" నెను.

అధి:- చారుదత్తా! ఆమె నడచివెళ్లినదా? బండి మీఁదవెళ్లినదా?

చా:- ఆమె యెట్లు వెళ్లినో నేనుచూడలేదు.

ఇంతలో నధికరణమండపమునద్దకు వీరకుడు వచ్చెను. అతడు చందనకునిచేత జుట్టుపట్టియీడ్వబడి కాలితన్నులు దిని యవమానితుడై యింటికివెళ్లెను. చందనకునియెడ మొల కెత్తిన శత్రుభావము చెట్టుగట్టెను. దానికిదగిన ప్రతీకారము సేయవలయును. లేనిచో దాను వీరకుడెట్లుకాగలడు? ఆప్రతీకారమేరీతిగా జేయవలయును? తానొంటిగా జేయలే డనువిషయము తేటపోయెనుగదా! లేక తనపక్షము వారెవరైన సమర్థులుండిరా? తనకొకపక్షమనునదియే లేదాయెను. తానే చందనకుని పక్షమూయెను. అట్టి చందనకునితో విరోధమేర్పడినది. వీరకుడు దన పగతీర్చుకొనుట కొక్కటే మార్గమున్నదనుకొనెను. చందనకుడు రాజద్రోహమాచరించెను. అదియును సామాన్యమైనదా? పాలకమహారాజిక నుండుటా పోవుటా యను విషయమునకు సంబంధించినది. కావున నిట్టియెడ మోసమునకుతలపడిన చందనకుని నధికరణికు లుపేక్షింతురా! వారుపేక్షించిరే యనుకొనుడు పాలకమహారాజునకు దెలిసినచో "సహేంద్రదక్షకాయ స్వాహా" కాకుండునా? కావున దానివిషయమును నధికరణమండపమున నివేదింపవలయుననుకొని పండుకొనెను. పండుకొనెనే గాని నిద్రపట్టలేదు. వీరకునకు దెల్లవారుటెట్లో తెలియలేదు. నాలుగైదుసారులింటిలోనుండి బయటకువచ్చి యాకసముదంకజూచెను. ఇంకజాముప్రొద్దున్నది. తుదకెట్లులో తెల్లవారెను. తెల్లవారెనే గాని యధికరణమండపము తెఱవవలయునుగదా. నిముసమొక్క యుగముగా గడచుచున్నది. అధికరణమండ

పము తెలిచినకొంతసేపటి కాతఁడు వచ్చెను. లోన రాజుగారి బావమఱది శకారుని వ్యవహారమేదో నడచుచుండెను. తాను లోనికి వెళ్లుటా మానుటా ? వెళ్లినచో నా దుర్మార్గుఁడు తన మీఁదఁ బడునేమో; వెళ్ళకున్నచో నెంతకాలము ప్రతీక్షించు చుండవలయునో. తుదకాతఁ డెట్టులో ధైర్యముదెచ్చుకొని లోనఁ బ్రవేశించెను. అధికరణికులకు నమస్కరించి నిలుచుం డెను. నగరరక్షణాధికృతుఁడగు వీరకుఁ డేలవచ్చెనో యను కొని యధికరణికుఁడు "ఓరీ ! వీరకా ! నీవువచ్చిన పనియే మని" యడిగెను.

వీ:- అయ్యా ! కారాగారమునుండి తప్పించుకొని పోయిన యార్యకుని వెదకుటకై నియుక్తులమై చందనకుఁడు నేనును నొకచో రాజమార్గమున నుంటిమి. అట్టితఱి నొక పెట్టెబండి కాన్పించెను. దానినాపితిమి. చందనకుఁడాబండి నెక్కి యిందులో నార్యకుఁడు లేడులెమ్మనెను. అయినను నేనుగూడ జూతునని నేనంటిని. నేను జూచితినిగావున నీవు చూడనక్కఱ లేదని యాతఁడు నన్ను వారింపఁజొచ్చెను. కాని నాకు జూడ వలయునను తలంపు ప్రబలమయ్యెను. వెంటనే నేనాబండి నెక్క బోయితిని. ఎక్కుచున్న నన్నాతఁడు జుట్టుపట్టి లాగి క్రిందఁ బడవైచి మొద్దువంటి తన కాలితో తన్నెను. తఱువాత తమ చిత్తము.

అధి :- వీరకా! ఆ పెట్టెబండి యెవరిదో తెలియునా?

వీ :- ఆఁ తెలియును. ఈ యార్యచారుదత్తునిదే. అందు వసంతసేన యున్నదనియు నాతొ చారుదత్తుఁడుగారి

యుద్యానవనమునకుఁ గొంపోబడుచున్నదనియు బండివాఁడు చెప్పెను.

శ :- విన్నారాయిది! వ్రాసికొనుఁడు వ్రాసికొనుఁడు. అధికరణికుఁడు వీరకునివైపుజూచి వీరకా! నీవ్యవహారము తఱువాత విచారింతుముగాని నీవు వాకిటఁ గట్టివేయఁబడియున్న మాగుఱ్ఱమెక్కి వెళ్ళి శకారుని యుద్యానవనమున స్త్రీశవ మేదేని యున్నదేమో చూచిరమ్మ" నెను. పండువెన్నెల కాయు చంద్రుని రాహువు కబళించునటుల, నిర్మలములగు సలిలముల నొడ్డు విఱిగిపడి మలినముల నొనర్చునటుల నీ శకారుఁడు చారుదత్తునిపై నీయభియోగముదెచ్చెను. వీరకుఁడు తిరిగివచ్చెను. అతఁడు దానచట నొక స్త్రీశవమును జూచితి ననెను. "అదిస్త్రీశవమని నీవెట్లు గుర్తించితి"వని వారతని నడిగిరి. "అయ్యా! దానిని కుక్కలు నక్కలు పీకి పారవైచినను పెద్ద కేశపాశము ఆభరణ చిహ్నితములగు మిగిలియున్న కొన్ని యవయవ విశేషములచేతను దెలిసికొంటినని వీరకుఁడనెను. చారుదత్తుఁడపరాధియనుటకే యవకాశ మేర్పడుచున్నది. అతఁడు హంతకుఁడవునో కాదో చూచినదెవరు? ఎవఁడో యభియోగము దెచ్చెను. ఎవఁడో యేమి? రాజస్యాలకుఁడే. ఆ యభియోగమునకు బలముగూడనున్నది. చారుదత్తుఁడు గుణవంతుఁడే యేమిలాభము? దరిద్రుఁడుగదా! అతని మాట నిజమనువాఁడెవఁడు? దరిద్రుఁడు ధనమున కాస పడకుండునా? అధికరణికులు సాక్ష్యము ననుసరించి తీర్పు చెప్పవలసినదే. కాదని చారుదత్తుని గుణశీలములనుబట్టి, పూర్వపు ప్రతిష్ఠనుబట్టి నిరపరాధియనియే యుందురుగాక పైన

రాజున్నాఁడుగదా? చారుదత్తుఁడెట్లు తప్పించుకొనును! అతి కుటిలము, అతిదుష్టము నైనది యీవ్యవహారనీతి. ఆలోచించిన కొలఁది బుద్ధి బురదలో దిగఁబడ్డ యావువంటిదగును.

అధి:— ఆర్యచారుదత్త! నిజముచెప్పుము.

చారుదత్తుని మన మాలోచనా నిమగ్నమయ్యెను. ముఖచంద్రుని విచారమేఘములు క్రమ్ముకొన్నవి. రాగాంధుఁడైన జనుఁడు పరగుణమాత్సర్యముచే పరహింసలకుఁదలపడి యసత్యమునే పలుకును. అతఁడాడిన దెల్ల విచారింపక విశ్వసింపదగునా? పూచిన తీఁగనువంచి పూలుగోయుటకు చేతులురాని చారుదత్తుఁడు స్త్రీహింసకుఁ బూనుకొనునా? కోదమ తుమ్మెదల ఱెక్కలవంటి కేశపాశము పట్టిలాగి గొంతు పిసికి చంపువాఁడెంతనిర్దయుఁడు గావలయును? అధికరణమండపము కొంతసేపు నిశ్శబ్దముగానుండెను. అంతలో శకారుఁడు "ఓహో మీరీవ్యవహారమునఁ బక్షపాతము చూపుచున్నారు. కాకున్నచో చారుదత్తుఁడింకను నాసనమును వీడఁడేమి?" యనెను. అధికరణికుఁడు శోధనకునివైపుజూచెను. శోధనకుఁడు చారుదత్తునిదగ్గఱకు వచ్చుచుండెను. చారుదత్తుఁడాసనమునుండి లేచి క్రింద గూర్చుండెను. చారుదత్తునకు మైత్రేయుఁడు జ్ఞప్తికివచ్చెను. సతీసుతులు స్మరణకువచ్చిరి. వారందరచటకు వచ్చి మాత్రమేమి చేయఁగలరు? వేదన రెట్టింపయ్యెను.

మట్టిబండితో నాడుకొనుట కిష్టములేక తనకు బంగరు బండియే కావలెనని మారాము చేయుచున్న రోహసేనునకు బంగారుబండి చేయించుకొమ్మని వసంతసేన తననగలన్నియు నిచ్చెను. ఈసమాచారమును విన్న చారుదత్తుఁడవి పుచ్చుకొనుట తగదని మైత్రేయునిబిలిచి "ఓయీ! యీనగలు వసంతసేనవి. వీనినామె మనరోహసేనునకు బంగారుబండి చేయించుకొమ్మని యిచ్చివెళ్లినదట. మనకుచేతనైనచో నామె కీయవలెను గాని యామెయిచ్చుట, మనముపుచ్చుకొనుట తగదు. కావున నీవువెళ్లి యామెనగలనామెకిచ్చిర"మ్మని చెప్పి పంపెను. ఆనగలనాతఁడు దీసికొనిపోవుచు నెందులకో కొంతవడవాలసించెను. ఆతడింకను వసంతసేనయింటికి జేరలేదు. త్రోవలో శేభిలుఁ డగపడి యధికరణ మండపమునకు చారుదత్తుఁడు పిలువఁబడెననియు నాతఁ డధికరణమండపమున కేగెననియుఁ దెల్పెను. ఎన్నడు నధికరణమండపము మొగమే యెఱుఁగని చారుదత్తుఁడీ నా డధికరణికులచేఁ బిలిపింపఁబడుటకుఁ గారణమసాధారణమైనదే కావచ్చునని నిశ్చయించుకొని మైత్రేయుఁడటువెళ్లువాఁ డిటుతిరిగి సరాసరి యధికరణమండపమున కేవచ్చెను. మైత్రేయుఁడు చారుదత్తునిజూచి కుశలప్రశ్నముగావించెను. కాని యన్నియు ననసందిగ్ధపు సమాధానములే. అతఁడేదో యుద్విగ్నుఁడైయున్నట్లు కానంబడెను. మైత్రేయుని మనసు మనసులో లేదు.

చారుదత్తునిజూచి "మిత్రుఁడా! నీవే నాడీ యధికరణ మంటపమునకు రాఁగారణమేమని" యడిగెను. "మైత్రేయా! నేనేమని చెప్పుదును? పరలోకమునకుఁ గూడ వెలువక ధనము నందాసచే రతిదేవివంటి వనితనొకతెను జంపితినని యీతఁడు నామీఁద నభియోగము దెచ్చె"నని చారుదత్తుఁడు శకారుని జూపించెను. మైత్రేయునకు బట్టరాని యాగ్రహము గలిగెను. అతఁడా దుర్మార్గునిజూచి "ఓరీ! లంజకొడక! రాజస్యాలక! పాపమునకు వెఱవక పరులమీఁద దోసములఁ బడవేయు దుష్టుఁడ! బంగారు నగల నలంకరించుకొనిన మర్కటమా! నాసమక్షమునఁ జెప్పుమురా! పేటలు, కోటలు, విహారములు ఆరామములు, దేవాలయములు, తటాకములు, కూపములు, మొదలైన వానిచే నీయవంతీనగరము నలంకరించినమహానీయుఁ డైన యీ చారుదత్తుఁడు ఈ నాఁడు దరిద్రుఁడేయగుఁగాక! ధనాశచే నింతటి యకృత్యమునకుఁ దలపడునా? పూచిన మాధవీ లతను సైతము పల్లవచ్ఛేదముగ నేమో యని వంచి పూలుగోయని దయాశాలి నాప్రియమిత్రుఁడీ యకార్యమొన రించి యిహపరములకు దూరుఁడగునా! ఓరీ! తారుపుగత్తె కొడుక! నిలువుమురా! నీ హృదయమువలెఁ గుటిలమగు నాదుష్టకర్రతో నీబుర్ర వేయిముక్కలుగాఁజింతు"ననుచు శకారుని గొట్టెను. శకారుఁడు మైత్రేయుని గొట్టెను. తుదకు ముష్టియుద్ధముగాసాగెను. ఈగడబిడలో మైత్రేయుని చంకలోనున్న నగలమూట జారిక్రిందఁబడెను. శకారుఁడా మూటనుదీసి విప్పిజూచెను స్త్రీయలంకారములు. అతనికి

గొండంత యాధారము జిక్కెను. వెంటనే యానగలను నధికర ణికులకుఁ జూపుచు "చూచితిరా! యీనగలు. ఈనగలకొఱకే చారుదత్తుఁడా వసంతసేనను జంపినది. ఇవి యామెవే" యనెను. అధికరణికులుచూచి తలవంచుకొనిరి.

చారుదత్తుఁడు మైత్రేయునితో "మిత్రుడా! యీసమయమున నీనగలమూట నీచంకనుండి జారిపడుటయు నాదుర దృష్టమే. నీవు వసంతసేనకీయకుండ నిచటకేలవచ్చితివి? నిన్నననేల? నా దురదృష్టమే నన్ను గోతిలోబడవేసిన" దనెను. మైత్రేయుఁడు "ఓయీ! అట్లుభయపడెదవేమి? నీవేపాపము నెఱుగవు. నిన్నెఱుఁగనివారెవరు? ఉన్నదున్నట్లు నిజముజెప్పుము. నీమాటనమ్మకుందురా? నీవేమియు మాటలాడకున్న నీవు నిరపరాధివని వారంమరాయేమి? దైవము తెచ్చునది కొంత మనము తెచ్చుకొనునదికొంత. బాగున్నదిలే. సాక్ష్యముపలుకు వాఁడను నేనుంటినిగా భయమెందుకయ్యా" యనెను. చారుదత్తుడు "మైత్రేయా! దోషదుష్టమైన నృపతినేత్రము తత్త్వము నెట్లెఱుంగును? చెప్పెదముపో! మనమొఱ యాలకించువాడెవఁడు? లాభము లేదు. నాకీనిమిత్తముగా దైన్యమగు మరణము తప్పదు. మరణమన్నను నాకు కష్టము లేదుగాని స్త్రీ ఘాతకుఁడను మాట బాధించు చున్న" దనెను.

శ్రేష్ఠికాయస్థులు వసంతసేన తల్లినిజూచి "యోముసలిదానా? నీవీ నగలను శ్రద్ధగా బరిశీలించి యివి నీ కొమరిత వసంతసేనవేనేమో చెప్పు" మనిరి. అమె యివి నాకూతురు నగలంటివేకాని యవిమాత్రముగా" వనెను. శకారుఁడు "ఓసీ! ముసలి లంజె! కన్నులతో నవునని నోటితోఁ గావనుచున్నావా?"

యని యేమేమో పిచ్చిగాఁ దిట్టెను. ఆమెయు నాతనిని మఱలఁ దిట్టెను.

శ్రే-శా :- ఓ ముసలిదానా! తొందరపడక సరిగా బరిశీలించి యవునో కాదో చెప్పుము.

ము :- ఈ నగల పనితనము నాదృష్టి నాకర్షించు చున్నదే కాని యివి యవిగావు. పనివాఁడొక్కఁడే యయి యుండవచ్చును.

నిజమే. భేదమెఱుంగ రానిరీతిగానగలనుఁ జేయఁగల శిల్పు లుందురు. వస్తువునుబోలిన వస్తువు, రూపమునుబోలిన రూప ముండకుండునా? అధికరణికు లానగలు చారుదత్తునివే నేమో యని చారుదత్తుని ప్రశ్నించిరి. చారుదత్తుఁడవి తనవి కావ నియు వసంతసేనవేయనియుఁ జెప్పి యానగలు దనయింటినుండి కొనిరాఁబడుచున్నవనియు నవి తన యింటివద్దనుండుటకుఁ గల కారణమును జెప్పఁజాలఁడయ్యెను. ఆతని తడబాటుఁగనుంగొని వారు చారుదత్తుని "చారుదత్తా! నీవునిజము చెప్పుము. లేకున్న నీ సుకుమారదేహము దారుణకశాఘాతములకు గుఱికావలసి వచ్చు"నని హెచ్చరించిరి. చారుదత్తుఁడు కొంతసేపటివఱకు మౌనమువహించి యూరకుండెను. అతనివదనమున విషాద రేఖలు పొడమెను. అతఁడు క్రుంగిపోయెను. మాట్లాడుట కాతఁడెంతయో ప్రయత్నించుచు నేయుండెను. కానిమాట గొంతుకనుండి వెడలుట లేదు. ఎట్టులో యీమాటలుమాత్ర మాతనినోటినుండి వెలువడెను. "అధికరణికులారా! నాపూర్వు లందరు పుణ్యాత్ములని పేరుపడసిరి. నేనును వారివంశమందుఁ

బుట్టితినని నేనెఱుంగుదును. ఆయెఱుకగల నేను పాపమెట్లా
చరింతును? పాపమేయెఱుంగని నన్ను బాపాత్ముఁడందురేని
నేనుఁ జేయఁదగిన దేమియు లేదు. అయినను నావంశాదికప్రసక్తి
తోఁబనియేమి? ఇదిగో! చెప్పుచున్నాను వినుఁడు. ఉభయ
లోకదూరుఁడనై సిందఱఁబొల్చెడి నేను స్త్రీరత్నమగు వసం
తసేనను పుష్పకరండోద్యానమున—చంపితిని పైవిషయ మాతఁడు
చెప్పెనని శకారుని జూపించెను. వెంటనే శకారుఁడు
"చంపితి"ననెను. శకారుఁడధికరణికులనుజూచి మీరలేవింటిరి
గదా! చారుదత్తుఁడు వసంతసేనను జంపెనని తేలినదిగావున
నిక విచారింపవలసిన దేమున్నది. త్వరగా వీనికిశిక్ష విధింపుఁడని
కేకపెట్టెను. అధికరణికులు మౌనము వహించిరి. చారుదత్తుఁడు
నిరపరాధియని యంతరాత్మయెంత ప్రబోధించుచున్నను ప్రబ
లములగు బాహ్యోపకరణములు వ్యతిరిక్తములై ప్రత్యక్షము
లగుచుండ వారేమిచేయఁగలరు. వారాతనికి శిక్షవిధించియే
తీరవలయును. అధికరణికులు చారుదత్తునకు మరణదండన
మును విధించినట్లు వినిపించిరి. ఆమాటలువిని వసంతసేనతల్లి
"అయ్యా! వ్యవహారము వాదిప్రతివాదులది గదా. వాదినైన
నేను కోరుచున్నాను. ఈచారుదత్తుని విడువుఁడు. నా కూతురు
చచ్చిపోయినను నేను విచారించుటలేదు. ఈమహానుభావుని
మాత్రము విడిచిపెట్టుఁడని బ్రతిమాలెను. వారలామెమాటలు
వినిపించుకొనలేదు. వారుచారుదత్తుని రాజభటుల వశము
చేసిరి. శోధనకుని బిలిచి "ఓరీ! తుదినిర్ణయము రాజుగారిది
గావున నీవు వెళ్లి రాజుగారితో నిట్లు విన్నవింపుము. విప్రుఁడు
పాతకియైనచో వానిని దేశమునుండి వెళ్లగొట్టవలయునేగాని

చంపరాదని మనువుచెప్పెను. కావున మీరలీ చారుదత్తుని వ్యవహారము పర్యాలోచనచేయుచుంసియున్నదని, ఈజగమందు కుందేటికొమ్ము కన్నారఁగాంచితిమన్న వాదనచేయఁగలవారుం డవలయునేగాని వారివాదమును నమ్మవలసిన యిట్టి యీన్యాయాధికారులచే పాపమెందరో నిరపరాధులు చంపఁబడిరి. చంపఁబడుచున్నవారు. చంపఁబడుదురు.

శోధనుఁడువచ్చి "ధనమందాసచే నాదరిద్రుఁడే వసంతసేనను జంపియుండును గావున స్త్రీఘాతకునకు మరణమే తగినశిక్ష. వానికులముతో నిచట్ప్రసక్తిలేదని రాజాజ్ఞను నివేదించెను. అధికరణికులు చండాలురను బిలిపించి చారుదత్తుని వారలకప్పగించిరి. చారుదత్తుఁడు తనకొమరుని నొకసారి చూపింపుమని మైత్రేయుఁగోరెను. మైత్రేయుఁడు రోహసేనుని దీసికొనివచ్చుటకై వెళ్లెను.

---

# ఉపసంహారము

ఇరువురు చండాలురు చారుదత్తుఁడు ముందువెనుకలుఁగా నడచుచున్నారు. ఇంకను చాలమంది వారిని చుట్టిముట్టి యున్నారు. రూపముచే నేటిచారుదత్తుఁడు నాటిచారుదత్తుని కంటె భిన్నుఁడు. మున్ను విప్రజన పరివృతుఁడీనాఁడు చండాల జనసమావృతుఁడయ్యెను. ఒకప్పుడు సకలజన సమాశ్రయుఁ డగు నాతఁడిప్పుడు నిరాశ్రయుండు. చందనగంధ జాజికుసుమ

పరిమళ పరీవృత ప్రావారక సమాలింగిత దేహుఁడీనాఁడు శ్మశాన కరవీర కుసుమమాలాలింగిత గాత్రుఁడుగానున్నాఁడు. నాఁడు నగరమున కలంకార ప్రాయుఁడై తనయంతవాఁడు లేఁడనిపించుకొని తల యెత్తి తిరిగి నేఁడు తలవంచుచున్నాఁడు. ఆనాడు దివ్యజ్యోతియై వెలుఁగొంది యీనాఁడు చమురులేని దీపమయినాడు. కాలగతి కనిపెట్టువారెవరు ? ఆచారుదత్తుని యాకారమును బలియనుకొన్న విగావలయును కాకులు చుట్టు ముట్టి మొగుచుచున్నవి. ఆచండాలురచ్చటచ్చట ఘోషణ స్థానములం దాగుచు చారుదత్తునకు మరణదండన విధింపబడుటకుఁ కారణము ప్రజలకు విశదమగునట్లు చాటుచుండిరి. గుంపులుగుంపులుగా జనులుచేరి చారుదత్తునిజూచి విచారమును ప్రకటించుచున్నారు. ఆ చూచుచున్నవారిని చండాలుగ "ఆర్యులారా ! ఇంద్రధ్వజవిసర్జనము, గోప్రసవము, నక్షత్రపతనము సత్పురుషవధ యను నీ నాల్గును చూడదగనివని పెద్దలు చెప్పుదురు. మాచే వధ్యస్థానమునకుఁ గొనిపోబడుచున్న యీసత్పురుషుని జూతురేల ? తొలంగిపొండు తొలగిపొండ"ను చుండిరి. వనితాజనము సౌధాగ్రములందు నిలచి చారుదత్తునిజూచి యాతని నేటి దీనస్థితికి కన్నీరు మున్నీరుగా దుఃఖించుచున్నది. ఈనగరమున ఆర్య చారుదత్తునివంటి సజ్జనుఁడెవఁడున్నాఁడు ! ఆత్యాగకల్పకము నాశ్రయించని యాచక విహంగము గలదా ? యజ్ఞయాగాది విధి విహిత సత్కర్మాచరణముచే నతని వంశమతి పవిత్రమైనది గదా ! ఆతఁడొనర్చిన పుణ్యకార్యము లనంతములు గదా! అట్టివానికీ పాపమెక్కడనుండి వచ్చి చుట్టుకొన్నది ! అయ్యో

యనుకొనుచు నొకవిధముగాఁ జూచుటయుఁ బాపమేయను కొన్నారు గావలయునుఁ నచటనుండి తలలువంచి వెళ్ళిపోవు చున్నారు. కొంతమంది తమ మొగము గన్పింపకుండ నుత్త రీయపుఁ జెరగుతోఁ గప్పుకొని వెళ్ళుచున్నారు. విపత్తునంది యున్న శ్రీమంతునిజూచి విచారపడు లోకమునకు దరిద్రుని యాపద కనఁబడు టెట్లు? చండాలురట్లే చారుదత్తుని వధ్యస్థాన మునకుఁ గొంపోవుచుండిరి. ఇంతలో రోహసేనుని వెంటనిడు కొని మైత్రేయుఁడు వారున్నకడకు వచ్చెను. రోహసేనునకా చండాలురనుజూచి కోపమువచ్చెను. వారు తన తండ్రిని నచ టకో తీసికొనిపోవుచున్నారు. తన తండ్రికేదో గుర్తుపట్టలే కుండ వేషము వేసినారు. తనతండ్రి కంటివెంట నీరు గార్చు చున్నాఁడు. మున్నెన్నఁడు దాను దన తండ్రి కంటితడి చూచి యెఱుఁగడు. చండాలురకుఁ దన తండ్రిపై నింతపగయేల? ఎన్ని సారులడిగినను మైత్రేయుండైనను జెప్పడే. తుదకాతఁడుచండా లురను జూచి “ఓరీ! మాతండ్రిని వదలిపెట్టుఁడు. కావలసినచో నేను వచ్చెదనులే” యనెను. చారుదత్తుఁడు రోహసేనునిగాఁగ లించుకొనెను. నిమీలితనేత్రుఁడై యాతఁడట్టులే కొలఁది క్షణములు నిలచిపోయెను. ఆతని నలముకొన్న దవానలముపై కుంభవృష్టి గురిసెనేమో ? హృదయ పరితాపమునకది చంద నానులేపమేమో ? అప్పుడప్పుడా చండాలురు చాటుచున్న చాటింపుతో వసంతసేనను ఆర్యచారుదత్తుఁడు చంపెననుమాట చారుదత్తునకు మరణదండనకంటెను మనోవ్యథ గలిగించు చుండెను. ఇంకను దనపేరునందు “ఆర్య” పదమెందులకు ? అతఁడు తలవంచుచుండెను. పాపమా చండాలురేమిచేయు

గలరు ? వారు వారి యుద్యోగధర్మమును నిర్వర్తించుట తప్ప గునా ! సత్పురుషులను జూచి యోర్వలేక ద్రోహము తల పెట్టినవారు, గుణదోషములను బరిశీలింపక శిక్షవిధించునట్టియధి కారులు, నది గమనించలేని రాజును పాపకర్ములగుదురు గాని స్వధర్మమును నిర్వర్తించు చండాలురు చండాలురు గానేకారు.

వారట్లు నడచిపోవుచుండగా ప్రక్క గానున్న మేడమీది గదినుండి యొక పురుషుఁడు వారిమధ్య వచ్చిపడెను. అప్పుడే తెగిన సంకెల యొకటి వాని కాలికి గలదు. అతఁడు చారు దత్తుని దీసికొనిపోవుచున్న చండాలురను వారించి యిట్లు చెప్పఁ దొడంగెను. "అయ్యా ! నేను రాజస్యాలకుఁడగు శకారుని చేటుఁడను. స్థావరకుఁడను వాఁడను. నేను నిజము చెప్పుచు న్నాను. ఈ వ్యవహారమున చారుదత్తుఁడే పాపమును నెఱుఁ గఁడు. దోసమంతయు నాది మాస్వామిద"నెను. ఎండలకెండి మాడిపోవుచున్న పైరుపై ద్రోణమేఘమువచ్చి వర్షించినట్లీతఁ డెవ్వఁడని యాశ్చర్య చకితులై, యేమేమని వారలాతనిని ప్రశ్నిం చిరి. చారుదత్తుఁడాతని మాటలువిని నాకీనింద తప్పినతఱువాత మరణదండనమైనను పుత్రజననముతో సమానమైనదే యను కొనెను. స్థావరకుఁడు మఱలచారుదత్తుఁడు నిరపరాధి యనియు, నపరాధి శకారుఁడేయనియుఁ జెప్పెను. తన భవనములోనున్న శకారునకు వీధిలోని చాటింపు వినఁబడెను. అతని కానందము గలిగెను. తనకు శత్రువగు చారుదత్తుఁడు వధింపఁబడగాఁ దాను గన్నార చూడవలెను. శత్రువధ చూచినవారికి భవిష్యజ్జన్మ మున నేత్రరోగము రానేరాదట. కావునఁ దాను చారుదత్తుని వధ చూచి యేతీరవలెను. అతఁడు తనభవనమునుండి బయటకు

వచ్చెను, చారుదత్తుని చుట్టుముట్టి గుంపుగా నెందరోయుండిరి. చారుదత్తుఁడు కనుపించుటే లేదు. ఎంతమంది! యెంతమంది! దరిద్ర చారుదత్తుని వధ్యస్థానమునకుఁ గొనిపోవుచున్నప్పుడే యింతమంది గుమిగూడిరిగదా! రాజస్యాలకుఁడు వరపురుష మనుష్యుఁడు వాసుదేవుఁడగు తనకాస్థితి పట్టినచో, దన్నట్లు దీసికొనిపోవుచున్నచో నిక నెంతమంది గుమిగూడెదరో కదా యనుకొనుచు నాతఁడును వారిమధ్యకు వచ్చెను. అచటఁ దన చేటుఁడు స్థావరకుఁడు గన్పడెను. శకారుఁడు నివ్వెరబోయెను. తానాతనిని దన భవన ప్రతోళికయందుఁ గట్టి పడవైచెను. తానేదికోరి యాపనిఁ జేసెనో యదియంతయు వ్యక్తమైనట్లేగదా! తనగుట్టు వీఁడు బయటపెట్టకుండునా? శకారుఁడు చేటుని వెనుకకుబిలిచెను. చేయిపట్టి లాగఁజొచ్చెను, చేటుఁడు వానినిజూచి "ఓయీ! అనార్యుఁడా! నగరమునకు తిలకమగు వసంతసేనను జంపినదిచాలక యిప్పు డర్థిజన కల్పకమగు ఆర్యచారుదత్తుని గూడ చంపుట కుద్యుక్తుఁడవైతివిగా! నీదుర్మార్గ మెంతకాలముదాగునులే యనుచుండఁగనే శకారుఁడు వాని చేతి లోనొక పైడికడియముంచి "ఓరీ! నీకీబంగారమిత్తును మాట్లాడకు మని మెల్లగా ననుచునే" వీఁడి మంపతెగ! వీడు మాయింట కోశాగారమునకుఁ కాపలాయుండినట్లేయుండి దొంగతనముచేసెను. అందుచే వీనిని గట్టివేసి మాప్రతోళికయందుఁ బడవేసితిని. ఇదిగో! వీనిచేతిలో బంగారుకడియము చూడుఁడు వీఁడు. తప్పించుకొనివచ్చి నామీఁది పగచే వీఁడేదేని చెప్పును. వీనిమాటలు విశ్వసింపఁదగ"దనెను. చేటుఁడు "అయ్యా! ఈతఁడీ బంగారమిచ్చి నన్ను ప్రలోభపెట్టుచున్నాఁడు చూడుఁడు". నిజముగా

వసంతసేనను చంపినదీతఁడే. చారుదత్తుడే పాపము నెఱుఁగడ" నుచుండగనే శకారుఁడు "మీరుత్వరగా రాజాజ్ఞను నిర్వర్తిం చెదరాలేదా" యని తొందరించెను. చారుదత్తుడు రోహసేనుని జూచి "కుమారా! నీవు, నీతల్లి త్వరలోనే యీ నగరమును విడిచి యేయరణ్యమునకో పోవుటమంచిది. లేనిచో నామూల మున మీకును నపకారము జరుగగలదుహో"య్మనెను. శకా రుఁడు చండాలురను బిలిచి "ఓరీ! మీరలీ కుఱ్ఱవానినిగూడ చంపివేయుఁడ"నెను. వారలాతని మాటల కేవగించుకొనుచు రాజాజ్ఞ యెంతవఱకో యంతవఱకే మేము చేయువారముగాని దుష్కార్యము లాచరించువారముగా"మనిరి. చారుదత్తుఁడు మైత్రేయునితో "మైత్రేయా! రోహసేనుని గొనిపోయి తల్లి కప్పగించుము. మీరుమువ్వురు సుఖముగానుండు"డని పంపెను. మిక్కిలి బలాత్కరింప మైత్రేయుఁ డచటనుండి వెడలిపోయెను.

చండాలురు చారుదత్తుని వెంటనిడుకొని నఁటిరియొకఘో షణాస్థానమునకువచ్చిరి. ఈసారివధించవలసిన దెవరని యాచం డాలురమధ్య సంశయముబయలుదేరెను. తుదకు వారిసంప్రదా యానుసారము లాటరీ వేసికొనిరి. అవంతువచ్చినవాఁడిట్లు చెప్పఁదొడఁగెను. "ఓరీ! ఇది నావంతైనచో మానాయన చెప్పి నట్లు వధ్యస్థానముచేరినవెంటనే వధింపక కొంతతడవాలసించ వలయును. ఎందువల్లననగా నెవఁడేని ధనవంతుఁడు రాజునకు ధనమొసంగి యపరాధిని విడిపించవచ్చును. ఒకవేళ రాజున కొసమయమున కొడుకుపుట్టవచ్చును. అప్పుడు బందీలను వధ్యులను విడిచిపెట్టుదురు. మఱియొకప్పుడు రాజపరివర్త నమేగావచ్చును. అప్పుడును నపరాధులను విడిచిపెట్టుదురు.

కావున నాలసింపవలయు"నని. శకారుఁడు చండాలురను తొం దరపెట్టఁజొచ్చెను. చండాలురు చారుదత్తుని పదపదమని హెచ్చరించిరి. చారుదత్తుని వదనము విచారగ్రస్తమయ్యెను. వారలాతనింగాంచి "ఆర్యచారుదత్త ! విచారింపవేల? నీకీమా త్రము తెలియదా ! లోకమునకు సాక్షిభూతులై గగనతల మందు సంచరించెడు సూర్యచంద్రులకు సైతము శత్రుకృత పరిభవముదప్పుటలేదు. చక్రనేమిక్రమముగ మానవదశక్రిందు మీదులగుచుండును. ఉత్థితుఁడు పతితుఁడగును. పతితుఁడు త్థితుఁడగును. ఇవన్నియు నెఱింగి నీవు మనస్సును చిక్కబట్టు" మనిరి. వారలచటనుండి బయలుదేరిరి.

---

౯

బౌద్ధ శ్రమణకుఁడు వసంతసేనకుఁ దగిన యుపచారము చేయించి యామె స్వస్థతగలదైన తర్వాతఁ దన ప్రవ్రజనము సార్థకమయ్యెనని యెంచెను. నిజముగా నామె యానాడు దన కొనరించిన యుపకృతి యసామాన్యము. ఆమె యౌదార్య మనన్యము. ఆమె కామెసాటి. ఆమె స్త్రీకల్పనుయ్యు వేశ్యాజన్మముచే నింతటి యిక్కట్టునకు గురియైనది. ఎన్నడైనఁ దానామెకుఁ జేయదగిన ప్రత్యుపకారమేదియుండును ? నేటికీ

మూలమున దాను ప్రత్యుపకృతి యొనర్పఁగలిగెను. ఆబౌద్ధ శ్రమణకుఁడు వసంతసేనను వెంటనిడుకొని యామె చెప్పిన ప్రకారము ఆర్యచారుదత్తుని యింటికిఁ దీసికొనిపోవుచుండెను. వారు రాజమార్గమునఁ బ్రవేశించిరో లేదో దూరముగా నొక జనసమూహము కోలాహలము గోచరించెను. అది యేమై యుండవచ్చునా యని ఆలోకింపఁ దొడంగిరి. ఇంతలో చాటింపు వినఁబడెను. అది వారికి విషాదమును గల్పించెను. గోరుచుట్టుపై రోకటిపోటువలె నిదివచ్చి పడినది. ఎవఁడా దుర్మార్గుఁ డార్యచారుదత్తునిపైఁ దెచ్చినది? వాఁడెవఁడో కాఁడు. ఆ దుర్మార్గుఁడున్నాఁడే యాతఁడే యాశకారుఁడే. ఎంతటి దుర్మార్గమునకైనను వెనుదీయని వాఁడా నీచుఁడే యను కొనుచు త్వరత్వరగా వచ్చి జనసమ్మర్దమును చీల్చికొనుచు చారుదత్తుడు మొదలైనవారున్న ప్రదేశమును చేరిరి.

వధ్యశిలపైనిలఁ బెట్టఁబడిన చారుదత్తుఁడు తలవరుల మాటననుసరించి యిష్టవస్తు సంస్మరణముచేసికొనుచున్నాఁడు గావలయును. నయనములుమూసికొనియున్నాఁడు. వధించు వాఁడాతనిపైకి ఖడ్గము నెత్తెను. అదిజారిక్రిందఁబడెను. వాఁడు కత్తిపిడిని తనపిడికిటితో గట్టిగా నేపట్టుకొనెను. కాని యదియెందులకో జారిక్రిందఁబడెను. ఇదిచారుదత్తునకు శుభసూచకమే యని వారనుకొనిరి. చారుదత్తుఁడే బ్రతికినచో చండాలకుల మునకు నిందతొలఁగును. కావున చారుదత్తునిగాపాడుమని యా చండాలుఁడు తనయిష్టదైవతమగు సహ్యవాసినిని వేడు కొనఁజొచ్చెను. ఇంతలో వసంతసేన "వసంతసేనయిదిగో! వసంతసేనయిదిగో! ఏవసంతసేనమూలమున నార్యచారుదత్తు

నకీదుర్గతిపట్టెనో యట్టి నిర్భాగ్యురాలను వసంతసేనయిదిగో"
యనుచు చారుదత్తుని సమీపించెను. "ఆర్య! చారుదత్త! నీకిట్టి
స్థితి సంభవించినదే"మని వసంతసేనాశ్రమణకు లడిగిరి.
చారుదత్తుడు వసంతసేనను జూచెను. ఈమె వసంతసేనయేనా!
తానేమైన కలగాంచుటలేదుగదా! లేకున్న చచ్చిన వసంత
సేనవచ్చుటేమి! అసలు తానీప్రపంచములోనేయున్నాడా!

సంభ్రమాశ్చర్యములనుండి బయలుపడి యాతడు
కుశలప్రశ్న గావించెను. చండాలురలో నొకడా వృత్తాంత
మును నివేదింప రాజుకడకేగెను. శకారుడు పారిపోజొ
చ్చెను. వసంతసేనను జంపినవానిని వధింపుడని రాజాజ్ఞ
యుండుటచే నీవ్యవహారమందపరాధి శకారుడని తేలినది
గావున వానినిబట్టుకొనుటకై యొకడు వానివెంబడించిపో
యెను. చారుదత్తుడు వసంతసేననుజూచి మృత్యువశంగతుం
డను కానున్న నన్ను మృతత్వమునందజేయు విద్యవలెం జేరి
నది. ఈమెమూలమున పతితము కానున్న యీదేహమీమె
మూలముననే రక్షింపబడినది. పరేతుడగు జంతుదేహుడు
పునర్జీవితుడగును? వధ్యసంబంధములగునట్టి యీయెఱ్ఱని
వస్త్రమూ, ఈపూలమాల, ఈపటహాధ్వను లిప్పుడున్నియు
వసంతసేనా సమాగమముచే వివాహసంబంధమైనవిగా బరిణ
మించినవనుకొనుచు శ్రమణకుని జూచి యీతడెవ్వడని
ప్రశ్నించెను. వసంతసేన "నేనా యనార్యుడగు శకారునిచే
జంపబడి యీయార్యమహాశయునిచే బ్రతికింపబడితి"ననెను.
శ్రమణకుడు చారుదత్తుని జూచి "ఆర్యచారుదత్త! నన్నుగు
ర్తింపలేదా? సంవాహకవృత్తిచే తమవద్ద దాసవృత్తిని జేసిన

వాఁడనుగదా? నాదుర్యోగమున ద్యూతకరులకు బాకీపడి వారలచేపీడింపఁబడఁజొచ్చితిని. నాపుణ్యవశమున నీయార్యురాలు నన్ను దనుసేవకుఁడని తెలిసికొని సువర్ణకంకణ ప్రదానముచే వారల బారినుండి విడిపించినది. నేనానాటనుండి విరక్తుఁడనై బౌద్ధశ్రమణకుఁడనైతిని. ప్రవహణవిపర్యాసముచే తన యుద్యానవనమునకు వచ్చిన యీమె తన్ను కామించలేదని శకారుఁడీమెను గొంతుపిసికి పడఁద్రోసివెళ్లెను. దైవయోగమున పునర్జీవితురాలైనది" నెను. వారందరు చారుదత్తుని భవనమునకు బయలుదేరిరి.

---

## 3

నగరమందెచ్చటఁజూచిన నిద్దరు ముగ్గురుగా జనులుచేరి గుసగుస లాడువారే! తెలిసియుఁ దెలియనివారి యట్లభినయించువారు గొందరు. తమనోటివెంట వచ్చుచున్న మాటల నితరులెవరేని విందురేమోయని భీతులువోలె జూచుచు మెల్లగా మాట్లాడువారు గొందరు. ఇంతపని యింతత్వరలో జరుగునను కొనిన వారెవ్వరులేరు. ఈ పని జరుగుట మాటలా యనుకొన్నవారే యందరును. ఒక్కపూటలో నెంతపని జరిగినది! ఆసిద్ధుని మాటలసత్యము లెందుకగును? అవును ఆపాలక మహారాజును మంత్రులు మున్నే విడనాడిరి. ఆసిద్ధుని మాటలు విన్ననాటి

నుండి దండనాథులు మొదలగువారుగూడ పాలకుని విడిచి యార్యకుని జేరిరి. ఇక పాలక మహారాజేమిచేయఁ గలఁడు! అసామాన్యుఁడు నతిసాహసియగు నాశర్విలకుఁడున్నాఁడే యతఁ డార్యకుని పక్షమువాఁడు. పక్షమువాఁడేమిటి ప్రాణమిత్రము. ఆతఁడే యింతపని చేయించియుండును. చేయించవలసిన కర్మ మేమి? చేసియేయుండును. యజ్ఞవాటికయందు దీక్షితుఁడై యున్న పాలకుని దక్ష ప్రజాపతినిఁ జేసినట్లు చేసినాఁడు. ఆసమ యమున నాభయంకర దృశ్యమును జూచి భయపడి పారిపోవని వారెవరు? "జీవన్ భద్రాణి పశ్యతి"యని పారిపోయినవారే. ఆర్యక శర్విలకులు నూతన రాజ్యమును నుజ్జయిని యందలి వేణాతటగత కుశావటి యందేర్పరుప నిశ్చయించిరి. ఈ సమ యమున తమ రాజ్యము నిర్వహించుట కన్నివిధములఁ దగిన వాఁడు చారుదత్తుఁడే. ఆ చారుదత్తుని బిలుచుకొనివచ్చుటకై శర్విలకుఁడు బయలుదేరెను.

చారుదత్తునకు శకారుఁ డపకృతి యొనర్చెననియు నాతఁడా యిక్కట్టునుండి దైవకృపచే గట్టెక్కెననియు నెవరో ముఖ్యులైనవారే చెప్పిరి. ఇప్పుడా శకారునిబట్టి చిత్రవధ చేయవలయును. ఆశర్విలకుఁడు శకారుని బట్టి తెండని కొందరిని నియోగించెను. శర్విలకుఁడు చారుదత్తుని సమీపించి నమస్క రించెను. చారుదత్తుఁడు మున్నెన్నఁడును శర్విలకుని జూచి యెఱుఁగఁడు. శర్విలకునియందెంతయో వినయము గోచరించు చుండెను. తనవలన నాతఁడేదేని యుపకారము పొందెనా? ఎంతమంది పొందలేదు. ఆతఁడు దన్నుజూచి భయపడుచున్న ట్లును గోచరించుచున్నాఁడే. చారుదత్తుఁడు శర్విలకుని "ఓయా

నీ వెవ"రని ప్రశ్నించెను. ఆతఁడు వంచిన తల యెత్తకుండ నాటి సువర్ణభాండాపహారణమును గూర్చి చెప్పఁ దొడఁగెను. మధ్యలో చారుదత్తుడు వానిని వారించి "నీవు నామిత్రుఁడవై నందులకు సంతసించుచున్నా" ననెను. శర్విలకుఁడు దాను వచ్చినపనిని నివేదించెను.

ఇంతలో నచటకు బంధితుఁడైన శకారుఁడు గొనిరాఁబడెను. శకారుఁడు తన్నుఁ గాపాడుమని చారుదత్తుని పాదములపైఁ బడెను. వానినిజూచి జాలిపడి చారుదత్తుఁ డభయమిచ్చెను. శర్విలకుఁడు చారుదత్తునితో "ఆర్యచారుదత్త! ఈ నీచునిపై జాలిదలతువేమి? ఈతనిని గట్టివేసి కుక్కలచే బీకించవలయును. శూలారోపము చేయించవలయును. అంపములచే గోయించవలయును గానివిడిచిపుచ్చ దగునా"యనెను. చారుదత్తుఁడదివిని "ఓయీ! కృతాపరాధియయ్యు శత్రువు పాదపతితుఁడయ్యేనేని యుపేక్షింపఁదగును. నిజముగా శత్రువును వధించుటకు శస్త్రముక్కఱలేదు. ఉపకారము చాలును. అందును వీఁడు శరణాగతుఁడు. కావున వీనిని వదలుటే తగు" ననెను. శకారుని వదలుఁడని శర్విలకుఁడాజ్ఞాపించెను. భటులాతనిని వదలిపెట్టిరి.

చారుదత్తుని మరణవార్త చెవిని బడకమునుపే చనిపోవలయునని ధూతాదేవి యత్నించెను. రోహసేనుఁడామె పైట చెఱఁగుపట్టి వెనుకకు లాగుచు విడువఁడయ్యెను. చారుదత్తుఁడు క్షేమముగా నుండెననియు, నాతడింటికి వచ్చుచుననియు, చందనకుఁడు ధూతాదేవికిఁ జెప్పి యామెను వారింపదొడగెను. కాని యామె వానిమాటవినక పోవుటచే చందనకుఁడు పరుగెత్తి

కొనుచు వచ్చి చారుదత్తున కాసంగతిచెప్పెను. చారుదత్తుఁడు త్వరగావెళ్ళి ధూతాదేవికన్నులఁ బడెను. రోహసేనుఁడు తండ్రి చంకకెక్కెను మైత్రేయుఁడు చారుదత్తుని గాఢముగా నాలింగనము చేసికొనెను. ధూతాదేవి వసంతసేనను చేరదీసెను. నూతనరాజ్యమున చారుదత్తుని మాటప్రకారము ఆర్యకుఁడు రాజయ్యెను. చందనకుఁడు పృథివికి దండపతి యయ్యెను. శ్రమణకుఁడు సకలబౌద్ధవిహారముల కధిపతియయ్యెను. చండాలురు చండాలరాజులైరి. శకారుఁడు పూర్వవైభవము గలిగి యుండెను.

కూపయంత్ర ఘటికాన్యాయముగా లోకమునుద్రిప్పుచు

జూచియానందించు విధికి నమోవాకములు.

సర్వేజనాస్సుఖినో భవంతు.

